# INTRODUCTION

In the Government Oriental Manuscripts Library, Madras, there are two copies of PANCATANTRI by Bhanu Kavi, one a palm-leaf manuscript bearing D. No. 3025 which is in a much injured condition and the other a paper manuscript described under D. No. 2394 which is a restored copy of the palm-leaf manuscript. Some lines and words are missing here and there in these manuscripts. The first story and a portion of the second story at the beginning of the fifth Asvasa are missing. As there was no other manuscript in good condition available to compare and collate, the lacunae had to be filled as far as possible according to the sense and the context.

Madiki Singanarya in his "SAKALANITI SAMMATAMU" has quoted some verses from a PANCATANTRI. From this it is presumed that a PANCATANTRI should have existed prior to the PANCATANTRAS which are now available in the form of Campu. Particulars about this work are not known except its name.

During the time of Sri Krishnadevaraya three PANCATANTRAS were written in the form of Campu the first by Dubagunta Narayana Kavi, the second by Tippaya Bhaskara Bhanu Kavi (the present work) and the third by Parvataraju Venkatanatha Kavi.

Of these three, the work written by Dubagunta Narayana Kavi is the first. The present work by Bhanu Kavi is the second and the work by Venkatanatha Kavi is the third. According to the late Dr. Chilukuri Narayana Rao, Venkatanatha Kavi was a contemporary of Acyutadevaraya.

The author of the present work was a great rhetorician. He belonged to Srivatsa Gotra and was honoured in royal courts. He was well acquainted with the various modes of classical literature (*Vide* page 4 verse 19) and was a devotee of Siva.

From the colophon it is understood that Tippaya was the father of the present author and that the author was also known as Bhanaya. It is also known that he wrote this work at Vidyanagar during the reign of Sri Krishnadevaraya (*Vide* verse 51 Asvasa V).

The author Bhanukavi has dedicated this work to Bhandaru Lakshminarayana also known as Lakshmamantri and Lakshmayamantri, an instructor of music and dance in the palace of Sri Krishnadevaraya, and the author of "SANGITA SURVODAYA" in Sanskrit. In the introductory portion of this work (*Vide* my Telugu Introduction page 5-7, Sanskrit verses), he has described the expeditions of Sri Krishnadevaraya and how he honoured him.

These verses, while mentioning the victories of Sri Krishnadevaraya at Sivasamudram, Udayagiri, Kondavidu, Kondapalli, Gobburu and Rachur and the erection of a pillar at Pottunuru to commemorate his victory, also state that Lakshmayamantri was a great favourite of Sri Krishnadevaraya, that he was unequalled in the science of dancing and music, that he

wrote several works on these subjects, that he was highly praised by the great poets and musicians of that time and that he had the unique title of Abhinavabharatacarya. Under the patronage of Sri Krishnadevaraya he wrote Sangita Suryodaya after a critical study of the views of the earlier writers on the subject. This Lakshminarayana was of Bharadvaja Gotra. He was the grand son of Kesavamatya and Gauramamba and the son of Vittalesvara and Rukmini. He mentioned Vishnubhattaraka as his Guru. The same Vishnubhattaraka is also mentioned by Bhanukavi as "నా నా విధ కళాప్రవీణత దిక్కుల వెలసిన భరతము విష్ణు భట్టు" Lakshminarayana had also the titles of Sukshmalikhitacarya, Rayabayakara, Todaramalla and Abhinava Bharatacarya.

**PANCATANTRA**

In five chapters, each dealing with Mitrabheda, Mitralabha, Sandhi-vigraha, Labdhanasa and Asampreksakaraka, Visnusarma wrote Pancatantra a code of morals for the purpose of giving instruction to princes in political science. In no time it gained popularity not only in India but also in the western countries and consequently translations of it in different languages have appeared.

It is not out of place to make a comparative study of the three Telugu Pancatantras mentioned above. None of them has strictly followed the original in translating. Either some of the stories are omitted or many of them have been elaborated and in some cases there are deviations from the original.

In the Pancatantra, Venkatanatha succeeded in introducing morals and political science as a formality. He had the courage not only to incorporate lengthy descriptions but also to magnify the story into a full-fledged Kaya with all its Lakshanas. The other two works, though small in volume and look inferior to Venkatanatha's in poetic exuberance, are lucid, crisp and pregnant with meaning. Again in the clear exposition of the story with poetic exuberance and in introducing dialogues, Bhanukavi's stands second and Narayana Kavi's first. Apart from this, these two works have many similarities. A few verses of Narayanakavi are found in Bhanukavi's Pancatantri (*Vide* Text pages 73, 74 Verses 70, 71, 72 and Narayanakavi Pancatantra Asvasa II —Verses 108, 109, 110 etc.). Its value is more as a book to be studied by all students of Telugu literature even as the well-known Niti Satakas are studied. The beauty of his style and poetic skill are clear from verses 277, 278 and 279—Page 49. A few of his rhetoric acrobats are explained in the Telugu introduction.

Finally my thanks are due to Sri Mallampalli Sarabhayya, Pandit of the Library for preparing the press copy and correcting the proofs, and to the Swatantra Printers for executing the printing in the best manner possible.

T. CHANDRASEKHARAN.

Govt. Oriental Manuscripts Library,
MADRAS, 10-12-'51.

# పీఠిక

## మాతృకలు

చెన్నపురి ప్రభుత్వప్రాచ్యలిఖితగ్రంథాలయమున, నీ భాసుకవి పంచతంత్రమునకుఁ బ్రతులు రెండు గలవు, ఒకటి తాళపత్రప్రతి. డి. నంబరు, 3025. వేఱొకటి కాగితపుఁబ్రతి. డి. నంబరు, 2681. కాగితపుఁబ్రతి మొదటిదానికిఁ బ్రతిక. దీనియం దచ్చటచ్చటఁ గొన్ని పద్యచరణములును, గొన్ని పదములును లోపించినవి. పంచమాశ్వాసమున, మొదటఁ గొంత గ్రంథపాతము గలదు. అసంప్రేక్ష్యకారిత్వమను నీ పంచమతంత్రమునను, బహుశః మొదటి కథయును, రెండవ కథలోఁ గొంత భాగమును లోపించినవి. అశిథిలమగు ప్రత్యంతరము దొరకమిచే, లుప్తభాగములను బూరించుటకుఁగాని, సందిగ్ధ స్థలములఁ బాఠనిర్ణయమొనరించుటకుఁగాని యవకాశము లేమిని, తోఁచిన రీతిని, ఆయా స్థలములలోఁ బరిశిష్టభాగములనుబట్టి, భావములను బోల్చికొని కొన్నికొన్ని పూరణములను, సందిగ్ధ స్థలములఁ బాఠనిర్ణయములను జేయవలసివచ్చినది. అనువుకాని స్థలములను యథాతథముగనే యుంచి ముద్రింపవలసివచ్చెను.

## పంచతంత్రములు

మడికి సింగనార్యుఁడు తన "సకలనీతిసమ్మతమునఁ" బంచతంత్రములోని వని కొన్నిపద్యముల నుదాహరించియుండుటవలన, నిప్పటి కుపలభ్యమానము లగుచున్న చంపూరూపములగు పంచతంత్రములకన్న ముందే, ఒక పంచతంత్ర ముండినట్లు తెలియుచున్నది. కాని, అది నామమాత్రావశిష్టము.

శ్రీ కృష్ణదేవరాయలయుగమునఁ జంపూరూపమున వచ్చిన పంచతంత్రములు మూఁడు.

1. దూబగుంట నారాయణ కవిది.
2. తిప్పయభాస్కరునిది (ప్రకృత కావ్యము).
3. పర్వతరాజు వేంకటనాథ కవిది.

ఈ మూఁడును, శ్రీ కృష్ణదేవరాయల యుగమునఁ బరిమిత వ్యవధిలోఁ గొంచెము, ముందు వెనుకలుగ వెలసినవి.

ఇందు దూబగుంట నారాయణకవి గ్రంథము మొదటిది. కీ॥ శే॥ శ్రీ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి పరిశోధనవలన, వేంకటనాథ కవియు ప్రౌఢదేవరాయలకు సమకాలికుఁడని తేలుటవలన, ప్రకృతమగు నీ భానుకవి పంచతంత్రము రెండవదియును, వేంకటనాథునిది మూఁడవదియును నగుచున్నవి.

# కృతికర్త

తిప్పయభాస్కరునిఁ గూర్చి, యీ కావ్య ప్రస్తావనలో నున్న—

మ॥ "ఘనవాగ్వైభవ, మంత్రజ్ఞతన్, శ్రీవత్సాన్వయ ఖ్యాతి, భూ
నరమాన్య ప్రకృతిం బురాతన సుకావ్య ప్రౌఢిమన్ భారతీ
వరమంత్రి ప్రతిభన్ మహేశ పద సేవానిష్ఠ నిన్ బోల రు
ర్వరలోఁ దిప్పయ భాస్కరేంద్ర! [బుధవర్ణ్యమ్ముల్?] భవద్భాగ్యముల్"

యీ పద్యము వలన, నితఁడు లాక్షణికుఁ డనియును, శ్రీవత్స గోత్రజుఁ డనియును, రాజసభాపూజ్యుఁ డనియును, ప్రాచీన కావ్య భంగుల నెఱిఁగినవాఁ డనియును దెలియుచున్నది. ఆశ్వాసాంతగద్యములలో "భారతీ వర ప్రసాదలబ్ధ విద్యావిచిత్ర, తిప్పనమంత్రిపుత్ర, సుజన విధేయ, భానయ నామధేయ" అని యుండుట వలనఁ, దండ్రిపేరు తిప్పయ యనియును, నితనికి భానయ యని వాడుక వ్యవహారమున్నట్లును, దెలియుచున్నది. కావ్యాంతమున, నితఁ డిట్లు చెప్పికొనెను,—

సీ॥ పంపా విరూపాక్ష భైరవ విఠ్ఠలే
శ్వర ముఖ్య దేవతావ్రజము చేత,
పరిపంథి గర్వవిభాళన శ్రీ కృష్ణ
రాయ భూధవ భుజారక్షచేత,
భట నట జ్యౌతిష పౌరాణిక భిష
గ్విచక్షణ సత్కవీశ్వరులచేత,
సంతత మదవారి చారుశుండాల ఘ
టా జవప్రకట ఘోటములచేత,
గీ॥ రమ్యమై యున్న విద్యా పురంబునందు,
నిమ్మహాకృతి భాను కవీశ్వరుండు

తెనుఁగు బాస నొనర్చెను వినుతికెక్క-
నవని నాచంద్ర తారార్కమగుచు నుండ॥

దీనివలన కృష్ణదేవరాయల పరిపాలనకాలమున నీతఁడు విద్యానగరము నందుండి యీ కావ్యమును రచించినట్లు తెలియుచున్నది. ఏతత్—

# కృతిపతి

భండారు లక్ష్మీనారాయణుఁడు (ఈతనికి లక్ష్మీమంత్రి యనియును, లక్ష్మయమంత్రి యనియును గూడ వ్యవహారము) శ్రీకృష్ణదేవరాయల యంతఃపురమున నాట్య, సంగీత విద్యలను నాచార్యుఁడు. ఈయన గొప్ప విద్వాంసుఁడు. సంస్కృతమున "సంగీత సూర్యోదయ"మను పేర నుత్తమమగు నొక నాట్య, సంగీత లక్షణ గ్రంథమును రచించెను. అది తాళ, నృత్త, స్వరగీత, రాగజాతి, ప్రబంధాధ్యాయములను నైదుప్రకరణముల గ్రంథము.

ఆ గ్రంథము యొక్క- ప్రస్తావనలో శ్రీకృష్ణదేవరాయలవిజయ యాత్ర లను, తనకు రాయ లొనరించిన సన్మాన విశేషములను, నీ లక్ష్మీమంత్రి యిట్లు పేర్కొ-నెను.

శ్లో॥ కర్ణాటాంహ్వయదేశసౌఖ్యజననీ శ్రీ తుంగభద్రావృతా,
మాతంగోన్నత మాల్యవత్క్షితిధర శ్రీ హేమకూటాన్వితా,
పంపాధీశ్వర విఠ్ఠలేశ్వర కృపాదృష్టి ప్రభావమండితా
శ్రీ విద్యానగరీ విభాతి ధరణీ మాణిక్య ధమ్మిల్లవత్.

శ్లో॥ తస్యాం కాంచన మంటపే పరిలసన్మాణిక్య హీరావళీ
ప్రాంత ప్రోత విశుద్ధ మౌక్తికమణి శ్రేణీ రవై రంచితం
ఆరుహ్య ద్విరదారి పీఠమతులం ఠమ్మామీశ్వరస్యాత్మజో
నిస్తంద్రః ప్రశశాస తుర్వసుకులోత్తంసో నృసింహో నృపః.

శ్లో॥ కీర్తి స్ఫూర్తిభిరహ్న్యపి ప్రతికలం జ్యోత్స్నాం పరాంజృంభయన్
సద్వర్త్మ న్యభికామితేన సకలాన్ సంప్రీణయన్ ప్రాణినః
నిత్యాభిశ్చ కలాభిరుత్సుకతరం ధిన్వన్ బుధానాం వ్రజాన్
తస్మాద్దుగ్ధపయోనిధే రివ విధుః శ్రీ కృష్ణరాయోఽజని.

శ్లో॥ బాల్యేఽసౌ సకల కలాకలాపయుక్త
స్స్వప్రాణం సపది విజిత్య గంగరాజం
భంక్త్వా తచ్ఛివన సముద్రముత్కటం ద్రా
గావాసం వ్యతనుత నిష్కరం శివానామ్.

శ్లో॥ దుర్గం జిత్వాథసోఽసా వుదయగిరివరం తత్ర రాహుత్తరాజం
బందీకృత్వాఽశు హత్వా యుధి నగరవరే కొండవీడ్ కొండపల్ల్యౌ,
జీవగ్రాహం గృహీత్వా గజపతితనయం పొట్నూర్పట్టణాగ్రే
విశ్వశ్లాఘ్య ప్రతాపో బిరుదయుత జయస్తంభముచ్చైర్న్యఖానీత్.

శ్లో॥ సోఽయం కృష్ణనరేశ్వరో గజపతిం జిత్వా తదీయ శ్రియా
సాకం తస్య సుతా ముదూహ్య యవనక్ష్మాపం సపాదం తతః
గొబ్బూరు స్థలవాసినం సరభసం జిత్వాను విద్రావ్యతం
హస్త్యశ్వాన్ సతదీయదుర్గ మతులం రాచూరు మాదత్తవాన్.
కృష్ణా ముత్తీర్య సోఽయం యవనజనపదం వహ్నిసాత్కృత్య సర్వం
ఫేరోజాబాద సింబాద్యురునగర సమాఖ్యాని దుర్గాణి జిత్వా
భంక్త్వోచ్చైః పారశీకం కలుబరిగపురిం ద్రాక్ సపాదార్ధమానః
కా (క్రా) న్తా (న్త్వా) వ్యాకృష్టవాన్ దోర్బలఘనమహిమా త్రీన్ సుర
త్రాణపుత్రాన్.

శ్లో॥ తస్య శ్రీ కృష్ణరాయస్య కృపా క్షీరాబ్ధి చంద్రమాః
లక్ష్మీనారాయణో నామ వర్ధతే సరసాగ్రణీః.

శ్లో॥ యో భారద్వాజ గోత్రే సమజని శ్రుతవాన్ కేశవామాత్య వర్యః
తద్దేవీ గౌరమాంబా తదమల జఠరే విఠ్ఠలార్యో వరేణ్యః
తద్భార్యా రుక్మిణీతి ప్రచురతరగుణా తత్సుధాపూరగర్భే
లక్ష్మీనారాయణోఽయం జయతి భువి యతస్సావ్యదపత్యం సులక్ష్మా.

శ్లో॥ సోఽయం శ్రీ లక్ష్మణార్యో భరతమత మతంగాది మార్గేణ సర్వాన్
కృత్వా వేలాన్ ప్రబంధాన్, బుధ జన కవి సంగీత విద్యాధికానాం
మౌళీ నాకంపయన్ స్తానివ దివి విబుధాన్ నారదః కిన్నరాదీన్
భూమావ్ శ్రీ కృష్ణరాయ క్షితిపతి కృపయా వర్ధతే సర్వవన్ద్యః.

శ్లో॥ సదాఽభినవశబ్దాది భరతాచార్య నామకం
బిరుదం గాయనీ చక్రే ధత్తే చక్రమివాచ్యుతః.

శ్లో॥ శ్రీ మత్కృష్ణ నరేశ్వరస్య కృపయా స్వర్ణాంచితాం పాలకీం
ముక్తా గుచ్ఛ శతానుబద్ధ వలయం ముక్తాతపత్రద్వయం
శశ్వన్మత్త మతంగజాన్ మలహారీ వాద్యం నిజాంతః పుర
స్థానే, నాట్యరసాధిపత్య మపక్షల్లక్ష్మీపతిః ప్రాప్తవాన్.

శ్లో॥ స్వామినా కృష్ణరాయేణ సంసారానంద చిత్తవాన్
లక్ష్మీనారాయణో వక్తి కావ్య సాధన కారణం.

శ్లో॥ సంగీతాగమ లక్ష్య లక్ష్మ నిపుణై శ్శ్రీవిష్ణు భట్టాత్మజైః
జ్ఞాత్వా దత్తిల కోహళాది భరత గ్రంథాన్ సుటీకాన్వితాన్
భూమౌ కీర్తి శరీర రక్షణధియా గ్రంథః కృతోఽయం మయా
సంగీత గ్రహయోగ్యతాధికతర స్సంగీత సూర్యోదయః.

గద్య॥ ఇతి శ్రీమద్విప్రకుల ధుర్య భండారు విఠ్ఠలేశ్వర నందన, సూక్ష్మ లిఖితాచార్య, రాయబయకార, తోడరమల్ల, అభినవ భరతాచార్య శ్రీ లక్ష్మీ నారాయణ విరచితే సంగీత సూర్యోదయే తాలాధ్యాయః ప్రథమః".

పై శ్లోకములవలనః ప్రసిద్ధములగు శ్రీ కృష్ణదేవరాయల యాత్రావనా రంభమునుండి ప్రవృత్తములైన, శివనసముద్ర విజయము, ఉదయగిరి కొండ వీడు కొండపల్లి విజయములు, పొట్టునూరున జయస్తంభప్రతిష్ఠాపనము, గజ పతి విజయమును, గొబ్బూరు రాచూరు విజయములు మున్నగునవే కాక, ఈ లక్ష్మీమంత్రి రాయల కృపాక్షీరాబ్ధికిఁ జంద్రుఁ డనియును, నాట్యసంగీతముల నప్రతిమానుఁ డనియును, దత్ప్రతిపాదకములగు ననేక గ్రంథములను రచించి, నాఁటి విద్వత్కవులచేతను సంగీతవిద్యాధికులచేతను మిగులఁ బ్రశంసింపఁ బడినవాఁ డనియును, దన విద్యా ప్రాభవమువలన, ననన్య సాధారణమగు "అభినవ భరతాచార్య"బిరుదమును వహించినవాఁ డనియును దెలియుచున్నది.

ఇంతియకాక కృష్ణదేవరాయలవలన, బంగారు పాలకీయును, శత మౌక్తిక స్తబకాలంకృతములగు రెండు మౌక్తిక ఛత్రములను, మద గజము

లను, ప్రాభవ సూచకమగు మలహరి వాద్యమును, రాజాంతఃపురమున, నాట్య విద్యాధికారత్వ గౌరవమును గూడఁ బడసిన వాఁడని తెలియుచున్నది.

ప్రభుయొక్క సన్మానమున ననుస్వర్ణాభిషేకములను బడసి పూర్వ కాలమందున్న యీయనఘుఁడు, పూర్వాచార్యమతముల నెల్లఁ బరిశీలించి కీర్తి నిలుపు శాస్త్రమై యితర సంగీత లక్షణ గ్రంథముల వన్నెయు వాసియుఁ గలుగునట్లు సంగీత సూర్యోదయమను నీ మహాగ్రంథమును రచించెనఁట.

ఈ లక్ష్మీనారాయణుఁడు భారద్వాజ గోత్రుఁడు, గౌరమాంబా కేశవామాత్యుల పౌత్రుఁడు. రుక్మిణీ విఠ్ఠలేశ్వర మంత్రుల పుత్రుఁడు. ఈతని సాత సునుపుగాఁ జెప్పఁబడిన విష్ణు భట్టారకులను పంచతంత్రప్రస్తావమున, భానుకవి గూడ "నానావిధ కళా ప్రవీణత దిక్కుల వెలసిన భరతము విష్ణుభట్టు" అని పేర్కొనెను.

సూక్ష్మ లిఖితాచార్య, రాయబయకార, తోడరమల్ల, అభినవ భరతాచార్య అను నివి లక్ష్మీ నారాయణుని బిరుదాంకములు.

## పంచతంత్రము

సంస్కృతమున విష్ణుశర్మ బాలశిక్షార్థమై, సకల నీతి శాస్త్రముల సారము నుద్ధరించి మిత్రభేద, మిత్రలాభ, సంధి విగ్రహ, లబ్ధనాశ, అసంప్రేక్ష్య కారకములను నైదు తంత్రములతోఁ బంచతంత్రమను గ్రంథమును రచించెను.

"సకలార్థ శాస్త్రసారం
జగతి సమాలోక్య విష్ణుశర్మేదం
తంత్రైః పంచభి రేత
చ్చకార సుమనోహరం శాస్త్రం."

వ్యుత్పత్తిలాభమునకై ప్రథమాభ్యసనీయమగు నొక్క శబ్దశాస్త్రము నభ్యసించుటకే పంన్రెండేండ్లు పట్టును. పిమ్మట, మన్వాది ధర్మశాస్త్రములును, కౌటిలీయాద్యర్థ శాస్త్రములును, వాత్స్యాయనాది కామశాస్త్రములును నేర్చి,

స్వచ్ఛ సుందరమగు నీతిని శైలి బహు స్థలములయం దిట్లు జాలువాఱు చున్నది.

చం॥ నృపతి మదోద్ధతుండయిన నేర్పున మంత్రివరుండు రాచ కా
ర్యపు సరవుల్ ప్రజాహితతి నంటని యాపద, మంచివేళఁ దె
ల్పిపడఁగఁ జెప్పి వాని యవివేకము మాన్పి హితంబొనర్చినన్
విపులయశమ్ము నొందు గుణవిశ్రుత! విశ్వయ లక్ష్మధీమణీ!

చం॥ గురు వెలయన్ బ్రథాని, నృపకుంజరు నప్పకురీతి, నీతిశా
స్త్ర రుచిరచిత్తుఁ జేసి పరరాష్ట్ర సభాజనమెల్ల మెచ్చఁ బెం
పరుదుగ నుండెనేనిఁ దను నత్యధికంబగు నూత్న భోగముల్
సిరియును గీర్తిబొందు నిది సిద్ధము విశ్వయలక్ష్మధీమణీ!

ఉ॥ ఆరసి చూడ రాజు సుకృతాంచితుఁడైనఁ దదీయ సేవకున్
గ్రూరపు మంత్రి డాసిన సకుంతమతిం బ్రజ తల్లడింపుచున్
జేరదు నక్రమున్న సరసింబలె, సుగ్రఫణీంద్రమున్న ధా
త్రీరుహమట్లు వానిఁ గుఱిపేపక! విశ్వయలక్ష్మధీమణీ!

# ప్రయోగ విశేషములు

లక్షణజ్ఞుఁడని పేర్కొనఁబడిన యీ కవి కావ్యమునఁ గొన్ని నీహార లేశములవంటివి, "విష్ణుశర్మను" [విష్ణుశర్మ+అసు]మున్నగునదంత తత్సమపద సంధులును, "మేసచ్చుట", "అణఁగున్న" మున్నగు క్త్వార్థక సంధులును గాన వచ్చుచున్నవి.

కం॥ "లాంగూలంబ ల్లార్చి
ప్రమోఁగుచు" మున్నగు పూర్ణబిందు ఖండబిందు ప్రాసములును,

కం॥ "ఆకఁట చేతను విహారలు
ప్రాకట ఫల సంగ్రహమ్ము"

మున్నగు సబిందు నిర్బిందు ప్రాసములును గానవచ్చుచున్నవి. ఆత్మార్థమున నను ప్రయుక్తమగు "కొను" ధాతు వుండవలసిన స్థలములలోఁ "బుచ్చుక",

"చేసుక", "నిర్మించుక" అను రూపములును, "రాజుకు", "భూతలాధిపుకు" మున్నగునగాగమ విపరీత రూపములును గానవచ్చుచున్నవి. "వంప్షింపించి" యను ప్రయోగము కనఁబడుచున్నది.

"వానగాలిచేత వడలెల్ల స్రుక్కెను"

ఒడలని సంస్కరించిన యతి భంగమగును. దీనినిఁ గవి బుద్ధి పూర్వకముగనే వాఁడినట్లు తోఁచుట వలన నట్లే విడువఁ బడినది.

ప్రథమాశ్వాసము 263 వ పద్యము

కం॥ "మృతి వొందినట్లు దెలిసిన
యతనిం బొడగాంచి వారలావల నిడి యం
చితగతిఁ జన నతిగర్వితమనస్కుఁడై యా భవిష్యమతి యున్నంతన్."

అను దానిలో నాలుగవ చరణమునఁ బ్రాస భంగమైనది. ప్రత్యంతరము లేమిని సాధు పాఠమును బోల్ప ననువు పడలేదు.

"అతి గర్విత
మతియగుచును" నా భవిష్యమతి యున్నంతన్,

అని చదివి కొనిన సరిపడును.

గుణాభ్యర్హితమగు నీ కావ్యమున నిట్టి యల్పదోషములు పరిగణనీయములు కావు.

దీనిని ముద్రణమునకు సిద్ధపఱచి ప్రూఫులను జూచిన లైబ్రరీ పండితుఁడు శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ, సంస్మరణీయుఁడు. ముద్రణమునఁ దగు శ్రద్ధగైకొని దీనిని మేలుగ రూపెత్తించిన "స్వతంత్ర" ముద్రణాలయమువారికిఁ గృతజ్ఞతాభివందనములు.

—తి. చంద్రశేఖరన్.



# విషయ సూచిక



## ప్రథమాశ్వాసము
### (మిత్రభేదము)



## ద్వితీయాశ్వాసము
### (మిత్రలాభము)



## తృతీయాశ్వాసము
### (సంధి విగ్రహము)



## చతుర్థాశ్వాసము
### (లబ్ధనాశనము)



## పంచమాశ్వాసము
### (అసంప్రేక్ష్య కారకము)

# దిద్దుబాటులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 20 | సుత్రబోచు | సుతప్రోచు |
| 3 | 3 | జలనిసుల్, ననఘి | జలనిధుల్, ననధి |
| 4 | 6 | వరిష్ఠుండా | వరిష్ఠుండా |
| 4 | 20 | విర్థయ అక్ష్మమంత్రి! బుధ సేవ్యమ్ముల్? | చెప్పుము భాస్కరేంద్ర! [బుధవర్ణ్యమ్ముల్?] |
| 9 | 12 | సంపద బెంపొంద, | సంపదఁ బెంపొంద |
| 11 | 15 | గుర్ధమ్ములు | దుర్గమ్ములు |
| 13 | 7 | వథ. | వధ. |
| 21 | 20 | బొక్కుచు తన్ను, | బొక్కుచుఁ దన్ను |
| 31 | 16 | నూతన | నూత్న |
| 34 | 1 | మానవ నాయక! | మానవ నాయక |
| 35 | 3 | సంపదలను | సంపదలును |
| 40 | 2 | దానములకంటి | దానముల కంటె |
| 46 | 46 | మనస్కుడైయా | నుతియాగుచునునా |
| 47 | 27 | సుఖంబుండె | సుఖంబుండె |
| 50 | 12 | యటచు | యటంచు |
| 54 | 8 | భూతధాతీ | భూతధాత్రీ |
| 68 | 4 | మాంసములట్ల సెపుడు, | మాంసములట్ల యెపుడు |
| 71 | 20 | బిడ్డ | ఒడ్డ |
| 73 | 18 | మూర్తినై | మూర్తినై |
| 83 | 13 | వినమెం మది | వినమె! మది |
| 83 | 20 | మెయిపోకతో | మెయిఁబోకనన్ |
| 84 | 8 | నిలఁవమనిన | నిలఁపుమనిన |
| 88 | 28 | నీపెన్వండవు | నీ వెన్వండవు |
| 85 | 20 | సెప్పుమన్న | సెప్పుమన్న |
| 96 | 11 | నీ యాపులు | నీ యావులు |
| 101 | 21 | గూబల్లె | గూబలెల్ల |
| 109 | 24 | అక్ష్మధీమణి! | అక్ష్మధీమణీ! |
| 111 | 2 | కపిపుంగవఁ | కపిపుంగవ! |
| 121 | 8 | మూర్తీ! | మూర్తీ! |
| 121 | 13 | చెపుల పండువు | చెవుల పండువు |
| 123 | 14 | దాత్పర్యమున్ | దాత్పర్యమునన్ |
| 124 | 2 | సంతొపుఁడగుచు | సంతుష్టుఁడగుచు |
| 124 | 22 | దండమ్ముల్ | దండముల్ |
| 125 | 27 | * ప్రాసభంగము. | * ప్రాస భంగము, యతిభంగమును. |

మరా:—3 వ యాశ్వాసము 93 వ పద్యము వఱకును గల గ్రంథమునఁ "దోఁడ" వర్ణకమునను, "విఁగు" క్రియ యందును ప్రమాదవశమున నలుసున్న దొరలినది. వాని నుంచ వలసున్న లేదు.

నసే కాని పురుషార్థవివేకము సిద్ధింపదు. మనుష్య జీవితవ్యవధి యత్యల్పము, అనిశ్చితమునుగాన చిరకాల పరిశ్రమ సాధ్యములగు నీ శాస్త్రములను విడిచి సులభ మార్గమునఁ బిన్నలకు సకల నీతిశాస్త్ర సారమును దెలిపి, బోధాన్వితులను జేయుటకై విష్ణుశర్మ ఈ నీతిశాస్త్రసంగ్రహమును రచియించెను.

నాఁటినుండి యీ గ్రంథ మొక భారతదేశమునందే కాక, పరదేశ భాషల యందుఁ గూడఁ బరివర్తితమై మిగులఁ బ్రయోజనముకలదగుటవలన, బహుళ ప్రచారముగలదయ్యెను.

## ఆన్ధ్రీకరణ పద్ధతులు

తెనుఁగునఁ జంపూరూపమునఁ బరివర్తితములైన పై మూఁడు గ్రంథములయొక్క యాంధ్రీకరణ పద్ధతులను, ఒండొంటితోఁ బోల్చి యించుక పరిశీలించుట యిట నప్రస్తుతము కాదు.

కం॥ కోప ప్రసాదగుణములు
భూపాలునియందుఁ దెలిసి బుద్ధి నధికుఁడై
చాపల విరహిత హృదయుం
డై పెంపునఁ గొలువ నధికుఁడగు సేవకుఁడున్.

—భానయ.

కం॥ కోప ప్రసాద చిహ్నము
లే పార్థివునందు భృత్యుఁ డెఱిఁగి చరించున్
దీపించి వాఁడు నృపుచే
నేపారఁగ మంతుకెక్కు నెక్కుడు కరుణన్.

—నారాయణకవి.

కం॥ కోప ప్రసాద చిత్త
వ్యాపారము లెఱిఁగి కొలిచి వర్తిల్లు భటుల్
భూపాల బాహుశాఖా
రోపితులై యుంద్రు చనవు రొక్కంబవుటన్.

—వేంకటనాథుఁడు.

కం॥ ఒరులాడిన వాక్యమ్ముల
సరవిం బ్రతివాక్యములు రసస్థితి వాదమున్
ధరణిని బీజమ్ములు దా
మురువృష్టినిఁ బొడము కరణి నుచితమ్మగుచున్.

—భానయ.

కం॥ ఉత్తరమునఁ బొడమెడుఁ బ్ర
త్యుత్తర ముత్తరము లేక యుత్తరమగునే!
హత్తిన సువృష్టివలనన్
విత్తులకుం బొడమినట్టి విత్తులఁ బోలెన్.

—నారాయణకవి.

కం॥ తొడవుల క్రియ భృత్యుల నిలి
పెడి చోటుల నిలుపవలయు పృథివీశుఁడు పెం
పడర నటుగాక తక్కినఁ
దడఁబడుఁ గార్యములు దద్విధంబునఁ దలఁపన్.

—భానయ.

గీ॥ కనక భూషణ సముచిత క్రమమౌక్తి
కమ్ము లోహానఁ గట్టిన కరణి నధిక
[విధుల] పతిహిత మతులందు వెలయు భటులఁ
గూర్చు సిరి కన్య పురుషులఁ గూర్పఁ జనదు.

—భానయ.

కం॥ నరపతి భృత్యులఁ దొడవుల
నొరసి తగిన నెలవులందు నునుపక యున్నన్
జరణమ్మునఁ జూడామణి
శిరమున నందియయుఁ బెట్టు చెలువము గాదే!

గీ॥ కుందనము గూర్ప నందమై పొందు పడిన
పృథుల రత్నమ్ము వెండిలోఁ బెట్టునేని

రత్నమునకేమి కొఱంతగు! రాజు బంటుఁ
దగిన పనిఁ బెట్టకుండిన తగవుకాక.

—నారాయణ కవి.

కం|| శిరమున మకుటము, పదనా
భరణము కటి, నూపురంబు పదమునఁ బోలెన్
గురు బంధు భటుల నిల్పు, న
మరు నుత్తమ మధ్యమాధమ స్థానములన్.

ఆ|| వె|| అధమ వృత్తి కథకు నమరించు పతి తిట్టుఁ
గుడుచు గాదె! యారకూట కటక
కలితమణికి నింద గాద, పొనర్చిన
కుత్సితుండు నిందఁ గుడుచుగాని.

వేంకట నాథుఁడు.

సీ|| అరయ జాత్యంధున కద్దమ్ముఁ జూపు చం
దమున నరణ్య రోదనము మాడ్కి
చెవిటి కేకాంతమ్ము చెప్పిన కరణిఁ గృ
తఘ్నుని తోడి మిత్రత విధమున
జడధిఁ జిక్కిన వృష్టి పడుపున నూషర
స్థలమునఁ జల్లు బీజముల పగిది
షండుండు కన్య విచారించు పోలిక
పందికిఁ జందన పంకమట్లు
నతి వివేక విరహితాత్ముండునగు మహీ
పతికి నాచరించు హితవు, నిష్ఫ
లంబు నీతిఘనకళా చతురుండది
తెలియ వలయు లక్ష్మి! ధీసమేత!

—భానయ.

సీ|| దారుణాటవి రుదితంబుఁ జేసినయట్లు
చేది శవంబుఁ గై సేసినట్లు

నిర్జలంబైనచో నీరజం బిడినట్లు
వట్టి చోటను విత్తు వెట్టినట్లు
సారమేయము తోఁక జక్క గట్టినయట్లు
చెవిటి కేకాంతమ్ము చెప్పినట్లు
తనరఁ జీఁకునకు నద్దమ్ముఁ జూపినయట్లు
వెలిమిడిలో నెయ్యి వ్రేల్చినట్లు
చాల నవివేకి యైనట్టి జనవరేణ్యుఁ
దగిలి కొలుచుట నిష్ఫలత్వంబు సేయు
సేవకులకెల్ల భంగి విశేషబుద్ధి
నిల వివేకంబు గలరాజుఁ గొలువవలయు.

—నారాయణ కవి.

సీ॥ బహుళాంధకారమ్ము వాప దీపము, జీవ
నంబుల దాఁటంగ నావ, భద్ర
దంతావళముల మదం బణంపఁగ నంకు
శము, పన్నగముల రోషంబు చెఱుప
గారుడ మంత్రంబు, ఘనతరాఘుంబుల
హరియింప ధర్మము, నతి దరిద్ర
బాధఁ దీర్పంగ సంపద, శోకముల నోటు
పఱుప నానా కళాప్రౌఢిమయును
ప్రేమమున నబ్జభవుఁడు కల్పించెఁగాని
చేయ నోపంగ లేఁడయ్యెఁ జెనఁటి హృదయ
పంథ మొక్కింత మార్పంగ, ధాత్రిలోన
లాలితోదార! విత్తయలక్ష్మీధీర!

—భానయ.

చం॥ శరనిధిఁ దాఁట నావయును సంతమసం బడఁగింప దీపమున్
వరకరిశిక్షకంకుశము వాయువుఁ గూర్పఁగఁ దాళవృంతమున్
వెరవునఁ జేసె బ్రహ్మ పదివేలవిధంబుల మూర్ఖచిత్తవి
స్ఫురణ మడంపలేక తలపోయుచు నిప్పుడు నున్నవాఁ డహో!

—నారాయణకవి.

చం॥ తిమిరనివారణక్రియకు దీపము, వారిధి నిస్తరింపఁ బో
తము, చలిఁ బాప వహ్ని, రవితాపభరం బడఁగింప నాతప
త్రము, కలుషమ్ములం జెఱుప ధర్మము వొల్పడియుండుఁ గాని య
క్కమలజుఁడున్ సుఖోదయుఁడు గాఁడు దురాత్మునిఁ జక్కఁజేయఁగన్

—వేంకటనాథుఁడు.

గీ॥ సుజనులకు లేమి, గ్రహపీడ సోమ సూర్య
లకు, భుజంగేంద్ర మాతంగ శకున సంచ
యమున కరయంగ బంధన మాచరించు
నలఘుతరమైన విధి శక్తిఁ దెలియవశమె!

శా॥ తారామార్గమునం జరించు ఖగసంతానంబు వారాశిలో
నారూఢ స్థితినున్న మీనతతి దైవాధీనతన్ భూజనో
గ్రారంభంబునఁ గాదె చిక్కువడుఁ గాలాతి క్రమక్రీడ నె
వ్వారల్ నేర్తు రుపాయ ధైర్యబల గర్వ ఖ్యాతిఁ బెంపొందినన్.

—భానయ.

కం॥ గ్రహపీడ చంద్ర సూర్యుల
కహిగజ విహగముల కుగ్రమగు బంధనమున్
బహుమతికి దరిద్రత్వము
విహితంబుగఁ జేసినట్టి విధి నేమందున్.

చం॥ అరుదుగఁ జేరరాని గహనాంధులఁ గ్రుమ్మఱు నాఖగాండజో
త్కరములుఁ జిక్కఁ బెన్వలలఁ, గానవు దుర్నయ సచ్చరిత్రవి
స్ఫురణము దెల్వి స్థానబలమున్ మఱియెయ్యదియూఁ గదా! క్రియా
పరుఁడవుచున్ గ్రహించు విధి ప్రాణుల దవ్వులఁ గేలుసాచుచున్.

—నారాయణ కవి.

చం॥ సరసుల నక్రముల్ కులయజంబులఁ భన్నగ రాజు కేతకీ
తరువులఁ గంటకమ్ములు నిశాసములన్ బహు ఘాతమ్ముల్ సుధా

కరునిఁ గళంకమట్లు నధికంబుగ దుర్దశ లుర్విలోన స
త్పురుషులఁ బొందుచుండుఁ దమ పూర్వకృతంబగు పాతకమ్మునన్.

—భానయ.

చం॥ లలితపటీర పాదపములన్ జిలువల్ గమలోజ్వలజ్జల
స్థలముల గ్రాహముల్ గుణుల చక్కిఁ బరప్రతికూల దుర్జనుల్
పొలుచు నిధాన జాతముల భూతములుం గమనీయ మౌక్తికా
వళి సరఘుల్, సుఖంబులకు వారని విఘ్నము లేర్పడుంగదా!

—వేంకటనాథుఁడు.

చం॥ మలయజ శీతలమ్ములగు మాటలఁ దేల్చును వచ్చినంతఁ బెం
పలవడ లేవఁ జూచును బ్రియమ్ము లొనర్చును లే తనవ్వు వె
న్నెలలు ముఖేందునం దమర నిష్ఠురదంభము మానసమ్మునన్
దలముగఁ బొల్చు దుర్జనుఁడు ధాత్రితలమ్మున లక్ష్మ్మిధీమణీ!

—భానయ.

మ॥ పురతః ప్రాంజలి, సాశ్రు దృగ్గలజుఁ డుత్ఫుల్లాస్యుఁ డాశ్లేషణా
చరణారంభణ కేళి సత్ప్రియ కథా సంప్రశ్న దత్తాధికా
దరుఁడు, న్మాయి బహిర్మహా మధుచుఁ డంతర్గూఢ హాలాహలుం
డరుదే! దుర్జనుఁ డెంత శిక్షితుఁ డపూర్వాఖర్వ నాట్యోచితిన్.

—వేంకటనాథుఁడు.

ఈ యుదాహరణములవలనఁ దుల్య విషయములపై జాలువాఱిన యీ ముప్వురు కవుల వాణీ మార్గములలోని భేదములును దేటపడుచున్నవి. సరళ మధుర విధుర గమనములగు నీ మూఁడు కవితా ప్రవాహములును నేక విషయమున సంగమించి, గంభీరమగు నీతిశాస్త్ర తీర్థమునఁ దెనుఁగు ప్రజకు సుల భావగాహ సౌఖ్యమును బ్రసాదించినవి.

ఈముప్వురు కవులును మూలములోని కథల నన్నిఁటిని యథాతథముగఁ గైకొని తెనిఁగించినవారు కారు. పెక్కు కథలను విడిచిరి. కొన్ని కథలను మూలభిన్నముగ నిర్వహించిరి. ఏయే కథలను విడిచిరో, ఏయే కథల నిర్వహణమునందు భిన్నమార్గముల నవలంబించిరో, యిచ్చట నిరూపించుట కవకాశము

ఘాలనందున, వేంకటనాథ నారాయణ కవుల కావ్యములలో లేనిదియును భాను కవి కావ్యమునందు మాత్రమే యున్నదియునగు నొకకథఁ యిచ్చట బేర్కొనఁబడు చున్నది. అది యొక రాజకీరమునకును వేశ్యకును సంబంధించినదిగాను కైతవ మును కైతవముచేతనే జయింపవలయునన్న యంశమును బ్రతిపాదించుచున్నది. భానుకవి గ్రంథమునఁ బ్రథమాశ్వాసాంతమున నిది కానవచ్చుచున్నది. ఈ కథ కదిరీపతి "శుక సప్తతి"లోఁ గలదు. దీనిని భానుకవి సరసముగ నిర్వహించెను.

వేంకటనాథునకు నీతివిషయ మాలంబనమాత్రము. కథావిస్తరణము నను, వర్ణనలను బ్రవేశపెట్టుట యందును, స్వాతంత్ర్యమును వహించి యాతఁడు తన గ్రంథమునకుఁ గావ్యముద్రను హత్తించెను. బాలావబోధన ఫలమై కథా చ్ఛలమునఁ బ్రవర్తిల్లిన నీతి ప్రపంచనమున, నీతని కావ్యగుణాలోభము, ఉక్తి జటిలత్వమునకును, ప్రౌఢ వర్ణనములకును నెడమిచ్చినది. కావ్య దృష్టిచే నివి సంభావ్యములే యగును.

నారాయణ కవి గ్రంథమును భానుకవి గ్రంథమును, గావ్య గుణముల యందును బరిమాణమునందును వేంకటనాథుని కావ్యమునకుఁ గొండికలయ్యును వివక్షితార్థమునందుఁ దాత్పర్యము గలవిగాయె వాని ప్రయోజనమును నెరవేర్చు చున్నవి.

భానుకవి గ్రంథముకన్న నారాయణకవి గ్రంథము కథా పరిస్ఫుటత్వము నను, వర్ణనా పరిపోషమునను, సంభాషణలయందును నించుక వాసిగాఁ బొడ కట్టుచున్నను, ఈ రెంటికిని శైలియందు సాదృశ్యము గలదు. ఆ సాదృశ్యము, అక్కసెల్లెండ్ర సాదృశ్యము వంటిది. నారాయణకవి గ్రంథములోని పద్యములే నాలుగు భానుకవి గ్రంథమునందును గానవచ్చుచున్నవి.

కం॥ పరదేశమె నిజ దేశము
పరులే బాంధవులు ద్రవ్య పరిపాలునకున్
ధరణి నసాధ్యం బెయ్యది
పరమార్థం బిదియె నూత్న భరతాచార్యా! 70

కం॥ కులసతి రోయును జుట్ట
మ్ములు వాయుదు రొడలు కష్టపుం బలుకుల ని

ముమ్మలనాడఁ దోడఁగుచుందురు
కలియుగమున ప్రవ్యహీనుఁ గరణిక లక్ష్మా! 71

కం॥ మృతిఁ బొందిన నరునైనను
హితులెల్లను డాయుదురు మహీస్థలిలోనన్
మతిఁ దలఁపఁ జేదఁ జేరరు
ప్రతిమాలిన నోరులు నూత్న భరతాచార్యా! 72

చం॥ అతి బలవంతుడైన వినయమ్మున నాతనితోడి మైత్రి సం
తతమును నిశ్చలంబగు మనమ్మునఁ జేసి నిజ ప్రదేశ సం
గతుఁడయి పొల్చుటొప్పు, నది గాదని యొండొక దేశ మేగినన్,
ధృతిచెడియిఁ బోరినన్, వినుము ధీయుత! నొచ్చు నతండు నేరమిన్.

పై మూఁడు కందములును నారాయణ కవి గ్రంథమున 2వ యాశ్వాసమున 108. 109. 110. సంఖ్యలలోను, దిగువ చంపకము తృతీయశ్వాసమున 30వ సంఖ్యలోను గనఁబడుచున్నవి. నూత్న భరతాచార్యా! కరణిక లక్ష్మా! అను సంబోధనలు మాత్రమే భానుకవివి.

ఇంత గ్రంథము వ్రాసిన కవికి నీ నాలుగు పద్యములను నితరకవి కావ్యమునుండి యెరవు తెచ్చికొనుటకుఁ గల కారణము తనకుఁ బూర్వుఁడగు నారాయణ కవియందు నీతనికున్న గౌరవ భావమని యూహించుటకన్న వేఱొకటి సమంజసముగాఁ దోఁచదు. లేనిచోఁ గారణ మన్వేషింపవలసియున్నది.

శిక్షాసముచిత వయస్కులగు బాలు రెల్లరును నీతి శతకములనువలెఁ గంఠస్థము చేయుటకు ననువగు సరళశైలిలో నీతి సారములను దఱచుగఁ గంద ములు, తేటగీతులు, నాటవెలఁదులవంటి చిన్న చిన్న పద్యములలో సూటిగ నమ రించి, ధారణ యోగ్యములగునటుల భానుకవి సంతరించెను. కావ్యగుణ సంపాదనమునందు కన్న బాలావబోధనముగ నీతులను బొందుపఱుచుటయందే యితనికి దృష్టి యెక్కువ. ఇట్లనుటవలన నిందుఁ గావ్యగుణములు కొఱవడినవని కాదు. వానికై ప్రయత్నము లేదని భావము.

# భానుకవి పంచతంత్రి

## ప్రథమాశ్వాసము

శా॥ శ్రీరామా కుచకుంకుమచ్ఛవి, లసచ్ఛ్రీ కౌస్తుభస్ఫూర్తి, కా
ధారంబై యురమంతయుం బ్రథమ సంధ్యారాగ బాలార్క కాం
త్యారూఢోదయ శైలరీతిఁ దనరన్ దా(నున్న)తుండైన శృం
గారాధీశుఁడు వేంకటేశ్వరుఁడు లక్ష్మామాత్యుఁ బ్రోచుందగన్॥ 1

శా॥ గౌరీచిత్త సరోమరాళము వియద్గం (గాఝురీ) చంద్రరే
ఖా రాజన్మణిమాళి, పారిషద సంఘ స్తోత్రపాత్రుండు, గం
భీరోదారగుణుండు శంభుఁడు రహిన్ (బెంపొంద) రక్షించు వి
ద్యారాజీవభవున్, మహావిభవు లక్ష్మామాత్య చూడామణిన్॥ 2

ఉ॥ వారణ రాజవక్త్రుఁడు దివాక [రశీతక రామరాధిపాం]
భోరుహ సంభవాది సురపూజిత పాదతలుండు విఘ్ననీ
హారవి పాటనార్కుఁడు గణాధిపుఁడీ కృతి [నాథు భూమిభృ
ద్వార సభాంతర ప్రణుత వాగ్విభవాస్పదుఁ] జేయు వేడుకన్॥ 3

మ॥ అరవిందమ్మున నున్న యట్ల నిజగేహంబందు వర్తించి సుం
దర రూపాయు [రనామయ ప్రచుర సత్సంతానముల్ గంధసిం
ధుర వాహ ప్రమదా మణీ వనగృహస్తోమాది కైశ్వర్యముల్]
గరుణాపాంగములన్ [బయోఽబ్ధిసుత] సంకల్పించు [లక్ష్మయ్యకున్] 4

మ॥ కమనీయోజ్జ్వల భాగ్యుఁ జేయుత మహాకారుణ్య మేపార సం
భ్రమిమ చిత్తమ్మున [సౌరవాహినికి] భ్రారంభొప్ప స్వామేని యు
క్కు మునీంద్ర స్తుతమూర్తియై యభవు నంకంబందు వర్తించు శీ
తమ (హీభృత్సుత) బ్రోచు లక్ష్మవిభు మందార్థాభ విశ్రాణనున్॥ 5

ఉ॥ అంబురుహాసనానన గృహాంతర భాగమునన్ వసించి లో
కంబులచేతఁ బూజఁగొని గాత్రసితప్రభలన్ వెలుంగు న

య్యం బుజనేత్ర విద్యలకు నాకర మయ్యెడి దేవి భారతిన్
గంబు సమాన కంఠి నధికంబుగఁ గొల్చెదఁ గార్య సిద్ధికిన్ 7

వ॥ అని యివ్విధమ్మున నిష్టదేవతా ప్రార్థనమ్ము చేసి, 8

గీ॥ అఖిల జనులకు రామ కథామృతమ్ము
గలుగఁ బ్రవహింపఁజేసిన కవివరేణ్యు
సుభగచారిత్రు మునిజన స్తోత్రపాత్రు
నేక మనమునఁ గొల్తు వాల్మీకి నెపుడు॥ 9

కం॥ భారత వాగ్భణితులను న
నారత కలి కలుషతిమిరమణఁగించుచు వి
ద్యారూఢినవనిఁ దనరిన
పారాశర్యుని నుతింతుఁ బరమప్రీతిన్॥ 10

సీ॥ కావ్యత్రయము నాటకంబులు రచియించి
ఘనకీర్తి నొందిన కాళిదాసు
(సహారిశహ) రుల విద్యలచేత మెప్పించి
యుర్వీఁ జేర్గనిన మయూరు బాణుఁ
దెలుఁగునఁ బాండవేయుల కథఁగూర్చి పెం
పెక్కిన నన్నయఁ దిక్క నార్యు
భాగవతమ్ము, నా పద్ధతి గావించి
పొలుపొందు బమ్మెర పోతరాజుఁ
జతురు శ్రీనాథు భాస్కరు శంభుదాసు
రంగనాథుని ఘను నాచిరాజు సోముఁ
దలఁచి తక్కిన కవుల ముదమునఁ బొగడి
కరముఁ బెంపొందవారల కరుణవడసి॥ 11

వ॥ ఏ నొక్కప్రబంధమ్ము నిర్మింపంగోరి పురాతన కవీంద్రులచేత మున్నఖిల మ్మురచింపంబడె నాకు నిప్పుడెయ్యది గలుగునో యని విచారింపుచునున్న యవసరమ్మున 12

సీ॥ తనయదుల ఖిలగోత్ర క్షమాధర తట
స్థానమ్ముల సనారతమ్ము దిరుగ

తన (దు) గుణమ్ములు (దనరి) పద్మ భవాండ
(కాండసం) పూర్ణ విఖ్యాతి నొంద
తనదాన జలనిధుల్ వనధి యాదో జంతు
సంతతికిని సంతసమ్ముఁజేయ
తన ప్రతాపోష్మ మార్తాండ (బింబమురి) పు
ధ్వాంత సంతాన మదంబడంప, ఁ

గీ॥ బరగు శ్రీకృష్ణరాయ భూపాల కార్య
భార ధౌరేయుఁ డర్థార్థి పారిజాతుఁ
డలఘు విభవమహేంద్రుండు (నధిపవిధి)ప
రాయణుండగు లక్ష్మినారాయణుండు॥ 13

సీ॥ వేదశాస్త్రపురాణ విద్యా ప్రవీణత
నొప్పు విద్వజ్జను లొక్కవంక
సంస్కృత ప్రాకృత శబ్దార్థ విదులగు
నుభయ భాషాకవు లొక్కవంక
సంగీత సాహిత్య చతురత నవనిఁ బెం
పొందిన నేర్పరు లొక్కవంక
బహువిధ విద్యలఁ బరిణతిఁ బొందిన
యురుజన సంఘమ్ము లొక్కవంక

గీ॥ నాదిగా గల్గువారలు నపరిమితము
గాఁగఁ బొలుపొందఁ జూచి సంకల్ప సిద్ధుఁ
డఖిల భాగ్యుండు చిట్టన యతని తోడఁ
బలికె సంతోష హృదయ సంపన్నుఁడగుచు. 14

కం॥ ధన నిక్షేపము గృతియును
దనయుఁడు నల్లిల్లు దేవతా భవనమ్మున్
వనము తటాగమునన నివి
(జననుతముగ)ఁ దనరు సప్తసంతతులందున్॥ 15

కం॥ తలపోయఁ గృతియ జగతీ
తలమున నాచంద్ర సూర్యతారకమై ని
ర్మలకీర్తిలతకుఁ గుదురై
నిలుచుగదా యనుచుఁ బలుక నిపుణత వెలయన్॥ 16

సీ॥ మందాకినీ చంద్ర మందార చందన
సితకీర్తిఁదగు నరసింహభట్టు
పతికార్యహిత నయోపాయమ్ములను [యుగం
ధరుఁ డనఁజాలిన] నరసమంత్రి
నృపసభాంతర వర్ణనీయ ధీమార్గ వ
ర్ధిష్ణుఁడౌ నవధాన కృష్ణ ఘనుఁడు
నానా [విధ] కళా ప్రవీణత దిక్కుల
వెలసిన భరతము విష్ణుభట్లు

గీ॥ మొదలుగా నున్న వారలు మోదమునను
వరుస నందఱు విన్నవించిరి ప్రధాన
వర్య! మీతలఁ బొప్పు భూవలయమునను
నల హరిశ్చంద్ర రామచంద్రులకునైనఁ
గీర్తి యున్నతికెక్కుట కృతులఁగాదె! 17

ఆ వె॥ ఆశ్రితుండు మీకు నాంధ్రభాషా విశా
రదుఁడు భానుకవి, కరమ్ము వేడ్క
నతనిచేత నెద్దియైన ప్రబంధము
సేయఁబనుపు మధిక ధీయుతముగ॥ 18

మ॥ వరవాగ్వైఖరి లక్షణజ్ఞతను శ్రీవత్సాన్వయ ఖ్యాతి భూ
వర మాన్యప్రకృతిన్ బురాతన సుకావ్య ప్రౌఢిమన్ భారతీ
వర మంత్ర ప్రతిభన్ మహేశపద సేవానిష్ఠ (నిన్ బోలరు)
ర్వరలో *[విఠ్ఠయలక్ష్మ మంత్రి!] బుధసేవ్యమ్ముల్ ? భవద్భాగ్యముల్ 19

వ॥ అని కృతిపతితోడఁ జెట్టనామాత్యుండు వలుక నాతండు సంతో
షాతిశయంబున వల్లెయని కర్పూర సమేతంగాఁ దాంబూలంబును జాం
బూన దాంబ రాభరణమ్ములునుఁ జామరాందోళికా విభవమ్ములును నేక
భోగ గ్రామంబులు నొసంగి బహుమాన పూర్వకంబుగా ననిపిన నేనును
నమ్మహా ప్రధాన శేఖరు నిట్లని వినుతించితి. 20

స్రగ్ధర॥ లక్ష్మీ కారుణ్య వీక్షాలయ శుభకలనాలంకృత స్ఫారతేజా!
లక్ష్మీశాకార! వాచాల సదురగ (సముక్ష్లాఘు!) వంశ ప్రతిష్ఠా!
సుక్ష్మాభృ ల్లేఖ కార్యస్తుత విభవ! కళాస్తోకవిస్తార్య పుత్రా!
లక్ష్మీ నారాయణా! దోర్బ్ల సితవితరణో ల్లాస వర్ధిల్లు ధాత్రిన్! 21

---

* తిప్పయ భాస్కరేంద్ర జనవాక్యమ్ముల్ భవద్భాగ్యముల్.

స్రగ్ధర॥ నామ ప్రఖ్యాతి నీతిన్మధుర మృదుల సన్మంజు భాషా మనీషా
సామగ్రిన్ సాధు భక్తిన్ సరసగుణ పరిష్కార రేఖా ప్రసక్తిన్
సామంతోద్భావ నాదిక్ సచివ గుణములన్ సన్నుతిన్మించితౌరా
శ్రీ మద్విఠ్ఠయ్య లక్ష్మా! స్థిరమతి విభవాశీ విషాధీశ లక్ష్మా! 22

వ॥ అనిస్తుతియించి యమ్మంత్రిమణిం గృతీశ్వరుంగా నియమించి తదీయ
వంశావతారంబభి వర్ణించెద॥ 23

శా॥ భారద్వాజ పవిత్ర గోత్రమున శుంభల్లీలమైం గేశ వుం
డా రూఢింబ్రభవించెం గీర్తియను స్వచ్ఛాంభోనిధిన్ బుద్బుదా
కార భ్రాంతి నజాండ పంక్తిదనరన్ గణ్ణాంబుద శ్రీద మం
దారోదార గుణమ్మునన్ సరస విద్యా ప్రౌఢిం గీర్తింపగన్ 24

కం॥ భామామణి యగు గౌరమ
యా మంత్రివరేణ్యు భార్యయై పరగె లస
త్సీ మంతిని మునునోంచిన
నోముల ఫలమిదియ యని తనుంబ్రజ వొగడన్॥ 25

కం॥ వారల పుణ్యంబునం బెం
పారగ నుదయించె విఠ్ఠలామాత్యుండు గం
భీర గుణవారిరాశి సు
ధారుచి సమకీర్తి ధీరతా మేరువనన్ 26

ఉ॥ సారసశాత్రవాంకము వృషధ్వజ కంధర నీల మష్టది
గ్వారణ గండదానజల [పంకము] దుగ్ధపయోధి మధ్య ల
క్ష్మీ రమణాంగ కృష్ణరుచి శేషదృగం చిత [నీల కాంతినిం]
పారగం గప్పు విఠ్ఠ సచివాగ్రణిం బొందినకీర్తు లెల్లడన్ 27

సీ॥ గజపతి మెప్పించి కనక ఘంటలు గొని
విద్యా ప్రవీణత వినుతికెక్క
సతతాన్నదానమ్ము సాగి[ంచి భూ సురో]
త్తముల [నే ప్రొద్దు] నెయ్యమునం బ్రోచె
పగహింత శృతి కృతాభ్యాసకీర్తి స్ఫూర్తి
పొలుపొంద భూషణమ్ముగం దనర్చె

ధర్మమ్ము గుణము సత్యమ్మును దనతోడు
నీడలు నాఁగ వర్ణింపఁ దనరె

గీ॥ నవని నానార్థిజన దరిద్రాంధకార
పటల మణఁగించె నరవింద బంధుఁబోలి
సుఖుల పాలిటి కల్పవృక్షమ్ము దలఁప
మంత్రి మాత్రుండె విశ్వయామాత్యవరుఁడు 28

గీ॥ అతనికిని భార్యయై రుక్మమాంబయపుడు
దేవతా గురుభక్తి యతిథి సపర్య,
పతి సమారాధన క్రియా పరత, తనకుఁ
గరము పెంపొం[దు భూషలుగాఁ జెలంగె] 29

వ॥ వారిరువుర భాగ్యవశంబున 30

సీ॥ ప్రత్యర్థి పార్థివ పట్టణ ద్వారక।వాట పాటన బలోజ్జ్వ లభుజుండు
సప్త సముద్రాంత శైలోపరిస్థలీ। సంకీర్ణ గుణలతా సంచయుండు
[హరజటా] నిర్గత సురధునీ భంగని।ర్వా ౹ద జృంభిత వాగ్విరాజితుండు
ఛద్మ మంత్రిలలాట చారు భాగ్యాక్షర సంస్ఫూర్తి దీప్త విచక్షణుండు 31

గీ॥ సజ్జన వ్రాత దైన్య తుషార హరణ
కమల మిత్రుండు కవిరాజ కల్పశాఖి
పంచబాణ నిభుం డుదయించె బంధు
రక్షణము సేయ లక్ష్మీ నారాయణుండు 32

చం॥ అ మలిన చందనా [స్పదమునాయత] వృత్త గుణమ్ము చారు భో
గము గల లక్ష్మ మంత్రి కరకంజము జేరినయట్టి ధాత్రి క్రో
డమునకు వ్రీడఁ జేసి జగడంబుల [గచ్ఛపు] దుచ్ఛమాడి [లో
కములను శేషు] దోష యుతుగా నొనరించెను సార్వకాలముౕ 33

సీ॥ ఏ మంత్రిసిత కీర్తి హీర కర్పూరనీ
హార హారమ్ముల నపహసించు
నే మంత్రి శేముషీ, భీమ విక్రమ [మరి
రాజన్యులకుఁ గ్రూరద్భు తంభ పొందు]

నే మంత్రి దానమ్మ జీమూత వాహన
శిబి బలికర్ణుల సిగ్గుపఱచు
నే మంత్రి సౌందర్య మింద్రాత్మజ మనోజ
ధనదజులకు విస్మయదనము సేయు

గీ॥ నఖిల భోగ వినిర్జి తహరిహ యుండు
[సచివ మాత్రుండె కవిబుధ ప్రచయ సురభి]
[కృష్ణరాయ దయావి] వర్ధితసమావి
రాజి కరణము లక్ష్మి నారాయణుండు॥ 34

శా॥ దానంబందుఁ బ్రతాపశక్తిసురు విద్యా ప్రౌఢి [సద్బంధుమి
త్రానూన ప్రియవర్త నమ్మనసు సప్తాంగ క్షమారక్ష ల
క్ష్మీ నారాయణునామ మెన్నుదురు గోష్ఠీ సంప్రయోగమ్ములన్]
నానా రాజ సభాంతరమ్ములఁ గవీంద్ర శ్రేణి యశ్రాంతమున్ 35

గీ॥ పుణ్య గుణ దాన భోగ విభూతిఁ దనరు
పా...పార్వతియనుగడు నొప్పు మిగులఁ
దనకు నిల్లాండ్రు గాఁగ భూతలమునందు
రమణఁ జెలువొందె లక్ష్మి నారాయణుండు 36

వ॥ ...... 37

కం॥ తనుఁ బశ్చిమాబ్ధి పాలకుఁ
డన దిక్కులఁ జేరవడసి యఖిల సుకృతులన్
దనరిన విశ్వప్పాడయఁడు?
తనయుడుగా లక్కమంత్రి దద్దయు వెలసెన్ 38

వ॥ ఏవం విధ గుణాగణ... 39

కం॥ శ్రీరాజిత భవనునకు న
పార యశశ్చంద్ర కాంత బహుభువనునకున్
పౌరాణిక కవి భట మం
దారునకును దాన, వారి ధరధీరునకున్ 40

కం॥ లాలిత మహిళా నవ పార్వ
శాలునకున్ బంధుమిత్ర జన పాలునకున్

ప్రాలేయకర యశోమా
లాలంకారునకుఁ జిత్తజాకారునకున్ 41

కం॥ బాహాసి నిహత రిపుసం
దోహవిమర్దన కళా చతుర్బాహునక
వ్యాహత భోగ జితాంబుద
వాహునకు రమాపయోజ వన గేహునకున్ 42

కం॥ దాన జలధౌత విప్ర వి
తాన భయానక దరిద్రతా పంకునకున్
దానవ మథన పదాబ్జ
ధ్యాన మహాపుణ్య శశ్వదకళంకునకున్ 43

కం॥ నానా మహీశ మహితా
స్థానీ (జేగీ) యమాన చంచద్గుణ సం
(తాన) యుగంధరునకు ల
క్ష్మీ నారాయణున కర్థి చింతామణికిన్ 44

వ॥ అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా నా యొనర్పం బూనిన పంచతంత్రి యను మహా ప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన— 45

సీ॥ కమనీయ సాలబద్ధ మణి ప్రభాచ్ఛటా
శబలితాకాశ దిశా *తటమ్ము?
సౌధాంతర స్థిత [స్త్రైణ రుచిర రూ]ప
రేఖా విజిత నిర్జరీ గణమ్ము
నానా[విధ సుమప్రతాన]నూత్న రమా వి
చిత్ర తాపహసిత చైత్రరథము
సంతత మద వారి సామజ (సంభావి)
తా కాలవర్షాగ మాభ్రచయము

గీ॥ ఘన (నవాగరు) ధూపిత గంధవహము
త్యాగి నృపసుత వాసి తదుగ్ధార్ణవంబు
స్వర్ణరథ పరికల్పిత స్వర్ణ ధరము
భువన మాన్యమ్ము పాటలీపుర వరంబు..... 46

* తటమ్ము

వ॥ అమ్మహా నగరమ్మున కధీశ్వరుండగు సుదర్శనుండు 46

సీ॥ తన దృష్టి యష్టదిగ్గళ మహీమండల
పద్మాంతరస్థమై పరగుచుండ
తన రూపమంగనా జనమానసములకుఁ
బంచ శిలీముఖ భ్రాంతిఁజేయ
తన కీర్తి సతి జగత్త్రయ రమణీయసౌ
ధాభ్యంతరమ్ముల నాడుచుండ
[తన ప్రతాపాగ్ని శాత్రవకానన నమ్ముల]
పైఁ, ననారతమునుఁ బ్రజ్వలింప

గీ॥ గంధగజ గోత్ర భూమి భృత్కచ్ఛపాహి
పాల [కిటిరాట్] ధురంధర బాహుభీమ
శక్తి సంపద బెంపొంద, సత్యనిరతిఁ
బోలిచె ముందటి రాజులఁబోలి యతఁడు 47

వ॥ అంత నమ్మహీ వల్లభుం డొక్కనాఁడు సమస్త విద్యా విధిజ్ఞులగు తిథిజ్ఞులును నధికతర ప్రబంధ నిస్తంద్రులగు కవీంద్రులును, అఖిల పురాణ పారీణులగు పౌరాణికులును పరరాజ రాష్ట్ర విభేదన నీతి తంత్రజ్ఞులగు మంత్రులును, నిజ కృపా పాత్రులగు సుత్తమ క్షత్రియులును, గొలువం బేరోలగం బుండి తన కుమారులు నీతిశాస్త్ర పారంగతులు గాకుండుటకు హృదయంబున విషాదంబు నొంది సభా జనమ్ములు విన నిట్లనియె. 48

చం॥ అలఘు కళా వివేక విభవాదులఁ బెంపగు సూనుఁ డే క్రియన్
గలుఁగడ యేని, భార్యఁ దన కౌఁగిలి జేర్పకయుంట మేలు కు
న్నలిగి ఋతు ప్రసంగతుల నంటక యుండిన మేలు, గర్భమై
పొలిసిన, వంధ్యయై, రమణి పుట్టిన మేలు ధరా తలమ్మునన్. 49

కం॥ ఘన విద్వాంసుఁడు ధార్మికుఁ
డును గాకుండినఁ దనూజుఁడు ధరిత్రిన్ గ
ట్టని పిదుకని మొదవుం జో
లిన వాఁడరయంగ సూత్మ్మ లిఖితాచార్యా! 50

కం॥ ఏలా! నరునకుఁదనయా
జాలము విద్యావిలాససత్యవచోల
క్ష్మీ లలితమూర్తి యొక్కఁడ
చాలుం దలపోయ లక్ష్మిసచివ వరేణ్యా! 51

గీ॥ చోరులపహరింపలేరు భూపాలుర
వలని బాధ లేదు వాయువహ్ని
వారి [భయము] వొరయ దారయవిద్యా ధ
నంబు వసుమతిన్ ధ్రువంబుగాదె! 52

కం॥ అయమార్గ నీతి విద్యా
నయముల నేఘనుఁడొకో! పునర్జన్ములఁగా
నయమొప్పఁజేయు నతి గ
ర్వయుతుల నాసుతుల నతను వశదుర్మతులన్. 53

కం॥ అనిన నృపుఁజూచి విద్వ
జ్జన వందితుఁడైన విష్ణు-శర్మను విప్రుం
డను వేడ్క నాలు నెలలకు
ననఘా! నీయాత్మజుల మహాత్ములఁ జేతున్. 54

వ॥ అనిన నమ్మహీకాంతుండు నితాంతసంతోషమ్మున నతని నఖిల వస్తు సంచయమ్ములం దేలించి నిజకుమారుల నర్పించిన నతండును వారలం దోడ్కొని (యాత్మ) విద్యామంటపమ్మునకుం జనుదెంచి మిత్రభేద, సుహృల్లాభ,సంధి,విగ్రహ, లబ్ధనాశనా, సంప్రేక్ష్యకారిత్వంబులను పంచతంత్రంబులు కల్పించి యందుఁ బ్రథమతంత్రంబగు మిత్రభేదం బెఱిఁగించువాఁడై యిట్లనియె. 55

చం॥ చెలిమి యొనర్చినన్ గపటిచేఁజెడుఁ దథ్యము తొల్లి కానన
స్థలమున సింహగోవిభులు చారుతరమ్ముగ మైత్రిఁజేసి స
శ్చలమతి నుండువేళ నొకజంబుక వల్లభుచే విరోధముల్
గలుగవె! యిండొకల్లకనఁ, గౌతుకమానసులై కుమారకుల్. 56

వ॥ మహాత్మా! యెవ్విధంబున..............నెఱింగింపుమనిన విష్ణు శర్మయు వారల మనః ప్రియంబులం దెలిసి యా కథఁ జెప్పందొడంగె నది యెట్లనిన మున్ను దక్షిణాపథమ్మున, 57

మ॥ మహిళారూఢ్య మనంగఁ బట్టణము రమ్య [ప్రాంశు] హర్మ్యావళీ
మహితోద్యాన సరోవర ప్రతతులన్ మాతంగవాహావళిన్
బహుఘంటాపథ యంత్రవప్రపరిఖా ప్రాకార కూపమ్ములన్
మహనీయం [బగుస ప్త స] ప్తి విలసన్మార్గోప [రోధోన్నతిన్] 58

గీ॥ అందు వర్ధమానుఁడను వర్తకుఁడు గలఁ
డతఁడు నేర్పుతో బెహారమాడి
వచ్చు లాభధనము వసుమతీసుర దేవ
తార్పణమ్ము సేయునాత్మఁ దనరి. 59

వ॥ అతఁడు పెద్దయుఁ దన హృదయమ్మున నిట్లు తలపోసె. 65

కం॥ సిరులును ఘనవిభవముల,
స్థిరములు తనతోఁడవచ్చుఁ జేసిన సుకృతం
బరయగ నది పరికింపగఁ,
బర సుఖ కారణము సూత్నభరతాచార్యా! 61

కం॥ [జలదానో] కహగోవ్రజ
జలఫల దుగ్ధమ్ములట్ల సత్సంపదలున్
దలపంగఁ బరహితార్థమె
విలసిల్లు ధరాతలమున విత్తయలక్ష్మా! 62

సీ॥ పుత్రపౌత్ర కళత్ర భోగభాగ్య స్వగా
త్రంబులు దలఁప, నిత్యములు గావు
సమర విప్రులకు యోగ్యముగాని విత్తంబు
చోరనృపతులచేఁ [జూఱ] వోవు
పరహితమునకును బాధేయమగు పాత్ర
దానమ్ము భక్తియుక్తముగఁజేయ,
నని, యంత బేహారమున కేఁగనూహించి
వర్ధమానుండు సర్వార్థములను

గీ॥ నింబలరఁ గూర్చికొని సంభ్రమం బెలర్పఁ
గదలి నందక సంజీవకంబులనఁగ
వఱలు వృషభమ్ము లుభయపార్శ్వములఁ గట్టి
ధనికులగు మిత్రబాంధవ జనులతోఁడ, 63

వ॥ అయ్యవసరంబున నతిజవంబునం జనునొక్క విపిన ప్రదేశంబునఁ బ్రమాదవశంబున నెరకలుఁగులో సంజీవకంబు కాలువిఱిగిన నతండు ధనవంతుం డగుటఁజేసి వెండియు నొక వృషభంబుఁ బుచ్చుక తచ్ఛకటంబున నమరించుకొని.

64

ఉ॥ పోవుచు వర్తకుండు వృషపుంగవు రక్షయొనర్ప నొక్కనిన్
గావలినిల్పి వాని కధికంబగు విత్తమొసంగె నత్తఱిన్
జీవము వోవకుండఁ గృపచేఁ దృణవారి యొసంగి వేడ్క సం
జీవకుఁ బుండరీకములచేఁ బడకుండఁగఁ బ్రోచె నాతఁడున్. 65

వ॥ ఇవ్విధంబున వర్తకభృత్యుండు పెద్దకాలంబు నా వృషభంబును గాచి వేసటంబొంది కాలుఁ రాకునికి నా సంజీవకుని విడిచి, చని వాఁడది మృతిం బొందె నని వర్ధమానున కెఱింగించిన నతండును నయ్యనడ్వాహమ్ము పిత్రార్జితంబగుటం జేసి విషాదంబు నొందె నంతనక్కడ. 66

కం॥ జొంపములు గొనిన పచ్చిక
గుంపులు మేసచట వృషభకుంజరుఁడను మో
దింపుచుఁ జరణముదట్టి చ
రింపఁదొడఁగె వనమునందు రేపును మాపున్. 67

ఉ॥ వారణ రాజకుంభమును వ్రక్కలుజేసి తదీయరక్తముల్
సారెకుఁ గ్రోలిక్రోలి సరసంబగు మాంసము మెక్కి తుంది లా
కారబలంబునన్ మృగనికాయము దిక్కులమీఱి గర్వ వి
ద్యారుచిఁ బొల్చుఁ బింగళకుఁ డన్మృగవల్లభుఁ డవ్వనంబునన్. 68

వ॥ విలసిల్లుచుండి యతం డొక్కనాఁడు సమస్త మృగమ్ములు గొల్వ, యమునా సమీపమ్మునఁ గ్రుమ్మరుచున్ బ్రళయకాల బలాహక గర్జా సన్నిభం బగు సంజీవకు భయానక ధ్వానంబాకర్ణించి కలుషిత స్వాంతుండై తనలో నిట్లనియె.

69

కం॥ తనభీతియుఁ దననేరమి
తనధన హానియును దగిన తన మర్మంబున్
దన గృహరంధ్రం బెప్పుడు
ఘనునకు గోప్యముగవలయుఁ గరణికలన్నా! 70

కం॥ అని తలపోయుచు మదిబోఁడ
మిన యద్భుత సాధ్వసంబు మృగసందోహం
బున కింతయు నెఱిగింపక
ఘనమగు గోప్యముననుండెఁ గడుఁ నేర్పమరన్. 71

గీ॥ తన్మృగేంద్ర పరివృఢప్రధాన సుతులు
గలరు ఫేరవ భర్తలు కరటకుండు
దమనకుండన నీతి విద్యా ప్రవీణు
లలఘు బలులింగితజ్ఞులు ననఘమతులు. 72

వ॥ తత్సమయంబున నయ్యిద్దఱిలో దమనకుండు కరటకుంగనుంగొని
యయ్యా! ఈ మృగేంద్రుండు జలాభిలాషియయ్యు మంద సంచారుండై
యుండుటకుఁ గతం బెఱుంగుదేయన నతండీ యర్థమ్ము మనకుఁ దెలియం బని
యేమియని యిట్లనియె. 73

కం॥ ధారుణి నెవ్వండవ్యా
పారంబుల దిరుగుఁ *ప్రేతపతి? సదనంబున్
జేరునతఁడు తరుచీలయు
వారక పెడబాపినట్టి వానరు భంగిన్ 74

సీ॥ అనవుడు దమనకుండది చెప్పుమనఁ గర
టకుఁడు మున్నొక్కపట్టణ సమీప
మునను దేవాలయంబునకుఁ గూర్చిన ద్రూను
ద్రయ్యలు వారంగ వైచి దాని
నడుమ చీలఘటించి నరులేఁగఁ గానల
కరుగుచుఁ గపిసంచయమ్ముచేర,
నందొక క్రోతి [దిష్టాంతకప్రేరణఁ
దటుకునఁజీల] మీఁదటికి నురికి

గీ॥ స్తంభవిశ్రాంతరమునఁ గోశములు వ్రేల
పాణిదంతమ్ములను జీల బలిమిదించి
యుగ్రవథఁ బొందెనట్లు గాకుండ మెలఁగ
వలయు మతిమంతు లుచిత (స) ద్వర్తనముల. 75

* పితృపతి

వ॥ కావున నీవేళ మనకు నిన్నటి భుక్తశేష మృగామిషం బనుభవింపవలయును, పోదమనిన దమనకుండు వానింజూచి యాహారమాత్రార్థి వెట్లు రాజసేవ సేయనోపుదనినఁ గరటకుం డిట్లనియె. 76

చం॥ పరుల మదంబుద్రెంచ దన బాంధవకోట్లను మన్చిదిక్కులన్
గురుతరకీర్తినించ దన కోరికలెల్ల ఫలించ రాజశే
ఖరులను సజ్జనాళి కలకాలము గొల్చుటకాక, పొట్టకై
తిరముగఁ గొల్వనేల కులదీపక! విశ్వయ లక్ష్మధీమణీ! 77

సీ॥ ఉదరపోషణముననుండదె కొక్కెర
చండిరై జీవన స్థలములందు
శూద్రనివాసమ్ము చుట్టున నెంగిళ్లు
తినియుండదే కుక్క దినదినమ్ము
భోజనమ్ములుగ [ధరాజనోచ్ఛిష్టముల్,
కాకులుండవె] చిరకాల మిలను
గ్రామసూకరములు కష్టనస్తనముల
బ్రతుకవే దేహాది భ్రాంతిచేత

గీ॥ పరులరక్షింపనోపని నరుల జన్మ
ములు దలంపఁగ నట్టివి యలఘుకీర్తి
లలఘు కార్యమ్ములకుఁబూని యధికులగుట
లాలితంబగు విశ్వయ లక్ష్మధీర! 78

వ॥ క్షుద్రనదీవిధంబున వివేకహీనుస్వ్యం డల్పజీవనంబునన్ బరితృప్త మనోరథుండగునని పలికినఁ గరటకుం డతనింజూచి యిప్పుడుచితకార్యం బెయ్యది చెప్పుమనిన నతం డిట్లనియె. మన విభుండగు మృగనాథుండు సాధ్వసమనంబునం బరివార సహితుండై యున్నవాఁడనిన నది నీ వెట్లెఱుంగుదు వని కరటకుం డడిగిన దమనకుం డిట్లనియె. 79

గీ॥ పలికినంత నెఱుఁగు పశువులు, దలపోయ
సంజ్ఞ నెఱుఁగు దంతి, సైంధవములు
నొరుల యింగితమ్ము లూహ నెఱుంగుట
తెలివి, లక్ష్మమంత్రి! ధీసమేత! 80

వ॥ అట్లు గావున నా ప్రజ్ఞాబలమ్మున నెఱింగితి ననం గరటకుం డతని నిరీక్షించి రాజు నుపాసించు సమయ మెఱుంగఁజేయు మన దమనకుం డిట్లనియె. 81

కం॥ కోప ప్రసాదగుణములు
భూపాలునియందుఁ దెలిసి బుద్ధి నధికుఁడై
చాపల విరహిత హృదయుం
డై పెంపునఁ గొలువ, నధికుఁడగు సేవకుఁడున్. 82

గీ॥ అనినఁ గరటకుఁ డిట్లను ననవసరము
నందు మున్నొక్కనాడు నీవరుగ విభుఁడు
మిగుల విలపించె నీవేళఁ దగుఁ జనవునఁ
బోవ, ననవుడు నాతండు బుద్ధిబలికె. 83

వ॥ ఎవ్విధంబున నైన నుపజీవులకుఁ బరివృఢసేవ విడువవచ్చునే యని దమనకుండు వెండియు నిట్లనియె 84

కం॥ పతి, యంగనాంగసంగ
స్థితిఁదాఁ జేపట్టినట్లు చెనఁటులనైనన్
సతతమ్ము డాసి కొల్చిన
నతికరుణను బ్రోచు, వారి నవనీపతియున్ 85

వ॥ అని చెప్పిన గరటకుండు దమనకుతో నీవు పతిసన్నిధికిం జని యచ్చట నతని చిత్తమ్ము వచ్చునట్లుగా నెవ్విధంబునఁ బలికెదవనిన నతం డతని కిట్లనియె. 86

కం॥ ఒరులాడిన వాక్యమ్ముల
సరవిం బ్రతివాక్యములు రసస్థితి వాడమున్
ధరణిని బీజమ్ములు దా
మురు వృష్టిని బొడమకరణి నుచితమ్ముగుచున్ 87

కం॥ గురువైనను [భటుఁడైనను]
బరిభవమును బొందు మనుజపాలకు చేతన్
సరసత్వము సమయోచిత
మురువాచా ప్రియము లెఱుఁగకున్న ను ధరణిన్ 88

కం॥ భారము లేదు సమర్థున
కారయ పరదేశమెద్ది యతివిజ్ఞానకున్
దూరమ్ము గలదె సాదికి!
వేరీ! ప్రియవాది కరులు విశ్వయలమ్మా! 89

వ॥ అని యివ్విధంబునఁ దన పలుకులకుఁ బ్రత్యుత్తర మొసంగిన సంత సిల్లి దమనకా! నీవు భద్రంబగు మృగరాజు సేవకుం బోయినమ్మ నిన వల్లెయని దమనకుండచ్చోటు వాసి, 90

చ॥ జవమున నా మృగేంద్ర విభు సన్నిధికింజని వందనమ్ము గౌ
రవమునఁజేయ నాతఁడు కరంబు ముదమ్మునఁ దేలి మంత్రి పుం
గవ! చిరకాలమయ్యె పొడగంటిమి నేఁడను నంత, జంబుక
ప్రవరుఁడు డాసిపల్కె మధురంబగు వాక్యములుల్ల సిల్లఁగన్. 91

వ॥ దేవా! భవచ్చరణారవింద సేవకుండ, నీసేవకంటె నా కన్యంబొండు గలదే యేనిప్పుడు రాచకార్యం బెఱింగి నీ సమ్ముఖంబునకుం జనుదెంచితి, నని తత్ప్రసాద సదనంబగు వదనంబు విలోకించుచు దమనకుం డిట్లనియె. 92

గీ॥ [నమ్మి] భృత్యుఁడనుచు నన్ను జూడకు దేవ
వచ్చి హితము సేయువాఁడు ఘనుఁడు
పాదకంటకంబు వాపుట కరయంగ
ముసలమేల! వాడి ముల్లుగాక 93

కం॥ ఇడుములు వొందిననైనను
విడువరు ధైర్యమ్ము నతి వివేకులు దివియన్
బుడమిన్ దలక్రిందైనను
విడుచునొ [కో! మిడు] తతతులు విశ్వయలమ్మా! 94

కం॥ హాలికుఁడు సమస్త బీజం
బులు నుర్వరఁజల్లి పిదప మొలకలచేతన్
ఫల మెఱిఁగినట్లు హృదయం
బుల కార్యఫలమ్ము లెఱుఁగఁ బోలు సుమతికిన్॥ 95

కం॥ తోడవులక్రియ భృత్యుల నిలి
పెడుచోటుల నిలుపవలయు పృథివీశ్వరుఁడు పెం.

పడక, నటుగాక తక్కినఁ
బడబోఁ గార్యములు తద్విధంబున వలఁదన్. 96

గీ॥ కనకభూషణ సముచిత క్రమ మహార్హ
కమర్చు లోహమునఁ గట్టిన కరణి నధిక
[విభుల] మతి హీనమతులందు వెలయుభటులఁ
గూర్చు నిరతక్క పురుషులఁ గూర్చఁజనదు 97

చం॥ జనవిభుఁ డజ్ఞుఁడైన పరిచారకులు బుద్ధివిహీను, లట్టిచోఁ
బనులొనరింప నచ్చటికిఁ బ్రాజ్ఞులుచేరరు, నట్టివారు లే
మిని, బహునీతిశాస్త్రముల మేలు గ్రహింపగలేఁడు నీతి హీ
నుని నృపు నెంతవానిని మనుష్యులు రోఁతురు భూతలమ్మునన్. 98

ఆ॥ వె॥ ఘోరకాంత రాజగుణములచే నుప
జీవి సంతతికినిఁ జేరరాక
వచ్చుటయును గల్గి వనజంతుమణులచే
నుదధివోలె నధిపుఁడుండవలయు. 99

ఆ॥ వె॥ చైత్రచిత్ర భానుచందమ్ము పెనుపొంద
వెట్టకోర్చి విభుఁడు వెతదలంప
కఖిలజన మహీరుహావళీ హృదయముల్
చెలఁగి పల్లవింపఁ జేయవలయు. 100

వ॥ అని యివ్విధంబున [విన్నవించి] నిఖిల మృగసేవిత పాదాంబుజ
చతుష్క! నన్ను నీయందలి భక్తియుక్తుంగా నెఱుంగుమని ధేనవ ప్రవరుం
డిట్లనియె. 101

చం॥ హరియును పోత్రిగాత్రధరుఁడై శశజన్ముఁడు భాగరూపియై
సరసిజ బాంధవుండు హయసంభవుఁడయ్యె [నుముకే] మహేశ్వరాం
బురు హాభవాది దేవ పరిపూజ్యులుగారె మృగేంద్ర! శౌర్యభా
సుర!నను నక్క మాత్రముగఁ జూడకుమీ మది నీకు బూజ్యుఁడన్॥ 102

వ॥ అని పలికిన, బింగళకుండు మదీయ ప్రధాన పుత్రుండవగు నీవు
పూజ్యుండవు [గాక] తిరస్కారార్హుండవే!యనినఁ బ్రహృష్టమనస్కుండై
దమనకుండిట్లనియె. 103

సీ॥ అధిప పాథోవాంఛ నరుగుచు నిచ్చట
నిలిచిన కార్యమ్ము దెలుపుమనిన,
దమనక! మద్వనాంతరమునన యకాల
ఘనఘనాఘన ఘోర గర్జతోఁడ
సరిపోలు నొక్క నిస్వానమ్ము విని దాని
గమనింప సత్త్వవిఖ్యాతుఁడిందుఁ
గలడని చెంత నిక్కడ నిల్చియున్నాఁడ
[నన విని] యేల భయమ్ము నీకుఁ

గీ॥ * జెప్పు మల్పునధికుఁ జేసెద వలుఁగు నీ
రములచేదఁ బోదె, రాజ మంత్ర
రక్ష [లేకనృపతి] రక్షణంబునఁ గార్య
మనఘ! యింత విఫలమగు దలంప 104

కం॥ మును మృగధూర్తకకుల నా
థునిచేఁ దెలియంగబడిన దుందుభినాదం
బును బోలె నధిప! యేతద్
ధ్వని యిప్పుడు మనకుఁ దెలియదగునని పల్కెన్॥ 105

వ॥ అనిన విని మృగవిభుం డదియెట్లని యడిగిన దమనకుండాను పూర్వికంబుగా నెఱింగించువాఁడై యిట్లని చెప్పంబోడంగె-మున్నులంబకర్ణుండను జంబుక సత్త్వముండధిక క్షుత్పరవశుండై యొక్క భగ్నవాహినీ సమీప స్థలంబునఁ గ్రుమ్మరుచు నొక్కనాఁడు వాతాహత భేరీ నినాదమ్ము లాకర్ణించి భయమ్ము నొంది తన యంతరంగమ్మున నిట్లని చింతించె 106

క॥ మిక్కిలి నాఁకటిచేతం
జిక్కితి నీవేళ నేమిసేయుదునో కదే!
యెక్కడికి బోదునని యం
దొక్క మహా భేరిఁగనియు నొయ్యననగుచున్. 107

కం॥ పవనాహత తరుశాఖా
నివహాముచే మ్రోఁగుబెట్టిఁగి, నిర్భయుఁడగుచున్

* జెప్పు మల్పు పలుకు జేసెద వధిక నీ

జన మొప్ప జడియకతఁడి
ట్లు విచారము సేసె నాత్మలోఁగడు బ్రీతిన్. 108

గీ॥ అధిక భోజనమిదిగల్గె ననుచు లంబ
కర్ణుఁడా భేరి చించి సకౌతుకముగ
నందుఁ జొరబడి వెడలె నిరాశుఁడగుచు
నట్లుగావున నిది తెలియంగవలయు 109

వ॥ వచ్చిన శబ్దంబునకు భవన్మనంబున సాధ్వసంబేటి కిదె సర్వంబును
దెలిసి చనుదెంచెదనని తద్ధ్వని మార్గమ్మునంజని వాని ముందట 110

మ॥ కనియెన్ భూధర సన్నిభాంగునతి తీక్ష్ణ......
.........నిజవాల సంచలన భూవాతూల నిర్ధారితా
భ్రనికాయున్ మృగయూథ కర్ణకు హరోగ్రధ్వాను నుద్యత్కకు
ద్మన భూషాంచిత గర్వ నిర్వహణ విద్యాంకున్గ కుద్మప్రభున్॥ 111

మ॥ కని గోవల్లభ! యిట్టులొంటిఁ దిరుగంగా నేల యొక్కండ వి
ప్వన మార్గంబున నీ కథా వివరముల్ వాక్రుచ్చి నాకంతయున్
వినుపింపన్ దగునేనిఁ జెప్పుమనినన్ వీక్షించి యాద్యంతమున్
దన వృత్తాంత మెఱుంగఁజెప్పె నతిమోదం బాత్మసంధిల్లఁగన్॥ 112

వ॥ ఇట్లు చెప్పిన నవ్వృషభేంద్రుండు జంబుక ప్రభుం జూచి యయ్యా!
భవన్నామంబెయ్యది నన్నుడాయంజను దెంచుటకుఁ గతంబేమి యెఱింగింపు
మనిన నతండతని కిట్లనియె నేను దమనకుండను పేరుగలవాఁడ మృగనా
థుండు మన్నాథుండని చెప్పి వెండియు నిట్లనియె 113

మ॥ మదదంతావళ [కుంభసంభృతిలస]న్మాంసాన్నముల్ నిచ్చఁ బెం
పువలిర్పన్దిని మేనువాంగ సతతంబున్ శౌర్య గాంభీర్య సం
పదఁ బెంపొందిన సింహవల్లభునకున్ బంటన్ వృషాధీశ! కూ
ర్చెద మన్నాథుని నీదు స్నేహమునకున్ సిద్ధమ్ము వేడందగున్॥ 114

వ॥ అనిన సంజీవకుండు దమనకుం జూచి యతనికి నాకు మిత్రత్వం బెట్లు
సమకూడు! మృగేంద్రుండతులబలపరాక్రమ సంపన్నుండేనల్పబలుండ నఖిల
గుణంబులు సమంబైనఁగదా! సంధించవలెనని విని దమనకుండిట్లనియె 115

క॥ హీనాధిక బలములు నీ
మానసమునఁ దలఁపవలదు మైత్రిఘటింతున్
నా నేర్పు చేతనన విని
గోనాథుం డాత్మలోనఁ గోర్కులు నిగుడన్ 116

గీ॥ అట్లుగావించి నన్ను నెయ్యమునఁ బ్రోవ
మనిన దమనకుఁ డతని వీడ్కొని కుతూహ
లంబు పెంపార,నడిఁ బింగళంబు కడకు
నరిగి ప్రియమున వందనం బాచరించి, 117

వ॥ [నిలిచిన] పింగళకుం డతనిం బ్రియపూర్వకంబులగు వాక్యంబుల
నాదరించి పోయివచ్చిన కార్యం బెఱింగింపుమనిన దమనకుం డిట్లనియె. 118

సీ॥ సమవర్తి వక్త్రదంష్ట్రా భీషణములగు
దీర్ఘ విషాణముల్ తేజరిల్ల
ధరణిఁ జరించు గోత్రగావ మోయన
నమరైన సింహాసనాహనన నొప్పఁ
బాయని మేచకాభ్రముభాతి నెంతయు
రమణీయమగు మూపురమ్ము దనరఁ
బ్రళయావసర [రుద్ర] పటహాని నాదంబు
లంకురించిన మాడ్కి నంకెలమరఁ

గీ॥ బ్రకట గాంభీర్య ధైర్యదర్ప ప్రతాప
గుణములఁదనర్పు నొక వృషగణవరేణ్యుఁ
గంటినాతఁడు నన్నును గారవించె
[నధిపు మన్ననగల] బంటనగుటఁ జేసి, 119

వ॥ అని చెప్పినవిని యిట్టి బలపరాక్రమ సంపన్నునికడ కెట్లువోయితని
నడిగినఁదద్విధం బెఱింగించెదనని యతం డిట్లనియె. 120

మ॥ ఘనబాహా బలసంపదుజ్జ్వలుఁడు దీర్ఘక్రోధుఁడై వీర యో
ధని కాయమ్ములఁ గూల్చు నల్పజనులన్ ధాత్రీస్థలిన్ నిల్పు నె
ట్లనినన్ గాఢజవ ప్రభంజనుఁడు ఘోరారణ్య సాలమ్ములన్
గినుకన్ గూల్చి తృణమ్ములన్ నిలుపుమాడ్కిన్ లక్ష్మ మంత్రీశ్వరా! 121

వ॥ అట్లుకావున నిశ్చయమ్మున నచ్చటికిఁ జనిన నీకును నతనికి మైత్రి సంఘటింతు నతనిం దోడ్కొని చనుదెంచెద నిక్కార్యమ్మునకు సమ్మతంబగునే యనం గంఠీరవ సత్త్వముండు కౌతుకాయత్త చిత్తుండై తత్ప్రయోజనం బాచరింపుమని యాలింగనమ్ము చేసి యనిచినం, జనియో ఋషభేంద్రా! మృగేంద్రుండు నీ కథయమ్మెచ్చి నీ కార్యమ్ము సర్వమ్ము నతని కెఱింగించితి నీవును గృతార్థుండవైతి వమ్మహాత్ముని దర్శనమ్మున కేతెమ్మనిన నతండు. 122

ఆ॥వె॥ సంతసమ్ముతోడఁ జనుదెంచి వందనం
బాచరింప నతని నా మృగేంద్రుఁ
డాదరించె నప్పు డాలింగనమ్మునఁ
గరము సొంపు మిగులఁ గౌతుకమున 123

గీ॥ అప్పుడిరువురు మైత్రిఁ బెంపారఁ జేసి
స్వర్ణ మునుమణి విధమున సంతతంబు
గలసిమెలసియు నుండి రిబలిమిచేటు
పాటు మదిలోనఁ దలంపక ముదమున. 124

వ॥ ఇట్లు సింహవృషభేంద్రులు జంబుక నిమిత్తంబున మైత్రిఁజేసి సుఖంబుండి కంత కొంతకాలమ్ము చనిన సమయమ్మున మృగాధిపతి వృషభేంద్రు వశలంబడి యుండెటుంగక యతండును దానును భోజన మజ్జనశయ్యాసన పాన సౌఖ్యమ్ములఁ బ్రొద్దుపుచ్చుచు దమనకు మఱచిన నతండు పుటపుటం బొక్కుచు తన్ను విచారింపకునికిం జేసి క్షుధార్తుండై కరటకుం గూడికొని యుండెనందు. 125

సీ॥ దమనకుండను-మున్ను ధాత్రిపై! మేషసం
గ్రామంబుచే జంబుకంబు భిక్షుఁ
డఘమానసుండగు నాషాఢభూతిచే
వడి మంగలియుఁదం తువాయుచేత
తమతమ చేయు నేరముల మోసమునొంది
నట్ల [నా] బుద్ధిహీనత్వత దలంప
నిట్లయయ్యె నటన్న నెంతయుఁ బ్రీతితోఁ
గరటకుండీ మూఁడుఁకథలు నాకుఁ

ఆ॥ వె॥ గర్ణ పర్వముగను గ్రమముదప్పక యుండ
———చెప్పుమనిన నతఁడు
———శివశర్మ
———యనగ గలడు——ఘనుఁడు 126

గీ॥ అతఁడు చిరకాల మార్జించినట్టి ధనము
దనర నొక బొంతలోన గుప్తమ్ము సేసి
బడుగు నొడలికిఁ దొడవుగాఁ దొడిగి దాని
విడువ డెప్పుడు దిరుగుఁ బర్వ్విధము దెలిసి. 127

వ॥ ఆషాఢభూతియను దురితాత్ముండది యపహరించు వాఁడై యా భిక్షుం జేరి మహాత్మా! నేను నీకు శిష్యుండనై పరిచర్య సేయువాఁడనై వచ్చితి నన్నుఁ బరిగ్రహింపుమనిన నాతండును వాని విధమ్మునకు మెచ్చి కపటత్వ మ్మెఱుంగక యుండె నా కపట శిష్యుండును బనులయెడ విశ్వాసిం పన్ జేయుచు కిల్బిషరహిత హృదయుండునుం బోలెపాయక శుశ్రూష సేయుచుండెనంత కొన్ని దినమ్ములకు భిక్షుండతని నమ్మి తన యొడలి కుబుసంబతని చేతికిచ్చి పదిలంబనిచెప్పి వనోప కంఠమ్మున కాచమ నార్థం బరిగి యంపలి తటాక తటమ్మున నగ్ర పరాక్రమమ్మునం బోరు మేష ద్వయంబుఁ జూచుచుండెనప్పుడు, 128

కం॥ ఒండొకటిఁ బాసి తాఁకుచు
నుండఁ దలల్పగిలి రక్త ముబ్బుచునుండన్
అండములు వెడల జవురుచుఁ
గొండల క్రియఁ బోల్చె మేషకుంజరములిలన్. 129

కం॥ ఆలోపలఁ జనుదెంచి సృ
గాలం బొక్కటి కృతాంతక ప్రేరితమై
కీ లెఱుఁగక నడుమంబడి
కూలెన్ గీలాలవాంఛ కుంభిని మీఁదన్ 130

గీ॥ అపుడు శివశర్మ మది విస్మయంబు నొంది
జంబుకము గూలె మేష యుద్ధమ్ము చేత
ననుచుఁదన శెంకి కే తెంచు నంత బొంత
పుచ్చుకొనిపోయె నాషాఢభూతిగాఁడు. 131

వ॥ అంత శివశర్మ తన నిలయమ్మునకే తెంచి యాషాఢభూతిం గానక బొంత యెత్తుకొని పోయెనని కలుషపడి చింతింపుచు నర్థాపేక్షం బొక్క పడియతనింగను గమనిక నొకపుటభేదనంబు ప్రవేశించి యందు నొక్క తంతు వాయ గృహమ్ము వేకిం జేరి శయనించియుండె నవసరమ్మున 132

కం॥ నారాయణు నంబరల
క్ష్మీరమణి నిజాంఘ్రి [కంజ] కీలితమగు మం
జీరమున ద్రవేసెనోయన
సారస బాంధవుఁడు నపర శరధిం గ్రుంకెన్ 133

చం॥ తన మణి పోవ నంబరము ధారుణిలో వెదుకంగ వచ్చెనో!
యనఁదగె నంధకార నివహమ్ము, సరోజ భవాండ పేటికన్
దనరగ నిష్ట కస్తురి విధంబున, జారుల మానసమ్ములున్
ఘనముగఁ గైరవమ్ములు వికాసమునొందె ననంతరమ్మునన్ 134

కం॥ మరుదీశ దిగ్వధూటిక
కరకందుకమనఁగ గగనకాసారసితాం
బురుహమున మదనకువలయ
శరమనఁ గనువిందొనర్ప శశివొడ తెంచెన్. 135

వ॥ తత్సమయంబునం గోకవిరహిలోక [భీ]కరంబులును జకోరహృదయ వశీకరమ్ములును గలశపయోధి శోభాకరమ్ములును నగు చంద్ర కిరణమ్ములు భూభాగమ్మున నిండియుండెనయ్యవసరమ్మున. 136

చం॥ ఒడలికి నన్ను, గన్నులకు నొప్పగు కెంపు మనోజ్ఞ జిహ్వకున్
దడవడ పల్కులంఘ్రులకు వేమరునుం దడబాటు గూర్పు, నో
పెదు మదిరావశత్వమునఁ ద్రేలుచునుండెడి తంతువాయున
ప్పుడు గని వాని భార్య పర పూరుషసంగమ వాంఛ నేయుచున్ 137

వ॥ ఉండు నెడ నంబష్ఠ కన్యకా ప్రేరితయై యుచితాలంకారమ్మునం జెలువొంది మందమంద గమనమ్మునం జనునవసరమ్మునఁదద్విభుండు 138

కం॥ ఒడలెఱుఁగక కులటికె! యె
క్కడ బోయెదు ముప్పుకన్ను గవ ద్రావమినన్నై

వడికని పట్టుక రోషం
బడ పఁగ బంధించె దాని పతఁడు గృహమునన్ 139

వ॥ ఇట్లు గృహస్తంభంబునఁ దన భార్యను వెతిచికట్టి పాన పరవశత్వమ్మున నిద్రాపరవశుండై యున్న సమయంబున, 140

ఉ॥ ఓగు విసాళి గుల్లబసి యోటు, బికారి విటాళి పాలికిన్
రోగముకుండ గోకరి కురూపి మృషాలయ యింద్రజాలద్ర
వ్యాగమశీల మాటల ప్రియంబు నయంబ [నయంబు] మీఱఁగా
వేగమవచ్చి మంగలి నివేశన బద్ధ వధూటి, కిట్లనున్ 141

కం॥ ప్రియుఁడంపిన వచ్చితిన
ప్రియమిప్పుడు సేయవలదు ప్రియుప్రియ యుక్తిం
గ్రయముగఁగొని బన్నమ్ములు
శయమున దిగిచికొని నా కొసంగుము తన్వీ! 142

వ॥ అని కుంటెనకత్తె యగు మంగలి చెప్పిన విని తంతుకారాంగన దాని కిట్లను చెలియా! మద్వల్లభుండగు వీఁడు వీతమానసుండై నే భుజంగాసక్తిఁ బోవుటెఱింగి నన్ను బంధించె నే నెవ్విధంబున వత్తునని మంగలి కొండొక చింతించి నీ కిట్లు నేత్రెంచి నిన్ను నీ వల్లభుకడకు నంపి నీవు వచ్చు నంతాఁక నిన్నుఁబోలెవెఱిగి కట్టుకొనుండెదనని నా సాలెలేమ సంతోషించి నీ నిమిత్తమ్మున మద్వాంఛితమ్ము సఫలంబాయెనని మంగలి దాని చేతన కట్లు విడిపించుక తాఁదానింగట్టిన నదియును మదన మదావేశమ్మున నూర కుండె నంత. 143

చం॥ పసిఁడిసలాక చెంగలువబంతి రతీశ్వరువంతి యెప్పుడున్
రసికుల పక్కవాపు వలరాయనితూపు మనోజకేళికిన్
గొసరగలట్టి రూపు కడుగూటమియందులయేపు నుజ్జ్వలో
ల్లసముల కుప్ప కప్పురపు లప్పలమించిన సాలె లేమయున్, 144

వ॥ ఇట్లొప్ప యుచితశృంగార వేషమ్మున సంభ్రమంబు దళుక్కొత్త జలధర మధ్యనిర్గత సౌదామనీ లతికచందమ్మునఁ దనమందిరమ్ము వెలువడి వ్యాయమగ్రాహ్య పయోధర భారమ్ములవలన మధ్యంబసియాడ నీలిచేలంబు ముసుంగిడి గోడ నీడలనడచుచు శంబర విరోధియాఱవ బాణంబనంగ

ననంగశరమ్ముల నవయవమ్ము లెఱుంగక విటాన్వేషమ్మున మందగమన
మ్మున నావరాంగన గృహాంత్య కుటీరమ్ము చేరి జారుం గౌఁగిలించికొని
యధరపానమ్మునం దేలి కలరవమ్ము లుల్లసిల్ల మన్మథ యుద్ధమ్మునకు దాని
నంతనక్కడ మేలుకొని. 145

క॥ ఆతంతువాయుఁ డప్పుడు
నాతింబిలువంగ నది పినని యట్లుండన్
నాతోఁడ నలిగినావని
దూతిక నాసమ్ము కత్తి దూరిచికోసెన్ 146

వ॥ ఇట్లు, అంబష్ఠి ముక్కుగోసి కప్పు అఁగంకపైచై నిద్రించెనంత నా
సాలెత విటకానితో నిష్టోపభోగంబులం గేళిసల్పి వానింబోఁబనిచి క్రమ్మఱ
నాత్మీయ గృహమ్మునకు వచ్చి నాసికాచ్ఛిన్నయైన మంగలింజూచి భయం
బున కపటంబుపడి దాని కట్లువిడిచి వెండియుఁ దాకట్లం బడియుండియు నా
మంగలి దానింబోలె నేడ్చుచుండియుఁ దద్భూతికాంగనం, గర సంజ్ఞంబోవం
బనిచిన నదియును నెత్తురు నాకికొనుచుఁ దలవరులకుం దప్పించుకొని తన
యింటికరిగి పూర్వభావమ్మున నుండెనంత. 147

సీ॥ ప్రాచీదిశావధూ ఫాలదేశమ్మునఁ
బొలుపొందు చంద్రంపు బొట్టనంగ
జంభాసురారాతి సౌధోపరిస్థితిఁ
గోమరాగకాంచన కుంభమనఁగ
ప్రథమాచలేంద్రమ్ము పైఁగనుపట్టి శో
భిల్లిన జేవురు గల్లనంగ
కోకవియోగాగ్నిఁ బోకార్చుటకు నెత్తు
సముదాభయ శయాంబుజంబనంగ

చంద్రుఁడ పరాద్రిఁజేర, భూజనులు నిద్ర
దేఱఁ, గలువలు ముకుళింప, వారి జాత
వితతి వికసింపఁ, జీఁకటి విరియఁ, గెంపు
మెరయ, మార్తండ బింబమ్ము మింటఁ బొడమె॥ 148

వ॥ ఇట్లువేఁగు నవసరమ్మునఁ దంతువాయుని భార్య దంభ నిద్రితుం
డగు ధవుని గుఱికించి వృథాక్రోశ సమేతయై శపథమ్ముగా నిట్లనియె. 149

తే॥ అన్యపురుషుని నా హృదయమ్ములోనఁ
దలఁచి యెఱిఁగితినేని సత్యమ్ము, నాసి
కంబు రాకుండు నారీతి గాకయున్న
వచ్చు గ్రమ్మఱ, నని పల్కె వనిత పతిని॥ 150

వ॥ అయ్యవసరమ్మున నతండు గనుంగవ దెఱచి నాసిక ముఖమ్మునం దేజరిల్లు నాత్మవల్లభం జూచి యువతీ! పతివ్రతాభరణం బనసి గాఢాలింగనంబు జేసి తద్బంధనంబులు విడిచెనంత. 151

కం॥ సంతోషమ్మున భిక్షుం
డంతయు వీక్షింపుచుండ నద్దూతికయ
త్యంత విషాదమ్మునఁ గడుఁ
జింతింపుచునుండె ముక్కు చేడ్పడుకతనన్॥ 152

వ॥ అంతఁ దద్వల్లభుండగు క్షౌరకుండు పురజనమ్ములకుఁ బనులఁ జేయుటకునై ముంగిట నిలువంబడి తన భార్యంబిలిచి క్షురికాసంఘమ్ము దెచ్చియిమ్మనిన నది మొగమ్ము గానరాకుండ నిలయమ్ములోనుండి చేయి సాచి యొక్క కత్తియిచ్చిన నది శాతక్షురిక గాకుండుటం గలంగి గృహమధ్యంబునం బడవైవ నాజంత తనకిదియ సమయంబని విస్మయశోకమ్ములు కల్పించుకొని యప్పుడు. 153

శా॥ ముక్కున్ గత్తి కరమ్మునందుఁ దనరన్ మొత్తో మొఱాఁలింపరో!
త్రెక్కె యిప్పుడు గావరో! నిరపరాధిన్ నన్ను మద్భర్త, చేఁ
జిక్కంబట్టుక యింతచేసెననుచుం జీరెంచలారిం బ్రభున్
నిక్కం బంచుజనమ్ము వీథులఁదను న్వీక్షింప దుఃఖింపుచున్॥ 154

సీ॥ అతలవరి భూతలాధిపు కెఱిఁగింపఁ
గుపితుఁడై మంగలి నపుడుపట్టి
తెప్పించి సభఁగూర్చి యిప్పుడీ పాపాత్ము
నేమిసేయఁగదగు నెఱుఁగఁజెప్పు
డన విని శూలమ్మునను వీని వ్రేయంగఁ
దగవని జెప్ప నత్తఱిజవమున
సన్యాసి చన విచ్చి యన్యాయమిదియని
తలయూఁచినగుచు పద్యమ్ము చదివి

గీ॥ తగరుపోర సృగాలమ్ము, తాఁ దలంప
భూరికపటాత్ముఁ డాషాఢభూతిచేత,
తంతువాయకుచే దూతి, తనక తనక
స్వార్థముగఁబొందె నీ మూఢనర్థములను 155

వ॥ వెండియు నమ్మహాత్ముండు సవిస్తరమ్ముగా నెఱిఁగింపఁ దత్స భాజనంబులు విస్మయంబు నంది రి నరేంద్రుండును నాయంబష్ఠుని విడిపించె నా శివశర్మయు నపహృతార్థుండై యెందేనియుం జనియె, నట్లు భిక్షుకజంబు కదూతికలు తమతమ నేరమిచే వృథాచేటు నందిరి. అట్లు నేనును నా నేరమి కతంబున నిది దెచ్చుకొంటి ననిన విని కరటకుండు దమనకుం గర్తవ్యం బెయ్యది చెప్పుమనిన, దమనకుం డిట్లనియె. 156

కం॥ మృగవల్లభ వృషభులకును
బగబుట్టఁగఁజేసి ప్రేమవాయఁగ జేయన్
దగిన మహోపాయము పెం
పుగఁ దలపోయంగవలయు బుద్ధి నటంచున్॥ 157

కవిరాజ విరాజితము॥

చలమున విక్రమసంపద నోర్వవశం [బదికాక] యుపాయపుఁ బెం
పలవడ గెల్వఁగవచ్చు నహీంద్రుని నబ్బలి భుగ్విభుమాడ్కి ననన్
దెలుపు మఱొట్లన మున్నొక క్రూరుఁడు దేఁకువ వాయసయుగ్మము, పి
ల్లలఁగన దత్తరుకోటర నాగము లాఁచి కొనంగని శోకమునన్॥ 158

వ॥ ఒక్కనాఁ డవ్వాయసవిభుండు నిజసతింజూచి ప్రసవసమయంబగు టెఱింగి తన సఖుండగు జంబుక ప్రవరుకడకుం జని మదీయ నివాసంబగు తరువున నొక్క కోటరమ్ముఁ జేకొని యొక్క కాలసర్పంబు మదర్భకుల భక్షింపఁదొడంగె, తద పాయోపాయమ్ముఁ జెప్పుమనిన నతండతని కిట్లనియె. 159

కం॥ బక యొక్కటి మీలసము
త్సుకతందిని యెండ్రిచేత సొంపరిమదినం
తకుఁ జేరదె హింసారం
భకులకు ధరలోనఁ జేటువాటిలకున్నే! 160

వ॥ అనిన నాకథా వృత్తాంతం బెట్లని కాకంబడిగిన జంబుక ప్రభుం
డిట్లనియె. 161

సీ॥ అనఘులంబోదరుండను బకాధిపుఁ డొక్క-
కొలని తటమ్మున నిలిచియున్న
[నడిగె] నంపలి యెంత్రి యాహారశూన్యత
నిచట నింకనుఁ గార్యమేమియనిన
నేఁ మత్స్యములు మాకు నాహారములు గాన
నవి నేడు జాలరు లరుగుదెంచి
[కై] కొని పోదు రెక్కడఁ జొత్తునని యిట్లు
[వనరుచు] న్నాఁడనిన పలుకు

ఆ॥ వె॥ లాలకించి మీనులన్నియు నేతెంచి
యతని మమ్ముఁ బ్రోవుమనిన మిమ్ముఁ
గరుణతోడ నన్య కాసారములలోన
విడుతు బ్రతుకుడంత వేడ్క-ననిన, 162

కం॥ ఆమాట నమ్మి ఝషములు
ప్రేమమ్మున నెచటనైనఁ బెట్టుమటన్నన్
దా మొఱఁగితిగిచి క్రమమున
బామరపతి వానినెల్ల భక్షించినచోన్ 163

గీ॥ ఎండ్రి విభుఁడెఱింగి యిప్పుడు నన్నును
గొంచు నేగుమనినఁ, గొంగయప్పుడు
పారివచ్చి తన్ను బట్ట కుళీరమాం
సార్థియగుచుదంభ మతిశయిల్ల 164
వ॥ అప్పుడతండు మనమ్మున నిట్లని వితర్కించె

చం॥ ఇది కపట ప్రభావమున నేచిఝషమ్ముల మ్రింగి నన్ను దు
ర్మదమునఁ బట్టి చంపు ననుమానము లేదిక విక్రమంబు చూ
పెదనని యంతరంగమున భీతి నెఱుంగక బల్మి కంఠమున్
వదలక కొండ్లఁబట్టి యమవాసము జేర్చె బకాధినాథునిన్ 165

వ॥ అట్లుగావున హింసాపరులుం గార్యాంతరంబులఁ హతులగుదురనిన,
గావుండు నిప్పుడుచితకార్యం బెఱింగింపుమనిన హిరణ్యకుండు స్వేచ్ఛాపతి కాకం

బుఁ డిట్లనియె నిమ్మహీపాలు [నంతఃపుర కాసారంబునకుం జని] కనక భూష
ణంబు నపహరించి తావకాపకారియగు గోకర్ణ కోటరమ్ములో వేయుమని
పీకుకొలిపిన నవ్వాయసవిభుండును. 166

కం॥ రాజగృహమ్మునకును జని
రాజచ్చుట జలకమాడ రాగిల్లి సనో
రాజ? మగు పీటమీఁదను
రాజిల్లెడి కనకభూషరాజటు పెట్టన్ 167

కం॥ కనికాకము భూషణముం
గొనివచ్చి ఫణీంద్రుఁడున్న కోటరమధ్యం
బున వేయ జాని వెనువెం
టన వచ్చిరి రాజభటులు ధాకదలిర్పన్ 168
వ॥ వచ్చి తద్భూజంబు క్రింద నిలువంబడి,

గీ॥ పాదపము నెక్కి యందలి పాము జంపి
కనక సూత్రమ్ము జేకొని చనిరి వేడ్క
కాకమిథునమ్ము [నుది] ఁగుతుకంబు నొందె
నట్లుగాపున దగు నుపాయంబు నలయు 169

కం॥ మతినుంతుఁడైన సౌఖ్య
స్థితినుండు నబుద్ధియైనఁ జెడిపోవును దు
ర్మతియై హరి, శశకముచే
మృతిఁబొందిన మాడ్కి...దలిర్పన్ 170
వ॥ కరటకుండా కథయెఱింగింపు మన దమనకుం డిట్లనియె.

సీ॥ కలఁడొక్క వనమునఁ గంఠీరవేంద్రుఁడు
దర్పించి మృగములఁ దఱచు చినఁగ
మృగములన్నియు గూడి మృగ కులాధిప యిట్లు
దిననేల మాయందు దినము నొకని
భక్షింపఁదగునని పల్కిన నంగీకరించి
యా రీతిఁ జరించుచుండ
నందొక్కనాఁడు శశాధీశు దినము వ
చ్చిన వాఁడు మదిలోనఁ జింతనొంది

గీ॥ ఘనతరోపాయ మొక్కటిఁ గాంచి, బుద్ధి
నలరు వానికిఁ, గానికార్యములు గలవె!
యనుచు సంతోషచిత్తుఁడై యచ్చటికిని
దడసిపోయినఁ గోపించి తన్ను జూచి. 171

మ॥ త్తకోకిల॥ లంబకర్ణ! మహాత్ముఖం బడలంగఁ జేసితివన్న సిం
హంబుతోనను సన్యకేసరి యామిషాభిరతిన్ బ్రమో
దంబు నొంది గ్రహింప వచ్చినఁ దల్లడించి యరణ్య భా
గంబునంబడి పారివచ్చితిఁ గల్లకాదని పల్కినన్॥ 172

వ॥ సింహంబు కుందేలున కిట్లనియె.—— 173

గీ॥ నాకుఁ జూపఁగలవ! యాకేసరి ప్రభు
ననినఁ బదమటంచుఁ నధిక నిమ్న
కూపతీరమునకుఁ గొనిపోయి, వీఁడె యు
న్నాఁడు చూడుమనుచు వాఁడు పలుక, 174

వ॥ మృగేంద్రుండును జలాంతరమ్మునఁ బ్రతిబింబితంబగు కంఠీర
వంబు గనుంగొని కోపించి హుంకరిపుచు దుర్మదంబున నానూఁతంబడ
నుఱికి మృతింబొందె, నప్పుడా శశకంబు నిఖిల మృగస్తోత్ర పాత్రంబయి
చరియించెనట్లు గావున కుశలబుద్ధి వలయుననిన విని కరటకుండట్లేని భేద
కార్యంబున నన్యోన్య వివాదంబొపాదించి తగు నుపాయంబునం బ్రవర్తిం
పుము రాజసన్నిధి నీకు భద్రంబగు గాక పొమ్మని యనిపిన మహాప్రసాదం
బని దమనకుం డచ్చోటువాసి పింగళకు సమీపంబునకుం జని యిట్లనియె. 175

గీ॥ అధిప వీక్షింపుడిదె ప్రళయంబు వచ్చె
భూమిఁ దనవిభు నాపద పొందుచోటఁ
దెలుపకుండిన భటుఁ డెందుఁ గలుషమనుచుఁ
జేరి హితవాచరింప వచ్చితినటన్న, 176

ఉ॥ పింగళకుండు వానిఁ గడుప్రేమముతోడుతఁ జెప్పుమన్నఁ జె
ప్పంగఁ దొడంగె, నుక్షపతి పాపమతిన్ భవదీయశక్తి నా
ముంగల కొద్దిచేసి యను మోదఫలంబున రాజ్యమెల్ల నే
లంగల వాఁడనంచు ధనలావు మదమ్మున నున్న వాఁడనెన్. 177

వ॥ అని చెప్పిన దమనకు వాక్యమ్ము లాకర్ణించి హరిరాట్పుంగవుం డాశ్చర్య భయహృదయుండయ్యుఁ గొండొక విచారించి యతండట్టివాఁడు గాడని దమనకుతోఁ జెప్పిన నక్క పటాత్ముండు వెండియు నిట్లనియె. 178

క॥ ఉత్తమపతి యొకఁడు మీఁకును
వీక్షింపఁ బ్రధాని యతఁడు వెరవున సర్వా
ధ్యక్షుండయ్యును కైతవ
దక్షుఁడు మదిలోన నమ్మఁదగదని మఱియున్॥ 179

వ॥ మృగరాజా! వృషభంబు కృతఘ్నుండు చేసిన మేలెఱుంగని వాఁడు వానినమ్మరాదు నిన్నుం ద్రోసి రాజనయ్యెదనని యున్నవాఁడు. ఇట్టి కార్యమ్ము విన్నవాఁడనై నిప్పు ద్రొక్కినట్లగరిపడి నే నీకుం జెప్పవచ్చితి, ప్రళయమ్ము వచ్చెనని నేవిన్నవించుటయెల్ల, నీ సంస్థానంబు చెడిపో, నేఁ జూడజాలక సుమీ! యని విన్నవించి వెండియు నిట్లనియె. 180

కం॥ పతికన్న మంత్రి బలిసిన
క్షితియాతని దైతనర్చు సిద్ధము పతిదా
పతి కంటెతవరదైనను
పతికార్యము చెడును నూతన భరతాచార్యా! 181

సీ॥ రాజ్యరక్షకుఁడుగా రాజు మంత్రిని నిల్పు
మంత్రి యాదక్షత మదము నొందు
నా మదమ్మునఁ గార్యమా లస్యముగఁ జేయు
నటమీఁద స్వాతంత్ర్య మాత్మఁగోరు
స్వాతంత్ర్యమున నిజేశ్వరున కొంచుదలంచు
నంతట మతి వేఱె యగుచునుండు
నందుకుఁ బ్రతికర్మ మప్పుడు మఱచిన
వెనుకనంతటబోదు విగ్రహించుఁ

గీ॥ గాన విషమైన భోజ్యమ్ము గ్రక్కవలయుఁ
దవిలి నొప్పించు దంతమ్ము దివియవలయు
మంత్రియును దుర్జనుండైన మాన్పవలయు
రాజనీతికి విత్తయ ప్రభుని లక్ష్మి! 182

వ॥ అని యివ్విధంబున రాజనీతిక్రమంబు విన్నవించినఁ బింగళకుం డాకర్ణించి దమనకుతో నిట్లనియె. నయ్యా! యా సంజీవకుకుండు నాకుం బక్షపాతంబు పెద్దమైయుండు నతండును నాయందునట్ల. అతనియందు దోషమ్ము లేనియట్లున్నది. అస్మత్కార్యమ్ముపట్ల కంటిని ఱెప్ప గాచినట్లు నాకుంగన్నాకై యున్నాఁడు. ఇట్టి పెద్దను దుర్నీతిచేత నెడయం జేసికొనుట కార్యమ్ముగాదనిన దమనకుం డిట్లనియె. 183

కం॥ సుతుఁడనుచుఁ జుట్టమనుచును
హితుఁడనుచును నమ్మవలవ దెఱుఁగని రీతిన్
మతిదృష్టిఁ దెలియ వలయును
బతులారయ వారి నూత్నభవతాచార్యా! 184

కం॥ మంత్రుల బుద్ధుల వినక, కు
మంత్రుల వాక్యములఁ దిరుగు మనుజేంద్రుఁడు దా
తంత్రమున బోసి పగతుర
యంత్రమ్ములఁ జిక్కుపడు మహాత్ముండైనన్॥ 185

వ॥ అని చెప్పిన మృగేంద్రుం డిట్లను నేవతని కభయంబొసంగితి నా వృషభరేణ్యు నెట్లు నిగ్రహింతు నది యకర్తవ్యంబు. కావని చేసితినేని పర లోక హానియు నపకీర్తియు నగు, నతని హృదయంబున దోషంబించుకయును లేదు, అధికతర ప్రియంబబ్బుచున్నది యని దమనకుండు నిష్ఠూరొప్పు నిగిడించుచు వెండియు నిట్లనియె. 186

గీ॥ కావ్యమతము రిపునికాయమ్ము నెవ్విధి
నైన జెఱుపవచ్చు, నఖిల సమ్మ
తంబు, మైత్రిఁజేసి దంభభావమునఁ జ
రించువానినట్ల త్రుంచవచ్చు॥ 187

వ॥ రాజులకుఁ దలంప వీరధర్మంబు కారణంబు ధర్మాధర్మమ్ములు విచారించిన రాజ్యంబెట్లు సిద్ధించు విరోధులగు కపటాత్ములం బొలియించుచుటయు, నాప్తవాక్యంబు లాకర్ణించుటయు, నేర్పు గలిగి కార్యంబుల పట్ల ప్రవీణుండగుటయు, రణధైర్యంబు గల్గుటయు, నను రాజగుణంబు లెఱుంగ వలయు నవివేకపరిపూర్ణంబై యున్నది భవదీయహృదయంబున నాహితంబు ప్రవేశింపఁ జోటులేదని మఱియు నతం డిట్లనియె. 188

ఉ॥ నీకుఁ బ్రియమ్ము గూర్చి బహునీతులు కార్యపథమ్ము దెల్పఁగన్
జేకొనవైతివిట్టు విధిచేఁ జెడువారలకేల బుద్ధి, శౌ
ర్యాకరుఁడైన గోవిభుని యద్భుతకైతవశక్తి మెచ్చి, దీ
నాకృతి నా హితంబు హృదయంబున నిల్పవవన్న, నావుడున్. 189

వ॥ పెద్దయుంబ్రొద్దు చింతించి సంజీవకు గుణావగుణంబు లెఱింగెద
నతని నిచ్చటికిం దోడ్కొని రమ్మనిన నతండట్లని బలవంతుండను నీచెప్పినట్ల
వినునే! మంత్రభిన్నమ్ము గాకుండ నరిం బొరిగొనవలయు నీవు పలంచిన
మహోద్యోగమ్ములు జన్మాంతర ఫలప్రాప్తియునుంబోలె నిసువలై యున్న
యవిగాన సన్నిహిత కార్యంబులుగావు నొరుల కపటత్వంబూహ నెఱుంగ
వలయుననిన, నమ్మృగేంద్రుండు తోఁకఁ ద్రొక్కిన భుజంగమ్ము చందంబున
మండిపడి యహంకార పూర్వకంబగు వాక్యంబున నిట్లనియె. 190

కం॥ తలపోయ నుగ్రవిక్రమ
కలితుఁడ నన్నేమి సేయఁ గలఁడని, తనతోఁ
బలుకక యుండిన దమనకుఁ
డలరుచునుం బలికె పెద్ద నాతనితోడన్॥ 191

వ॥ ఎవ్వండేని గృహమ్మునం దన నడవడి యెఱుంగని వానికిఁ బ్రతి
శ్రీ నొసంగిన డిండిభంబు పట్ల దోషంబున మందవిసర్పిణి యను చీరపేనుం
బోలె దండధరునిలయంబునకుం బోవు ననిన విని మృగేంద్రుండా కథ
యెఱింగింపుమనిన దమనకుం డిట్లనియె. 192

గీ॥ అనఘ మున్నొక్క రాజు శయ్యాతలంబు
నందు మందవిసర్పిణి యనఁగ వస్త్ర
యూక యుండంగ డిండిభాఖ్యుండు మత్కు
ణాధిపతి వాయువశమున నచట పడిన 193

గీ॥ వానిఁ బొడగని ప్రీతితో వస్త్రయూక
యతిథి సత్కార పూజల నాదరించి
యేఁగుదెంచిన కార్యమ్ము నెఱుఁగఁ జెప్పు
మనిన నాతండు వానికిట్లనుచుఁ జెప్పె॥ 194

కం॥ మానవ నాయక! శోణిత
పాన మనోరథము చేతఁ బఱతేవలసెన్
నేనని చెప్పిన నందుకుఁ
దా నిట్లనియెం బ్రియమ్ము దళు కొత్తంగన్॥ 19

వ॥ డిండిభా! నీవు తీక్ష్ణదశనుండవు కాలం బెఱుంగవు యెట్టివాని నైన మిట్టిపడం బొడిచెద వనిన నల్లితేఁడు నట్లైన మన్నిలయంబున కరుగు దునే! యన చీరపేను దాక్షిణ్యమ్మున మహీపతి సుప్తుండైన రక్తపానంబు సేయుమని ముదల యిచ్చిన నల్లియు నల్లుకొన్న సంతోషాతిశయంబున నియ్యకొని, యెప్పుడు ప్రొద్దు గ్రుంకునని యెదురుచూడ నంత నిశా సమయంబగుడు రాజు భోజనం బారగించి శయ్యాతలంబునఁ జేరి నిద్రించు చుండ మెల్లన మత్కుణం బతని క్రిందకిం జని యా రాజుం గఱచిన నతం డదరి పడి లేచి. 196

కం॥ భూపతి ప్రతిహారులఁగని
దీపము దెమ్మనిన వారు దెచ్చిన యంతన్
వే, పారిపోయి మత్కుణ
మా పర్యంకమ్ము క్రింద నణఁగె భయమునన్ 197

గీ॥ మంచతలమెల్లఁ జూడఁ దన్మధ్యమందు
వస్త్ర యూక చరింపంగ వారు సూచి
యద్భుతం బంది యచ్చటి కరుగుదెంచె
ననుచుఁ జంపిరి దాని ననంతరంబు॥ 198

వ॥ అట్లు గావున వివేక హీనునకుఁ దన శ్రీ యొసంగిన వస్త్రయూక చెడిపోయిన చందమ్మునఁజచ్చునని చెప్పిన విని మృగేంద్రుం డంగీకరించి యిట్లనియె మృగధూర్త! గోపతి యుద్ధ సన్నద్ధుండగుట, యేక్రమంబున నెఱుంగ వచ్చుననిన నతండిట్లనియె, నాయనడ్వాహమ్ము తన శృంగాగ్రమ్ములు వంచుకొని యభిముఖుండై చకితుండునుంబోలె పాదాంతి కమ్ము చేరునప్పుడు దెలియుమని చెప్పి యచ్చోటు వాసి సంజీవకు కడకుం జనిన వాఁడు దమనకుం జూచి యిట్లనియె. 199

సీ|| కుశలంబె యని పల్కఁగొల్చి మనెడు ప్రజ
కును దలంపఁగ నేటి కుశల మాత్మ
సంపదలను .మానసంబు ప్రాణంబులు
నధిపతి సొమ్ములటంచుఁ బలికి
ద్రవ్యంబు గలిగి గర్వము లేని వాఁడును,
భామామణుల వలఁ బడనివాఁడు,
నుర్వీశులకుఁ బ్రియం బొనరించు వాఁడును,
బంధురామయములఁ బడని వాఁడు

గీ|| నర్థియై గారవంబున నలరువాఁడు,
కపటచిత్తుని మాయలఁ గడచువాఁడు,
శమన పుటభేదనముఁ జేరఁ జననివాఁడు,
మనుజుఁ డెవ్వాఁడు గలఁడు భూమండలమున! 200

మ|| అన సంజీవకుఁడిట్టి పల్కులకుఁ గార్యం బంతయున్ జెప్పు మ
న్నను, వాఁడిట్లని చెప్పె రాజుకుఁ బ్రమాణం బెద్ది నీ మాంసమున్
దను సేవించిన వారికెల్ల నిడ నాత్మం గోరియున్నాఁడు, ము
న్నన ఘా! మైత్రి ఘటించినాఁడవని నీ కాద్యంతమున్ జెప్పితిన్|| 201

వ|| అని పలికిన విని యత్యంత విషాదమ్మునఁ గుందుచుఁ సంజీవ
కుండు దమనకుం గనుంగొని యిట్లనియె. 202

మ|| అపరాధమ్మొకయింతలేని నను నన్యాయమ్మునన్ రాజు క
ష్టపు వృత్తిన్ జెఱుపంగఁ జూచె కడు నాశ్చర్యమ్ము! సర్వం సహా
ధిపులం దెక్కడి నీతి! చూడఁగ మదాంధీభూత చేతస్కులై
యుపకారం బొనరించు వానిఁ బరుగా నూహింతురుర్వీస్థలిన్|| 203

కం|| కారణము లేక యల్గును
వారణ మశకముల నొక్క వడువునఁ జూచున్
ధారుణి పతిఁ గొల్చుట మది
నారయ నల్పంబు విశ్వలాత్మజ లక్ష్మా! 204

సీ|| అరయ జాత్యంధున కద్దమ్ముఁ జూపు చం
దమున నరణ్యరోదనము భూమిక్క

చెవిటి కేకాంతమ్ము సెప్పిన కరణి కృ
తఘ్నుని తోడి మిత్రతవిధమున
జడధిఁ జిన్కిన వృష్టి వడువున నూషర
స్థలములఁ జల్లు బీజముల పగిది
షండుండు కన్య విచారించు పోలిక
పందికి చందన పంకమట్లు

గీ॥ సతి వివేక విరహితాత్ముండు నగు మహీ
పతికి నాచరించు హితవు నిష్ఫ
లంబు నీతి ఘన కళా చతురుండది
దెలియ వలయు లక్ష్మ! ధీసమేత! 205

కం॥ దండింపఁ దగని వారల
దండించిన, దండమునకుఁ దగువారి కృపన్
దండింపకున్నఁ జెడు భూ
మండల నాథుండు లక్ష్మ మంత్రి వరేణ్యా! 206

వ॥ అని చెప్పి వెండియుఁ గపట రహిత హృదయుండనగు నన్ను మృగేంద్రుండట్లు చేయఁదలంచె నది ప్రాక్తన కర్మఫలమ్ముగా నోపునని నిట్టూర్పు నిగిడించుచు మఱియు నిట్లనియె. 207

చం॥ సరసుల నక్రముల్, మలయ జంబులఁ బన్నగరాజు, కేతకీ
తరువులఁ గంటకమ్ములు, నిధానములన్ బహు భూతములు సుధా
కరునిఁ గళంకమట్లు నధికంబుగ, దుర్దశ లుర్విలోన స
త్పురుషులఁ బొందుచుండుఁ దమ పూర్వకృతంబగు పాతకంబునన్ 208

కం॥ అన విని దమనకుఁ డిట్లను
ననఘ! మృగేంద్రుండు గడుఁ బ్రియంబొనరించున్,
మనమున నది నమ్మకు దు
ర్జన లక్షణ మదియె మది విచారింపఁ దగున్ 209

చం॥ మలయజ శీతలమ్ములగు మాటలఁ దేల్చును, వచ్చినంతఁ బెం
పలవడ లేవఁ జూచును బ్రియంబు లొనర్చును లేఁత నవ్వు వె

న్నెలలు ముఖేందు నందమర, నిస్తుల దంభము మానసమ్మునన్
దలముగఁ బొల్చు దుర్జనుఁడు ధాత్రి తలంబున లక్ష్మధీమణీ! 210

సీ॥ బహుళాంధకారంబు వాపదీపము జీవ
నంబుల దాఁటంగ నావ భద్ర
దంతావళముల మదంబణఁప గనంకు
శము పన్నగముల రోషంబు చెఱుప
గారుడ మంత్రంబు ఘనతరాఘంబుల
హరియింప ధర్మవు నతి దరిద్ర
బాధ దీర్పంగ సంపద, శోకముల నోటు
పఱుప నానాకళా ప్రౌఢిమయును

గీ॥ బ్రేమమున నబ్జభవుఁడు గల్పించెగాని
చేయ నోపంగ లేడయ్యెఁ జెనఁటి హృదయ
దంభ మొక్కింత మాన్పంగ ధాత్రిలోన
లాలితోదార విత్తయ లక్ష్మధీర! 211

వ॥ అని చెప్పిన విని వృషభేంద్రుండు చింతా పరవశుండై తనలో
నిట్లనియె. 212

ఉ॥ గాలముఖమ్ము మేఁతలకుగా నతిసంభ్రమవృత్తి నేఁగి, మీ
నాలి జనమ్ము చేత హతమైన విధమ్మున నల్పబుద్ధి వాం
ఛాలస చిత్తుఁడై మడియు, నాహిఁబురంబుల త్రోవఁబోవలే
కీ, లయమంద వచ్చితి మృగేంద్రుని వాక్యము విశ్వసించితిన్॥ 213

వ॥ అనిన విని దమనకుండు సంజీవకుం జూచి

గీ॥ అల్పులైనట్టి మాంత్రికులైన, వైద్యు
లైనఁ, బల్వురు గూడిన నౌషధమ్ము
లౌనర నేమైన నిత్తురు సుష్ట్రవిభుని
నాదిమంబునఁ గాకాదులట్లతలఁప॥ 214

వ॥ అని చెప్పిన విని సంజీవకుఁడా కథ యెఱిఁగింపుమనిన దమనకుం
డిట్లని చెప్పందొడంగె. మున్నొక వనంబునింబకదంబోదుంబర జంబూ
జంబీర మాధవీ మధూకోద్దాల సాలహింతాల మందార సిందువార బీజ

పూగపూగ ఖర్జూర నారంగలుంగ లవంగ పనస వకుళామ్రాతకాదిముఖ్య వనంబై నృత్యరంగంబునుంబోలె నటనటీశోభితంబై శరన్నభోభాగమ్మునుం బోలె చక్రబాణాసన విరాజితంబై భారతసమర స్థలంబునుంబోలె నర్జున రమ్యంబై రమణీజనవదన శృంగారంబునుబోలె చందన తిలక రమణీయంబై యొప్పు నవ్వనంబునందు. 215

కం॥ కలఁడు మృగేంద్రుండతనికి
బలిభుగ్జంబుక తరక్షుపతులు సచివులం
దులవారు దిరుగుచు నుభయ
కలితుండగు నుష్ట్రవిభునిఁ గని వాక్రీతిన్. 216

సీ॥ ఉష్ట్రేంద్ర! యెందుండి నీరాకన,
నేనువర్తకు నో సరించి యిచట
నడుకువ నున్నాఁడ నన విని వారలు
నావిధంబెట్లని యడుగఁ, జెప్పె
దను విను స్వర్ణకుండను చేరి బహు పదా
ర్థము సంగ్రహించి సరాగమైన
త్రోవను చేరంబు తులదూఁగి యాడంగ
సమకట్టి గోనెను సకల ధనము

గీ॥ పూని నావీఁపుపై నెత్తి కాననమున
నరుగ భారము నధికమై యాఁగికొనఁగ
నొక్కచరిలోన నాగోనె చక్కవైచి
ముచ్చు నిచ్చట దాఁగితి ముదముదఱిగి 217

వ॥ అంత నాస్వర్ణకుఁడు నన్నుంగానక సకల కాననగిరి గహ్వరంబుల నెమకి, విసివి తన నివాసంబునకుం జనియె, నాఁటంగోలె నేనును వర్తకునకు వెఱచి స్వర్ణభారంబు మోవంజాలక యిందణంగి యున్నవాఁడ, నా భాగ్య వశంబున మిమ్ముం బొడగంటి ననిన, ఁగాకజంబుకతరక్షువులు సంతసిల్లి యిట్లనిరి. 218

సీ॥ లొటిపిట్ట నీకును లొంగంగ నేటికి
భయమేల నీకు మాభర్త సన్ని

ధికిని దోడ్కొనిపోయి యకలంక మృగరాజుఁ
గాన్పింపఁజేతుము ఘనతరముగ
ననుచు లొట్టియను దామనువుగాఁ దోడ్కొని
పోడగానిపింపఁగఁ బొంగి హరియు
నభయంబునిచ్చి యత్యాసక్తిఁ గథనకుం
డను పేరు నిచ్చి నిత్యాంతరంగుఁ

గీ॥ డుగను గృపఁజేసి సంతోష మగణితముగఁ
బ్రోచుచుండంగ నుండె నా ముసలియుష్ట్రి,
మరయఁ గొన్నాళ్ళ జన ననుచరులఁజూచి
చెలఁగి మృగపతి యిట్లని పలికె వేడ్క. 219

కం॥ కాకంబాదిగ మువ్వుర,
నాఁకలి పెద్దగుచునుండె నాహారము మీ
రేక మతిఁ దెచ్చి యిండనఁ,
గాకియు సకలమ్ము వెదకి క్రమ్మఱ విభుతోన్॥ 220

గీ॥ చూడఁగలచోటులన్నియుఁ జూచి వచ్చి
తిమి మృగాధిప మాంసము తెగువదొరక
దనుచు లొట్టియ యొక్కటి ఘనతనున్న
దదియు నీకును నాహారమగుత నేడు 221

వ॥ అని, మృగపతికి నుష్ట్రిమ్మీఁది కోర్కె వెగ్గలంబగుటకు నీరసంబున బలి భుగ్జంబుక తరక్షువులు తమమీఁది మైత్రి సడలుట జూచి, యెడయఁ జెప్పిన నక్కంఠీరవేంద్రుండు తద్వాక్యంబులు విని కర్ణకఠోరం బగుడుఁగంటక భోజనున కభయం బొసంగితి నేనెట్లు చెఱుతునన, ననుచర మధ్యంబునుండి వాయసప్రభుం డిట్లనియె. 222

ఉ॥ తెంపున నాలుబిడ్డల నతిక్షుధకుం బలి పాపవృత్తి శం
కింపక యమ్మడే! ధరణిఁ గ్లేశమునందిన వానికిం గృపా
సంపద కల్గ నేర్చునె! విచారము లేమిటి కుష్ట్రి వల్లభుం
జంపి భవచ్ఛరీరము నిజంబుగఁ బ్రోవు మృగేంద్ర చంద్రమా! 223

వ॥ అని చెప్పిన విని కరుణార్ద్రచిత్తుండై వెండియు నిట్లనియె. 224

కం॥ గోదంతి తురగకన్యా
మేదిని దానములకంటె మిక్కిలి యధికం
బేదనికి నభయదానం
బాదరమున నెఱుఁగు లక్ష్మణా మాత్యమణీ! 225

కం॥ శరణన్న వానిఁ గాచిన
హరిమేధ క్రతుపుకంబె నధిక ఫలంబున్
సిరియును దత్పురుషవరున్
గర మొప్పుగఁ బొందు ధరణిఁ గరణిక లక్ష్మా! 226

చ॥ అని మఱియున్ మృగేంద్రుఁడను నాతనితో నిపుడెట్లు చంపనే
ర్తును నకటా! యెఱింగియని దోషముగాదె తలంపనన్న, ని
ట్లనుఁ దన ప్రాణరక్షకొఱకై యనఘాత్మక యెవ్విధం బొన
ర్చినఁ గలుషమ్ము చేకురదు చింత భవన్మతినేల సారెకున్॥ 227

వ॥ మీరంగీకరించిన నేమేవధించెదమన నతండు క్షుధాజ్ఞాన ప్రవే
శంబున నూరకుండె నంత కాకజంబుక వ్యాఘ్రంబులు మువ్వురుఁ గూడి
కొని యుష్ట్రంబునకుఁ బోరిగొనుటకిదియ వేళయని కపటోపాయంబునఁ గథ
నకుం గూర్చికొని మెల్లనడాసి యా రాజుతో నిట్లనిరి. 228

కం॥ అడవులఁబడి తిరిగితి
మెక్కడ నాహారమ్ము సీకుఁ గానము నీవి
ప్పుడు మము నెవ్వరినైననుఁ
దడయక భక్షింపుమని ముదంబున మఱియున్ 229

కం॥ భావింప నింతకాలము
దేవరకృపచేత బ్రతికితిమి మీ కొఱకై
జీవము విడిచిన నేమీ!
భూవలయంబుననుఁ గీర్తిఁబొందమె యనుచున్॥ 230

వ॥ విన్నవించి యామువ్వురిలోఁ గాకంబు మృగపతిని డగ్గఱి దేవా!
నను భక్షింపుమనిన నది నవ్వి నా పంటిసందికిం జాలవు పొమ్మనిన నది
కడకుం దొలంగె-జంబుకంబు చేరంచి నన్ను నవలుమనిన కబళమాత్రంబునకుం

జాలస్య కదలుమనిన నది యొడిగినిలిచె, వ్యాఘ్రుంజేతెంచి నన్ను నాహారంబు గొనుమనిన నీవు నా కర్థాహారంబు చాలదనిన నది కడకుం బోయె, నిట్లు ముశ్వాస దోలంగినం జూచి యుష్ట్రవిభుండు నిశ్చయ హృదయుండై యిట్లనియె 231

శా॥ బాహుళ్యత్వము నొంద నేమిటికి నన్భక్షింపుమన్నంత, సు
త్సాహంబొప్పగఁ గాకజంబుక తరక్షుమ్మల్ మహోపాయ శౌ
ర్యాహంకారములొప్పఁ జంపిన మృగేంద్రాధీశ్వరుం డంతలో
నాహారంబొనరించె వానినదియట్లన్యోన్య్ విచారించినన్॥ 232

వ॥ అని దమనకుండు సెప్పిన సంజీవకుండు విని యిట్లనియె. 233

గీ॥ కలదు మున్నొక్క గిరి మహాగహనమందు
దాని శృంగమ్ము నిరువది తాటిచెట్ల
పొడవు గలదందుపై వట భూరుహంబు
పొలుచు ఫలముల సాంద్ర సంపూర్ణముగను. 234

వ॥ ఆవట భూజమ్మునందు 235

గీ॥ కలఁడు కాండోత్కపుండను కాకవిభుఁడు
వేల పర్యంతములు కాక వితతి గొలువ
నందు గూడుల నమరిచి యఖిల తరుల
ఫలములను దిని సుఖితమై బ్రతుకుచుండ 236

వ॥ అంతొక్కనాఁడు సముద్రవతీరమ్మున వసియించు చక్రియను వృషభరాజు తన పరిజనమ్ములుం దానును విలాసార్థంబుగా సకల భూములం గ్రుమ్మరి తన నివాసమ్మునకుం జనుచో నడుమను వన భటుల నెడఁబాసి యేకాకియై యొంచేనియుం దిరిగి తిరిగి పథంబుగానక ప్రొద్దు వ్రాలుటయుం జూచి దిక్కులేక, కాండోత్కపుండను కాక ప్రభుండున్న వట మహీజంబుఁ జేరిన. 237

కం॥ అందుల కాకులు దమ కుల
మందముగాఁ గాకయున్న నలిగి కఠోరం
బంద జగడంబు చేసినఁ
బొందుగఁ గాక ప్రభుండు పొండని మాన్పెన్ 238

వ॥ ఇట్లు హంస కాకముల యుద్ధమ్ము మాన్పి యావృద్ధ హంసంబుఁ జేరి యెందుల వాఁడవని యడిగిన నది తన వృత్తాంతంబంతయుఁ జెప్పిన విని కాకరాజు కృపా పరిపూర్ణుండు గావున నయ్యంచను తన పంచ నుంచుకొని సకల భోగమ్ములం బరితుష్టునింజేసి యంత వానికొక యిఱుకుపాటు గలదని విచారించుకొని యున్నంత. 239

కం॥ వడితో శంపాజాలము,
వడగంన్లను గురియదొడఁగె వడిచెడక, ముదం
బెడల జడితట్టి యశనము
లుడిగెను కాకమ్ములకును నుర్విని లక్ష్మా! 240

కం॥ కడు బలిభుక్కులువడవడ
వడ వణఁకుచు మేపు లేమివరటియు వానన్
బడి యీఁద గాలిచేతను
సుడియుచుఁ బతిఁజేరి ముడిగి స్రుక్కుచు మఱియున్ 241

వ॥ ఇట్లని విన్నవించె. 242

ఆ॥ వె॥ వానగాలిచేత * వడలెల్ల స్రుక్కెను
తరులఫలములెల్ల ధరణిఁగూలె
వాన వెలియదాయె దీనికి నొక విధం
బానతిండుమీరలనఘచరిత 243

వ॥ అనిన విని బలిభుగ్వల్లభుండు తమవారల కిట్లనియె. 244

కం॥ ఆఁకఁట చేతను మీరలు
చీకాకును బొందివచ్చి చిటులుచు నున్నా
రేకమతిఁ బక్షిజాతికిఁ
బ్రాకట ఫల సంగ్రహమ్ము పాల్పడెందున్ 245

కం॥ అనవిని కాకులు మనకును
ఘనమగు నాహార సమితి గలిగున్నది యీ
డనె యంచఁ జంపి తిందము
ననవుడు నా మాట వినియు నాగ్రహమెసఁగన్. 246

* ఒడలని సంస్కరించినచో యతిభంగము

గీ॥ అపునె పాపులార యతిథినై వచ్చిన
యంచఁ జంప నీతియగునె యనిన
దేహమంటఁజాలు తెగి ధర్మమెల్లను
బ్రబలుచుండు దీనఁ బ్రౌఢిఁజెడదు. 247

వ॥ అని కొన్ని యుపాయమ్ములు కాండోద్భవునకు నెఱింగించిన నతండును నాఁకఁటి వెల్లువ నూరకుండిన నదియ సమయంబని కాకంబులెల్లం గూడికొని నిద్రించుచున్న రాయంచను వధియించి యందఱు భక్షించిరి. నాకును నట్టిదియగునని తలపోసి ధైర్యంబు దెచ్చుకొని రాజతేజంబజేయం బైనను నిప్పుడు సంగరం బొనర్చుట కర్తవ్యంబని నిశ్చయించి వృషభేంద్రుండు దమనకుం జూచి యిట్లనియె. 248

చం॥ సమర ముఖంబునం బడిన స్వర్గము, గెల్చిన లక్ష్మిగల్గు, కా
యము లనయంబు బుద్బుదములట్లు, మదిందల పోసి చూడ దు
ర్దమ మగుశక్తిఁ బోరెద మసంబ మదీయ హృదంతరంబు నం
దమర మృగేంద్రుతోఁడ, ననునప్పుడు నూడుఁడు మీరలంచఱున్ 249

వ॥ అనిన దమనకుండిట్లనియె శత్రు విక్రమం బెఱింగియు నెవ్వండేని విరోధమ్ముఁ జెందునతండు డిట్టిభమ్ము చేత సముద్రంబునుం బోలె పరాభవమ్ము నొందుననిన సంజీవకుండు విస్మయ మనస్కుండై తత్కథా క్రమం బెఱింగింపు మనిన దమనకుండిట్లనియె. 250

సీ॥ వనధి తీరమ్మున వసియించి టిట్టిభ
పతియుండ నొక్క నాఁడతని పత్ని
గర్భిణినై యిది కల్లోలతతి నపా
య స్థలం బెచ్చటికైన నరుగ
వలయునన్నను, నర్ణవంబునకేల యి
ట్లాత్మలోఁగలఁగ నాయంతవాఁడె
యీ సముద్రుఁడు! నన్ను నేమి సేయఁగ, నోపు
నరయ నిద్దఱికి మహాంతరమ్ము.

గీ॥ తెలియకేమని యూహించి పలికెనేని
కాష్ఠమధ్యమ్ము గఱచిన కచ్ఛపమ్ము



వోలె జెడునన మదికి నద్భుతము వొడమ
వనిత తద్విధమేరీతి ననుచుఁ బలికె॥ 251

గీ॥ కంబుకంథరుఁడన నొక్క కమఠవిభుఁడు
వికట సంకటులను హంస విభులు మున్నుఁ
గూడి చరియింతురొక పెద్ద కొలనిలోన
మైత్రి యొనరించి నిశ్చల మానసముల 252

వ॥ అందుఁ జిరకాలంబుండ ననావృష్టి దోషమ్ము వచ్చె నయ్యవస
రంబున. 253

ఉ॥ చండకరాంశుజాలము కృశానుశిఖావళిమాడ్కి నుగ్రమై
నిండె దిశాంతరాళముల, నీరజషండము నాళసంహతితో
నెండె, సరోవరమ్ముల, నహీనతటాకములన్, ఝషమ్ములొం
డొండొఁ గృశమ్ములై పొరిగె నుష్ణజలంబులు పమ్మ నేఁపఁగన్. 254

వ॥ అట్టి సమయంబున వికటసంకటులన్య సరోవరంబున కరుగ నిశ్చ
యించినఁ, గంబుగ్రీవుండు వారలంజూచి, 255

మ॥ ననుబాయందగదయ్య మీకు! నను నన్యాయంబు మీరెందుకై
ననుగొంపొండి దెవత్తు నేననిన నానందమ్ముతో హంసలి
ట్లను నిక్కాష్ఠము బూని వచ్చెదము మధ్యంబొప్ప దంష్ట్రించిన
మ్మనినం దద్విధమాచరింప నవియట్లాకాశ మార్గంబునన్॥ 256

వ॥ అధికజవమ్మునం జన, జనమ్ము తమ్ముం బొడగని యిది చిత్రమ్మని
నవ్వుచుండఁ గాష్ఠమధ్యమ్ము గఱచియుండియు నవివేకమ్మునం గల కల
మ్మేమి యని వికటసంకటుల నడుగంబోయి, నేలంగూలి మృతింబొందె. నవ్వి
ధంబున మిత్రుండని నన్ను నెఱుంగక యేమేనియుం బలుక నూహించిన జడ
నిధియుం జెడునని యతండు సతింజూచి వెండియు నిట్లనియె, 257

ఆ॥ వె॥ ధాత్రిలో, ననాగత విధాత, యుత్పన్న
మతి, భవిష్యమతియు, మహీనసంగ
ముగురు మీనపతులు మోదమ్ముతోఁ గల
రందు నొకడు చచ్చెననఁగ వినవె. 258

సీ॥ అది యెట్టిదనఁ, గమలాకరం బొక్కటి
జలసంచయంబునఁ జెలగుచుండఁ
దగిన వేడుక జయంబుగ మీనములు మూఁడు
వసియించి యుండంగ వాంఛతోడ
జాలరులచటికిఁ జను దెంతురని యనా
గతవిఘాతను వాఁడు మతివివేక
మున నెందుకైనను జనవలెనన, విని
తాత్కాలిక ప్రజ్ఞ తగునటంచు
నుత్పన్నమతి చెప్పె నొక కథ మునుగొల్ల
వనజాక్షి తేఁవరి తనయుఁ గూడి

గీ॥ వానితండ్రి కోరివచ్చిన నెఱిఁగి త
త్తనుజు గాదెలోన దాఁచి యతనిఁ
గామతంత్రకేళిఁ గరఁగింప బాంధవుఁ
డరుగుదేరఁ జూచి యంతలేచి. 259

చం॥ అలిఁగి సుతుండు మీ భవనమందులకుఁ జనుదెంచెనంచు నీ
తలఁపరి వచ్చె లేవనినఁ, దామదినమ్మఁడు సూడుమంచుఁ దొ
య్యలి విభుఁ గూడి జారు నపుడంపి నయంబున డాసి గాదెలో
పల నణఁగున్న తత్సుతుని బైకొను వేడుకఁ, దీసి యిట్లనున్. 260

వ॥ మీ జనకుం డెఱుంగకుండం జనుమని కరుణార్ద్రచిత్తయుం
బోలె మందిరమ్ము వెడలననిపి యాత్మదోషంబు దెలియంబడకుండ నక్కు
లట నిజవల్లభు నిష్టోపభోగమ్ములం దేలించె నట్లు గావున తాత్కాలిక
మతియె కారణంబని చెప్పిన, నంగీకరింపక యనాగతవిఘాత యనువాఁడన్య
సరోవరంబున కరిగె నంతనొక్కనాఁడు, 261

కం॥ జాలరులు వచ్చి యొక్కట
జాలమ్ములు విప్పి కొలను జలములపై నా
భీలత నెగవఁగ వైచిన
నాలో, నుత్పన్నమతి భయస్వాంతుండై 262

కం॥ మృతివొందినట్లు దెలిసిన
యతనిం బొడగాంచి వారలావల నిడి, యం

చిత గతిఁ జన, నతిగర్వీత
మనస్కుఁడై యా భవిష్యమతి యున్నంతన్. 263

వ॥ పట్టుకొను నవసరంబున నుత్పన్నమతి చిలుపచిలుప నీరునంబడి ప్రవాహంబున నొండొక హ్రదమ్ము జేరె నప్పుడు జాలరు లరుగు దెంచి "యద్భవిష్యతిఁ" బట్టుకొని పదిలంబుగా జాలమ్ములం దిడి లగుడంబున మృతిబొందించిరి. అట్లుగావున, ననాగతబుద్ధి యోచింప వలయునని టిట్టిభ ప్రభుండు వనితకుం జెప్పి యూరకుండె నంత, 264

కం॥ టిట్టిభవిభుఁ డొనరించిన
యట్టి కులాయమ్ములోన ననువుననుండన్,
బెట్టుసముంచె సముద్రుం
డట్టికొకో దీని మహిమ యెటుఁ గెడమనుచున్. 265

ఉ॥ టిట్టిభియంత నేడ్చినఁ గడింకిమగంటిమి నాతఁడిట్లనున్
వట్టివిలాప మంద, సతి! వర్ధిసె నేఁగొనివత్తు నండముల్
గట్టిగనంచు నండజనికాయము గూడుక వైనతేయు న
ప్పట్టున గొల్చిమ్రొక్కి తనపాటెఱిఁగించి నుతించె భక్తితోన్. 266

వ॥ ఇట్లు టిట్టిభమ్ము సుపర్ణు నుతియించిన నతండతని భక్తికి మెచ్చి టిట్టిభాద్యండజంబుల ముందిడుకొని పుండరీకాక్షు సన్నిధికిం జని దండ ప్రణామంబు లాచరించి నిటల తటఘటిత కరకమలపుటుండై యిట్లని స్తుతియించె, 267

దండకము॥ శ్రీ మత్కృపావీక్ష ! రక్షోమదాంభోధి * మంథాన యోగీంద్ర చిత్తాంబుజాస క్తరోలంబ! జంభారి ముఖ్యామరస్తోమ మౌళి స్ఫురద్రత్న కాంతిచ్ఛటాక్రాంతపాదాబ్జ! దుగ్ధాబ్ధికన్యా కుచద్వంద్వకస్తూరికా వాసితోరస్థలప్రాంత! నేనెంతవాఁడన్ భవన్మూర్తి వర్ణింప, నాస్వర్ణగర్భా దులున్......అంభోఘటౌఘుంబులన్ జంద్రసూర్యాభ్రమముల్ పెక్కులై తోఁచు చందమ్మునన్ లోకలోకాంతరాళమ్ములన్ జీవరూపత్వముంబొంది తత్కర్మబీజంబునన్ బద్మపత్రాంతరస్థాంబుబిందు స్వభావంబునన్, గూడి యుం, గూడ వాకారశూన్యత్వ మొప్పన్ బరంజ్యోతివై యుండియున్

* మంథార

బద్మగర్భాచ్యుతేశాభిధానంబులందాల్చి నానాజగద్రాజి, నుత్పత్తి రక్షాల
యంబాచరింపంగఁ ద్రైగుణ్యవృత్తిం బ్రవర్తింతు వాకొక్కచో మత్స్య
కూర్మాదిరూపమ్ములన్మించి లోకోపకారమ్ము గావింతు వంభోజగర్భాం
డముల్ రోమకూపమ్ములోనుండ నత్యున్నత స్థూలదేహమ్ముచే నుండు, వే
కార్ణవంబైన వేళన్, వటోద్భూతపత్త్రమ్ముపై సూక్ష్మగాత్రమ్మునన్ శైశవ
క్రీడ నర్తింతు వింద్రావనీ భృత్ఫణీంద్రాకృతిన్ నాకభూనాగలోకమ్ములన్
లీలఁ బాలింతు వాకాశతేజోనిలాంభోవనీపంచభూతాత్మకత్వంబునన్
సర్వభూతాళి కాధారమైయుందు, వీరేడులోకంబులం గూహ్మశీర్షంబు
విఖ్యాతి [నం] తర్బహిర్వ్యాప్తిఁ దేలింతువభ్రచ్యుతాంభోలవంబంబు
పూరంబునుం జెంది పాథోనిధానంబులం జెందుచందమ్మునన్ సర్వతేజోవి
శేషంబులెల్లన్ భవద్విగ్రహం బందడిందున్ గజేంద్రాది సద్భక్తరక్షార్థమై
తావకస్ఫీతబాహాచతుష్కంబునన్ జక్రశార్ఙ్గాసిశంఖమ్ములే పాయుచుండన్
త్వదీయాంఘ్రికంజాత మందాకినీ నిర్మలోదంబులశ్రాంతమున్ గ్రూరపాపోరు
పంకమ్ములం బాపు నీమాయ, గీర్వాణముఖ్యాఖిల ప్రాణిసంఘాతవారాశికిన్
వేలనైయుండు నంభోజ భూసంభవానందకారీ! మురారీ! భుజంగేంద్ర
తల్పా! సుధాకల్ప! వందారుకల్పా! నమస్తే నమస్తే నమస్తే నమః॥ 268

చం॥ అని వినుతించినం గరుణ నంబుజనాభుఁడు [వానితోఁడ] వా
హనమవు కేతనంబవరయన్ బ్రియభక్తుఁడ వీవు నాకు నీ
మనమున నున్న కోర్కులనుమానము మాను మెఱుంగఁ జెప్పుమ
న్నను, ముదితాంతరంగుఁడయి నాథునితోఁ బ్రియ మొప్ప నిట్లనున్. 269

వ॥ దేవా! మత్కుల సంభవుండగు టిట్టిభవరునండమ్ములు మహో
ద్రేకమ్మున సముద్రుండు నిష్కారణంబునఁ గైకొన్న వాఁడనిన నా భగవం
తుండు పర్జన్యు నాననం బాలోకించిన నతండు జగన్నాథు నాజ్ఞం జేసి నదీ
వల్లభుం గోపించిన జలాంతర్గతంబగు నండమ్ములు దెచ్చి పర్జన్యునికిచ్చె
నతండు భగవంతుని సమ్ముఖమ్మునం బెట్టిన నా సర్వేశ్వరుండు వినతాసుతున
కిచ్చె. నాపక్షిపతి టిట్టిభున కొప్పించె. నతండును పుత్త్రకళత్రమ్ములఁ గూడి
కొని విరోధివర్గంబు మట్టుపెట్టి సుఖంబుండె. నట్లుగావున శత్రువిక్రమం
బెఱింగియు వైరంబు దగదనిన విని సంజీవకుండు దమనకుం జూచి మృగ
ధూర్తా! మృగేంద్రుం డెవ్విధంబున నున్న సమరోద్యోగి యని తెలియ
వచ్చు ననిన నతండిట్లనియె, 270

కం॥ లాంగూలంబల్లార్చిక
నుంగవ ప్రస్ఫుటము నోరసురువులు గ్రమ్మన్
ప్రమోఁగుచు నుండిన నెఱుఁగుము
సింగము జగడమ్మునకును, జేరెనటంచున్. 271

కం॥ అని చెప్పి దమనకుండు వెసఁ
జని కరటకుతోడనపుడు సర్వము దెలియన్
వినుపించిన నాతఁడు తనుఁ
గనుఁగొని నిందించి పలికెఁ గలఁగిన మతితోన్. 272

కం॥ హిత మంత్రివయ్యు నక్కట
పతికిని వృషభేంద్రునకును బగ పుట్టఁగ నీ
గతిఁ దిండి కొనర్చితి, సం
గతి మాలిన కార్యమధిక కపటాకృతివై 273

వ॥ అని పలికెఁ దదనంతరంబ 274

ఉ॥ నీల బలాహక వ్రజము, నింగి పయింగనుపట్టె మందవా
తూలము వెల్లడం బరగెఁ, దోఁచె మెఱుంగులు దిక్కులందు, ధా
రాళ మహోగ్ర వర్షము ధరావలయంబునఁ గప్పె, భోగి భు
జాలము నృత్యముల్దనరె శైలములన్ దొలివాన కాలనన్ 275

వ॥ తత్సమయంబున వృషభేంద్రుడును గాలవోపితుండై ధారా వర్షమ్మునకు సహింపలేక విషాణమ్ములు వంచుకొని మృగేంద్రుం జేరిన నతండును దర్పోద్ధతుండై లాంగూలం బల్లార్చి వివృత వదన గహ్వరుండై మహానాదంబు గావించి దమనకుండు సెప్పిన విధంబున నితండు నాతో సంగరమ్మునకు వచ్చినవాఁడు మేలెఱుంగఁ జాలక కయ్యంబు కు వచ్చిన నీ గోవ నిప్పుడ పట్టి చంపెదనని సమరంబునకుఁ డలపడి భీమ హిడింబులట్లు పోరం దొడంగిన నఖిల మృగమ్ములు గలంగెనప్పుడు కరటకుండు దమనకుంజూచి దుర్బుద్ధీ! నీ కతమ్మున నీ యిరువురకు విరోధంబు వాటిల్లెనని యిట్లనియె. 276

చం॥ నృపతి మదోద్ధతుండయిన నేర్పున మంత్రివరుండు రాచ కా
ర్యపు సరవుల్ ప్రజావితతి నంటని యాపద మంచివేళ దె

ల్వీ పడగఁ జెప్పి వాని యవివేకము మాన్పి హితంబొనర్చినన్
విపుల యశమ్మునొందు గుణ విశ్రుత! విశ్వయ లక్ష్మధీమణీ! 277

చం॥ గురు వెలయన్ బ్రధాని, నృపకుంజరు నప్పురిరీతి, నీతి శా
స్త్ర రుచిర చిత్తుఁజేసి, పరరాష్ట్ర సభాజనమెల్ల మెచ్చఁబెం
పరుడుగ నుంచెనేనిఁ, దను నత్యధికంబగు నూత్న భోగముల్
సిరియును గీర్తిబొందు నిది సిద్ధము విశ్వయ లక్ష్మధీమణీ! 278

ఉ॥ ఆరసిచూడ రాజు సుకృతాంచితుఁడైనఁ, దదీయ సేవకుం
డ్రూరపు మంత్రిడాసిన నకుంఠమతిం బ్రజ తల్లడింపుచున్
జేరదు, నక్రముప్న నుసింబలె, నుగ్రఫణీంద్రమున్న ధా
త్రీరుహ,మట్లు వానిఁ, గులదీపక! విశ్వయ లక్ష్మధీమణీ! 279

వ॥ అని పల్కి ధర్మమార్గమ్ము కపటాంధ తమసమ్మున నెఱుంగఁ బడదు. భవజ్జఠరార్థంబు మృగేంద్రున కహితం బాచరించితివి. పాలును నీరు నుంబోలె నతిలియ్యంబై యున్న వృషభపంచాననులకు, నన్యోన్య వైరమ్ముఁ జేసితివిస్సిరో! యిది యన్యాయంబు, మిథ్యావాక్యమ్ము లాదేశించినవాని జగద్ద్రోహియన వినవే! అవమతికి బుద్ధి సెప్పుట యకర్తవ్యంబనక యెఱిం గించెనేని, యతండు వలిముఖునిచేత సూచీముఖుండను పత్రిపతియునుం బోలెఁ బొలియుననిన విని దమనకుండా కథ యెఱింగింపు మనినఁ గరటకుం డిట్లనియె. 280

చం॥ జలధి సరిత్సుధాకిరణ శైత్య సమేధితమైన, యా హిమా
చలమునమునుంచి పూని వెదచల్లుచు వచ్చినయట్లు, లోకమున్
గలగొన మంచుమునుంచి చలికాలము మున్నుదనర్చె, నెంతయున్
జలరుహ బాంధవుఁడు గడు చంచలతన్ శిఖిమూలకేఁగఁగన్, 281

కం॥ లలనాకుచదుర్గంబులు
గలుగఁగ, హారిహారపయోజగర్భులు జనులున్
దలఁప సుఖించిరి గాకీ,
చలిపగఱకుఁ దలఁగ నొండు శరణము గలదే! 282

వ॥ తత్కాలమ్మున,— 283

సీ॥ వలగొనివణఁకుచు వానరు లడవిలో
మిణుగురుపురుపులు మెఱయఁగాంచి
నిప్పుకలని డాసి నివ్వెరపడఁ, జూచి
పలికె సూచిముఖుండు ప్రజ్ఞ మెఱయ,
నగ్గి కాదిది యేటి కలముక యున్న నా
రన, నుపలమ్ము చేనంది యొక్క
క్రోతి తత్పతీంద్రుఁ గ్రోధాకృతిని వేయఁ,
బడె, నట్లుగావునఁ బాపమతికి

బుద్ధి దెలియఁజెప్పఁ బోలదు, జెప్పితిఁ,
గ్రూర శిష్యుచేత గురుఁడు దొల్లి
భంగమొందె, నట్టిపాటుచేకురదు గ
దా! యటచుఁ బలుక దమనకుండు 284

అ॥ వె॥ అనఘ యెఱుఁగఁ జెప్పు మా కథా వృత్తాంత
మనిన నొక్కపురమునందు మున్ను
భిక్షుఁడుండ నతనిఁ బ్రీతిఁగిరాతుండు
సేవఁజేసె నిష్ట సిద్ధికొఱకు 285

వ॥ భిక్షుండును గతిపయ దినమ్ములు చనిన నతనిఁ గృపావీక్షణం బున వీక్షించి మత్పదాంగుష్ఠంబు ప్రతి దినంబును జలంబులం గడిగికొని త్రావుమట్లైన నీకు నిష్టసిద్ధి యగుననినం, గిరాతుం డవ్విధంబొనరింపు చుండ,—— 286

చం॥ అవనిపుఁ డొక్క కార్యమున కంపిన దూరము బోయ పోవుచున్,
బ్రవిమలచిత్త! మీచరణ పద్మమునందలి వ్రేలినీరు నా
కు, వలె ననారతమ్ము సమకూఱఁగ, మీ రరుదెండటన్న, భి
క్షువరుఁడు వాని యాననముఁ జూచి మదింగలుషించి యిట్లనున్. 287

వ॥ లుబ్ధకా! గురువువెంట శిష్యుండు పోవుఁగాని, శిష్యునివెంట గురువు పోవునే! యిది విరుద్ధాచారమ్ము నీవెంట వచ్చుట యన నవివేకంబు, నాయందలి భక్తియె నీకుఁ గలిగినంజాలు నా పదాంగుష్ఠ జలంబు కారణంబు గాదనిన, నక్కిరాతుండు వెడనవ్వు నవ్వి దేవా! మీరిట్లానతీఁ దగునే! సత తం బాచరింపుచున్న వ్రతంబె ట్లు విడువనేర్తు, నా వెనువెంట నీవువచ్చినఁ

భాగజలమ్ము గలుగు, కాకున్న, నీ యంగుష్ఠమ్ము నాకిమ్మని దుర్బుద్ధిం జేసి డాసి యప్పుడు. 288

కం॥ గురువుఁ బడఁద్రోసి చరణాం
బురుహాము వెనుఁద్రేలు కోసి పుచ్చుక వేగో
ద్ధురతఁ జనియె, జనులును గని
యరుదందఁగ, ననుచుఁ జెప్పి యాతనితోఁడన్, 289

గీ॥ అధికమగు దుష్కృతం బెవ్వఁడాచరించు
నతఁడు, తత్ఫలమంతయు ననుభవించుఁ
దొల్లి తనయునిచేఁ దండ్రి ధూమసంచ
యమున మృత్యువుబొందె నటంచుఁ బలుక, 290

వ॥ విని దమనకుండది యెఱింగింపుమనినఁ గరటకుం డిట్లని చెప్పం దొడంగె, మున్నొక పురమ్మున ధర్మబుద్ధి దుష్టబుద్ధులను వైశ్య కుమారు లిరువురు గలరు, వారొక్కనాఁడు విత్తం బార్జించుకొఱకు నన్య దేశమ్ము నకుం జనిరందు, 291

సీ॥ ధర్మబుద్ధి మహా నిధానమ్ముగని దుష్ట
బుద్ధి కెఱింగించి యిద్ధనమ్ము
గొని యింటి కరుగుదమన, సమ్మతింపన
య్యిరువురుఁ దమయున్న పురముడాసి
తమచేతి ధన మొక్కతరు సమీపమున ని
క్షేపించి యాత్మనికే తనములఁ
బొంది, మిత్రతఁగడు పొలుపొంద నుండి, రం
దొకనాఁడు దుష్టబుద్ధికి నధర్మ

బుద్ధిపుట్ట, ధర్మబుద్ధికిఁ జెప్పక
యపహరింతు ననుచు నాత్మఁ దలఁచి
యర్ధరాత్ర సమయమందొక్కఁడును జని
యద్భుతంపుటర్థ మపహరించె. 292

గీ॥ అద్దురాత్ముండు చిరకాల మరుగ, ధర్మ
బుద్ధిఁ బొడగని లేములఁ బొరయనేల!
నేల దాఁచిన విత్తమ్ము నీవు నేనుఁ
బంచుకొందము నేఁడని పలుక, నతఁడు 293

ఉ॥ అవ్విధ మాచరింపుమన, నాతఁడుఁ దానును నేఁగి గుర్తటన్
ద్రవ్యఁగ నప్పుడందలి నిధానముగానక, ధర్మబుద్ధి, నన్
గవ్వతనమ్మున న్మొఱఁగి కైకొనె నెంతయుఁ బాపవృత్తి మై
నెవ్వని నమ్మఁబోలును! మహీస్థలి నర్థములందుఁ జూచినన్॥ 294

వ॥ అను పలుకులు పలుక, నన్యోన్య వివాదంబధికంబయ్యె నంతన య్యిరువురు ధర్మార్థకోవిదుల యొద్దకుం జని వారలకీ వృత్తాంతం బెఱిం గించిన, వారలుభయ వాక్యమ్ములు విని యేను దినమ్ములకు ధర్మం బేర్ప రించెదమని మితిఁబెట్టిన, దుష్టబుద్ధి వారల కిట్లనియె,— 295

సీ॥ పశ్యతోహరుఁడతి పాపాత్ముఁ డితని ని
ప్పుడ పట్టి దండించి పుచ్చుడనుచుఁ
బలికిన,వారలిందులకును గల సాక్షి!
యని తన్ను నడిగిన నచటి తరువు
గుఱియన, వినుచు మిగుల మేము రేపు వ
చ్చెద మన్నఁ గృహముఁ జెంచె నందు
దుష్టబుద్ధి మదంబుతోఁ దండ్రికిట్లను
వచ్చు వాఙ్మాత్రమ్మువలన నధిక

ఆ॥వె॥ ధనమటన్న, నతఁడు దద్విధమేరీతి
ననిన, రాత్రి భూరుహమ్ము కోట
రమున దాఁగి యెల్లి ప్రజలెల్ల విన, ధర్మ
బుద్ధిఁ దిగిచికొనుట సిద్ధమరయ॥ 296

వ॥ అట్లైన నధిక ద్రవ్యమ్ము చేకూఱుననం దనూభవునకు నతండిట్లను, మతిమంతుం డుపాయమ్ము క్రియ నపాయమ్ము చింతింపందగు నది యెఱుం గకున్న మున్నుబకవల్లభుండు దన శిశుసంచయమ్ము నకులమ్ము చేతం బోలె హింస నొందునన, విని దుష్టబుద్ధి తద్విధంబు జెప్పుమనినఁ, దజ్జనకుం డిట్లనియె. 297

కం॥ ఒక విటప కోటరమ్మున
బక మిథునంబుండు నెఱిఁగి పన్నగము భయా
నకగతిఁ జని తదపత్య
ప్రకరము భక్షించుచుండెఁ బరమ ప్రీతిన్ 298

గీ॥ అంత బక పతి తన భార్యయందుఁ గన్న
పిల్లలను బ్రోవవలెనని పెల్లుచింతఁ
దీరమున నున్న, గొలని కుళీర విభుఁడు
గాంచి, హితుఁడౌటచేఁ గౌతుకమునఁ బలికె॥

వ॥ బక పతీ! చింతాక్రాంత స్వాంతుండవగుటకుం గతంబేమియన నతండు నిజ వృత్తాంతంబంతయు నెఱింగించిన విని యేనొక్క యుపాయమ్ము చెప్పెద, నొక్క నకుల సుషిరమ్ము మొదలుకొని సర్పవల్మీక పర్యంతమ్మును జలచరమ్ముల నెఱపు మట్లైన నీకు శుభంబగునని చెప్పిన బక ప్రభుండును తద్వచన ప్రకారమ్మున నాచరించె నయ్యవసరమున. 300

కం॥ నకులమ్ము వెడలి మీన ప్ర
కరముదిని పాముఁ జంపి భక్షించి మహో
త్సుకతఁ దరువెక్కి యందలి
ఖక సంతానమ్ము మ్రింగెఁ బ్రస్ఫుట భంగిన్॥ 301

వ॥ ఇట్లు గావున నుపాయమ్ము క్రియ నపాయమ్ము చింతింప వలయు ననిన, విని లోభాక్రాంత హృదయుండై దుష్టబుద్ధి బలాత్కారమ్మున నిబిడ ధ్వాంతాక్రాంత నిశాంతయగు నిశీథవేళం, దరుకోటరమ్మున, నిజ జనకు నిండాఁచె నంత. 302

చం॥ కలువలఁబాసి తుమ్మెదలు కంజగృహమ్ములడాయఁ, గుక్కుటం
బులు రొదసేయ, జక్కవలపొందులు మించఁగ, నీడజంబు చె
య్వుల విహరింపఁ, జీకటి సమూహ మణంగ, జగజ్జనం బిలా
తలి నలరంగఁ, దారకల దర్పము దప్పఁ బ్రభాత మొప్పినన్॥ 303

వ॥ ఇట్లు వేఁగిన దుష్టబుద్ధియు,— 304

గీ॥ అద్దురాత్మ్ముండు పెద్దలనప్పు డటకుఁ
దోడుకొనిపోయి దురిత విదూర! వృక్ష!
యిచటఁ బాఁతిన విత్తంబు నెవ్వఁ డపహ
రించె నెఱిగింపు జనులకుఁ బ్రీతియెసఁగ. 305

వ॥ అని పలుక నావృక్షకోటరమ్ములోనున్న వృద్ధవణిక్కు ప్రజలకు వినవచ్చునట్లుగా నావృక్షమ్ము పలికినట్ల ధర్మబుద్ధి, యిప్పదార్థం బహరించె,

నను వాక్యంబు వినంబలికిన, పెద్దలు నాశ్చర్యంబు నొందిరి. ధర్మబుద్ధియు
విషాదమ్ము నొంది భూరుహంబునందు ధర్మం బెద్దియు లేకపోయెనని,
తత్కోటరంబునఁ దృణసంఘంబిడియనలమ్ము రగిలించెనంత,— 306

చం॥ పొగలెగయంగ నుగ్రత, నభోవలయమ్మున విస్ఫులింగముల్
మిగులఁగ బర్వఁ, గోటరసమేతుఁడు కోమటి యోర్వలేక ము
న్నగమహిఁగూలి చచ్చినఁ గనుంగొని పెద్దలు దుష్టబుద్ధిఁ గ్రో
ధగతి నదల్చి తిట్టి, రిది, తథ్యముగా నెఱిఁగెన్ నృపాలుఁడున్॥ 307

కం॥ ఆలోన భూతధాత్రీ
పాలుండా దుష్టబుద్ధిఁ బటురోషమునన్
శూలమ్మున వేయించె, జ
నాలి యితఁడె ధర్మసూనుఁ డని మదిఁ బొగడన్॥ 308

వ॥ అట్లుగావున, చేసిన దుష్కృతం బెట్టివారికి ననుభవహేతువగు
నని వెండియు దమనకుం జూచి కరటకుం డిట్లనియె. 309

కం॥ కులము, కుపుత్రునిచేతం,
బలి, యల్పునిచేత, సాధు భావంబులు చె
ల్వాలచేత, సుకృత సంహతి
కలుషంబులచేతఁ బొలియుఁ గాదె! తలంపన్ 310

గీ॥ విషధనంజయభీమదర్వీకరముల
పగిది, నీదు చరిత్రమ్ము భయదమనుచు
నున్నయది నాకు, గురుదశ నొందఁజేసి
తమ్మహాత్ముని మృగరాజు, నని యతండు 311

వ॥ వెండియు నిట్లనియె.

ఆ॥వె॥ ఎలుకలద్భుతముగ నెందేని లోహాస
హస్రతతుల మ్రింగె, నంద మిత్రు
వలన వారి చిఱుత వాఁడును డేగచే
నపహరింపఁబడె నటంచుఁ బలుక॥ 312

వ॥ విని దమనకుండే తత్కథ యెఱింగింపుమని నగరటకుం డిట్లనియె- మున్నొక్క పట్టణంబున నతి క్షీణ విభవుండగు వణిక్కుమారుండు గలఁడు. అతండు లేమిచేతం గ్రిందువడి ప త్తిగింజలు చిళ్ళగింజలు జీడివిత్తులు చీపురు కట్టలు వి స్తరాకులు ఉప్పు గుగ్గిళ్ళు గానుగపిండి మజ్జిగ కూరలు కట్టెలు మొదలుగాఁగల క్షుద్రద్రవ్యమ్ము లమ్ముకొని తత్పదార్థంబున వేల పర్యంతంబులు, ఇనుపముద్దలు గొని యవి స్వకీయ ద్రవ్యమ్ములని తన సఖు నొద్ద డాఁచి ద్రవ్యం బార్జించుకొఱకు నన్యదేశంబునకుం జని యందు బహు వ్యాపారమ్ములం దిరిగిన, మందభాగ్య వశత్వంబున నేమియు నబ్బక రిక్త హస్తుండై తిరిగి తన నిలయంబు జేరి. 313

కం॥ అతిరయమున లోహ సహ
స్రతతులు నాకొసఁగుమనుచు సఖు నడిగిన, ను
ద్ధత లుబ్ధ మానసుండై
యతఁ డా, ఖు శ్రేణి మ్రింగెనని పలుకుటయున్॥ 314

వ॥ విని యిది మహాద్భుతంబని పెద్దయుం బ్రొద్దు చింతించి యతం డొక్క యుపాయమ్మునం గాని తన యినుప ముద్దలు మళ్ళవని నిశ్చయించి యాసఖునితో నిట్లను, నే నభ్యంగనమ్ము చేసుక బహుదినంబు లాయెను తటాకతీరంబున నుష్ణజలమ్ములు నిర్మించుక తీర్థంబాడెద, నచటికి నీ సుతుచేతఁ దైలంబంపుమని చెప్పిన, నతం డట్లచేసిన, బాల వణిక్కులు తటాకంబుచేరి వణిక్పుంగవుం డభ్యంగనం బాచరించి తీర్థంబాడి తిరిగి వచ్చునప్పుడు సఖు సతు నొక్కగొందిని డాఁచి యొక్కండును సఖు గృహంబున కేతెంచినఁ, దత్సఖుండు దురపిల్లుచుఁ గోమటి నీక్షించి,—— 315

ఉ॥ బాలకుఁ డెందుఁబోయెనని పల్కిన, నాతఁడు డేగ బల్విడిన్
దైలసమేతుగా నుడు పథమ్మునకుం గొనిపోయెనన్న, శో
కాలయమూర్తులై భువనమందిది చిత్రమటన్న, వారలన్
లాలితదంభ జృంభిత మనమ్మునఁ గౌతుకమంది యిట్లనున్ 316

వ॥ మూషికమ్ము లస్మదీయ లోహసహస్రమ్ముల భక్షించినట్లు, నీ కొమరుని డేగయు దివమ్మునకుం గొనిపోయె, నేమిచేయవచ్చు! నిద్దఱకును దుఃఖమ్ము సరియ,నాకుఁ బదార్థమ్ము పోయె,నీకు నీ సుతుండుపోయె, నిందుకు వడలంబని లేదు. ఊరకుండుమని చెప్పినఁ, దద్భావగుప్తం బెఱింగి సఖుండు

మహాత్ముఁడని నిశ్చయించి యాతని యినుపముద్దలు తెచ్చియిచ్చె, నా కోమటియు నవ్వుచుఁ గుమారుం దెచ్చి సఖున కొప్పించె, నట్లు భవజ్జీవంబు నకై మృగేంద్ర వృషభేంద్రులకుఁ గైతవ విరోధంబు గల్పించితివి నీ సహవాసం బధిక ప్రయాసంబని చెప్పి దమనకుతో వెండియు నిట్లనియె. 317

కం॥ వేయు, పది, యేను, చేతులు
వాయుదు, రేనుఁగుకు హరికిఁ బందికిఁ, గపటో
పాయుఃకున్నైన సుజనులు
వాయుదు రెడకల్ల, నూత్న భస్మతాచార్యా! 318

కం॥ అని కరటకుఁడీ చందం
బున నిందింపంగ, సిగ్గుబొందిన డెందం
బునఁ గుందుచు దమనకు డుం
డెనంత, హరిగోవిభుని వడిం బొలియించెన్॥ 319

వ॥ అప్పుడు, 320

మ॥ కరమాశ్చర్యముగా, హిరణ్యకశిపున్ గైవల్యమున్ జేర్చి, బం
ధురరోషానలహోతి రేఖ, సమృతాంధుల్ భీతినొందన్ భయం
కరుఁడై యున్న నృసింహు చందమున నక్కంఠీరవేంద్రుండు గో
వరుఁజెండాడి మృగౌఘముల్ గలఁగ గర్వస్ఫూర్తిమై నున్నచోన్. 321

వ॥ ఇట్లు విజృంభించి మృగపతి శోభిల్లుచుండఁ గరటకదమనకు లతని సమ్ముఖంబున కరిగి యతని పాదమ్ములపై వ్రాలిన నతండు శోకవ్యాకుల చిత్తుండై నిట్టూర్పులు నిగుడించుచు వారలతో నిట్లనియె. 322

గీ॥ మొదల రక్షించి వృషభేంద్రుఁ గదనభూమి
నకట చంపితి వృ......చి
కాన నఱకుట జగదయుక్తమ్ము గాదె!
గర్వవశమునఁ గలుషమ్ము గట్టుకొంటి. 323

ఉ॥ ప్రాణసమానుఁడైన వృషభప్రభుఁ, గోపయుతుండనై, రణ
క్షోణి నణంచియున్న ననుఁజూచి, మనంబున నమ్మనే! మృగ
శ్రేణి, మృగేంద్ర రాజ్యము రుచించునె! నామదికిం దలంపఁ గ
ళ్యాణగుణమ్ము బాసి దురితాత్ముఁడ నైతిని నేను నిత్తఱిన్. 324

కం॥ దమనకుఁడను, హర్యక్షో
త్తమ! నీమదిఁ బొంగులనేల దర్పించిన గో
రమణు వధించితి హిత కా
ర్యమునఁ దిరుగు [వేళవే] చి త,నఘ గుణుఁడవై. 325

ఆ. వె॥ కైతవమున కధిక కైతవం, బాదరం
బునకు నాదరమ్మ, పొసఁగు ననుచుఁ
దొల్లి వారకాంతతో, నొక్కచిల్క, ప
ల్కదె! యటన్న విని మృగప్రభుండు,— 326

వ॥ ఏతదితిహాసం బెఱింగింపుమనిన, దమనకుండిట్లని చెప్పందొడంగె, మున్నొక్క నగరంబున నిజభుజబలవిజితహరిదంతరుండును, బుండరీక భవాండకరండ పూరిత [యశః] కర్పూరప్రకాండుండును, నేకపత్నీవ్రతుండు, నగు మహామండలేశ్వరుండు గలం,డతండు,— 327

కం॥ తనవీట నున్న వారాం
గనఁ,గలలో నొక్కనాఁడు కాయజకేళిన్
దనియించితి నని కాంచి, మ
ది నద్భుతము వొడమి నిద్రదేఱి నలఁగుచున్. 328

వ॥ ప్రభాతంబగుడు నరేంద్రుండు నిజస్వప్న ప్రకారంబు తనవద్ది పురోహితుల కెఱింగించి వారల యనుమతంబునఁ దద్దోషపరిహారార్థంబు చితదానమ్మ లొనరించి నిర్మలాంతరంగుఁడై యుండ, నవ్వార్త దిక్కులఁ బొడమె, నట్టి యవసరమ్మన,— 329

సీ॥ కీలుకొప్పున నున్న గేదంగి ఱేకులు
నిందిందిరములకు విందుసేయఁ
గలికి చూపులు భుజంగ వ్రజంబులకును,
మరుతూపులగుచు మర్మములు గాఁడ
గజకుంభ విజయంబు గైకొన్న చనుదోయిఁ
గస్తూరికాలత్మ్మి గరము మెఱయ
నడపుల మురిపమ్ము లెడనెడ నాగర
శిఖి కులమ్మునకెల్ల సిగ్గుగఱప,

గీ|| రుక్మతాటంక మణిగణ రుచులఁ జిన్ని
నగవులును మోముతోఁ బొత్తుమిగుల నెసఁప,
లలన కైదండగొని కడు చెలువమొంద
ధారుణీపతి కలఁగన్న వారకాంత. 330

గీ|| వచ్చి జలజాయతాక్షి భూవరుని మ్రోల
నిలిచి నిజకుచరుచిఁబోలు నిమ్మపండ్లు
కౌతుకమ్మునఁ గానుకఁగా, నొసంగి
పలికె పుంస్కోకిల స్వరమ్ములు చెలంగ. 331

వ|| నరవరా! నిఖిల ధర్మాధర్మ విదుండవగు నీవెఱుంగని తగవేది యును లేదు. నాకు నిద్దురకు వేయి గద్దెంబులు జగమ్మున నున్న విటులో సంగుదురు. అది జగత్ప్రసిద్ధంబై పర్యవసించుఁగావున, నేఁటిరాత్రి నన్ను కల లోనం గలసినవాఁడవుగదా! యన, నమ్మహీకాంతుండు విని లజ్జించి,చింతా క్రాంతుండై యిక్కాంతకు విత్తంబిచ్చినఁ గాక, వివాదమ్ము సంఘటిల్లునని చిత్తమ్మునం దలఁచి యూరకుండ, నక్కొలువుకూటంబునఁ బంజరమధ్యంబు నందున్న రాజకీరంబా కీరవాణి పలుకులు విని రాజుంజూచి యిట్లనియె,— 332

ఉ|| చంచలచిత్తమేల నృపసత్తమ! విత్తము దర్పణమ్ముఁ దె
ప్పించుము పెద్దవారిఁ బిలిపింపుము సత్వరమన్న, నట్ల కా
వించినఁ దత్సభాజనుల వీనుల పండువౌనట్లఁ జిల్కభా
షించి కల ధ్వనిం దగవుసెప్పెను రాజుకు వారకాంతకున్. 333

చం|| కల దను నొందెనంచు, మహీకాంతుని నిద్దురపైఁడి వేఁడ, వా
రలలన, వచ్చె మీరు ముకురప్రతిబింబిత విత్తరాశి యి
చ్చెలువకుఁ జూపుడన్న, నటుచేసిన, నాననబోణి, సిగ్గునన్
వెలువడె రాజమందిరముఁ, వేమరు ఁబల్లవులెల్ల నవ్వఁగన్. 334

వ|| అప్పుడా సభాజనమ్ము తదుపాయమ్మునకు విస్మయంబందె. నరేంద్రుండును దన కళంకమ్ము వాపెనని, తద్దయు రాజకీరంబుఁ బోషింపు చుండె, నంత. 335

కం|| తను నధికసభామధ్యం
బునఁ బ్రజ్ఞాప్రౌఢి లజ్జవోఁజూచె, నరేం

ద్రుని వలనఁ బడసి చిలుకం
దని యొద,నని వేశ్యమదిఁ బ్రతిజ్ఞ యొనర్చెన్. 336

కం॥ ఆరమణి నృత్యవిద్యా
పారీణత నొక్కనాఁడు పాకాసుర సం
హారుని నూర్వశి క్రియ రెం
పారఁగ మెప్పించెఁ దజ్జనాధిప ముఖ్యున్॥ 337

సీ॥ మెప్పించి వెసను న మ్మేదినీరమణుని
రమణి ప్రార్థించి ప్రేమమున నడుగఁ
దద్భావగుప్తి కైతవము భావింపక
రత్న కాంచన పంజరమ్ముతోఁడ
నిచ్చిన, మచ్చర మెచ్చ నచ్చెలి నిజ
చేటి చేతికిఁ గూరసేయుమనుచు
నొసఁగిన, నది గరుద్విసరమ్ము మిసమిస
లొత్తుక తరుగంగఁ గత్తికరుగఁ,

ఆ. వె॥ జిలుక దోఁగిదోఁగి చేరె జాలరి రంధ్ర
మునకు దాని పోకఁగని భయమ్ము
వెనుప, నన్యపక్షిఁ గని వంచి వెట్టిన
గుడిచి వేశ్య మిగులఁ గుతుక మొందె॥ 338

వ॥ అంతఁ దత్సమయమ్మునం గీరమ్మును దృగ్గోచరమ్ముగా కుండ జాలరి రంధ్రమ్మునం, దణంగి లజ్జవారి యుచ్ఛిష్టాహారమ్ము వలన శరీర పోషణం బాచరించుకొనుచు దన తెక్కలు వచ్చునంతకు, నంద యుండె నంత నవ్వారకాంతయు,—— 339

సీ॥ ఖండేందు శేఖరుఁ జండీశుఁగుండలి
కుండలాలంకృతుఁ గొండయల్లు
మందాకినీధరు మందారమాలాంసుఁ
గందర్పదర్పఘ్ను నం దివాహుఁ
గాలకూటాద్భుత నీలకంఠుఁ గృపాళు
ఫాలాక్షునాభీల శూలహస్తు

శర్వ నానాకళాఖర్వగజాసుర
గర్వాపహా సుపర్వ సార్వభౌమ

గీ॥ భీము నప్పురిలింగమ్ముఁ బ్రియమెలర్ప
సోమవారమ్ములను మనశ్శుద్ధి నుపవ
సించి, యవ్వారరామ పూజింపుచుండు
నట్లేఁగి యొకనాఁడు శుకరత్న మెగిరి చనియె॥ 340

వ॥ ఇట్లు చని చరమ సంధ్యాసమయమ్మున నబ్భీమలింగమ్ము గుడి చొచ్చి యద్దేవునిఁ బూజించిన పత్రదూర్వాంకురసుమమ్ముల నడుమ నిల్చి తన నిజాంగమ్ము, స్వకార్య సిద్ధికొఱకు నర్చనగా సమర్పించెనో! యనఁబచ్చ వన్నియ మించి యందణఁగియుండె నంత,—

చం॥ చెలులు ప్రయత్నపూర్వముగఁ జెంగలువల్ పొగడల్నవోత్పలం
బులు సురపొన్న లబ్జములు పొన్నలు నాదిగఁ బుష్పఖండముల్
ఫలములు పత్రముల్ పువులు పళ్ళెములంగొని యేఁగు దేఱ,వా
రలలన డాయవచ్చెఁ, ద్రిపురద్విషదంచితధామ మొప్పగన్॥ 341

కం॥ ఆరాజ బింబవదన పు
రారాతిం, బూజసేయునప్పుడు గని, గం
భీర స్వనమున నచ్చటి
కీరం బిట్లనియె దానికిం బ్రియమెసఁగన్॥ 342

కం॥ ఓలలన! నిన్ను మెచ్చితి
నీ లోకభ్రాంతి విడువు నేఁ గొనిపోదున్
గైలాస శిఖరికీక్షణ,
మేలా! యాలస్యమనిన, నిట్లని పలికెన్॥ 343

వ॥ స్వామీ! మహాదేవ! దేవతారాధ్య! మదనభూతిలిప్తాంగ! తావ కదయాపాంగ విశేషంబున మజ్జన్మమ్ము సఫలత్వమ్మునొందె, బ్రహ్మేం ద్రాదులకునైన, ననిర్వచనీయుండవైన నీవు వేశ్యయని, నన్నుం జూడక సాక్షాత్కారంబునం బిలిచి బుద్ధి ప్రసాదించితివి, నేఁ గృతార్థనైతి, నింక నే నెయ్యది యాచరింపవలయు! నెఱింగింపుమనిన, నక్కపటకీరమ్ము మహే శ్వర భ్రాంతియె తలంచి యిట్లనియె. 344

గీ॥ పడఁతి! నీ కల్మషమ్ములు వాయఁ బుడమి
సురుల కిడు నీ గృహమ్మెల్లఁ జూఱవిడిచి
బోడి తలతోడ నేతెమ్ము పొమ్ము, టన్న
నది ముదంబునఁ దద్విధం బాచరించి, 345

వ॥ మగుడి చనుదెంచినం, జూచి నితాంతకౌతుకమ్మున నమ్మహాలింగం బుభయపార్శ్వమ్ములఁ బత్రకుసుమమ్ములువాయఁ జంద్రశేఖరుం డిదె వెడలి చనుదెంచుచున్నవాఁడని గణికారత్నం బన్యకాంతల కెఱింగింప, నతిరయమ్మునఁ వెడలి తద్ద్వారశాఖి శాఖాగ్రమ్మున వ్రాలి, దానింజూచి యారాజకీరం బిట్లనియె. 346

ఆ. వె॥ కైతవమున కధిక కైతవం, బాదరం
బునకు నాదరంబు, పొందుఁబొసఁగు,—
పక్షులకును నన్ను బాపిన, నాకు, నీ
శిరము ముండనమ్ము సేయఁజనదె! 347

మ॥ అనిన, న్వారవధూటి ఘోరతర శోకాంభోనిధిం దేలుచున్
మునుఁగం బారుచునుండె నెచ్చెలులు తన్నుంజూచి దైన్యమ్మునన్
వనరం దద్విధమెల్ల భూపతి, జనవ్రాతంబు, నా లోపలన్
విని హర్షంబొనరింపఁ, గీరమటవీ వీథిం జరించెన్ దగన్॥ 348

వ॥ అది గావున వృషభేంద్రుండు హితంబాచరించిన, నీవును హితంబాచరించితివి. కపటోపాయమ్మునం జరించిన, నీవును గపటోపాయమ్మునం జరించి పొరిగొంటివి. నీకు వృథాశోకం బేమిటికి! ధరిత్రీ కళత్రులకుం బుత్రమిత్ర భ్రామికంబువలవదు. భుజబలపరాక్రమంబ, కారణంబు. యిట్టి వ్యాపారంబు పూర్వరాజులయందుఁ బ్రసిద్ధంబని తెలిపిన విని కంఠీరవేంద్రుండు దమనకు వాక్యం బంగీకరించి రాజ్య సుఖమ్ము లనుభవింపుచు సమస్త జనమ్ములు గొల్వ సుఖంబుండె, నంతఁ గరటకదమనకు లతనియొద్దనే యుండిరని రాజకుమారులకు విష్ణుశర్మ యెఱింగించెనంత. 349

శా॥ సారాసారవిచార! నూత్నభరతాచార్యాంక! మార్తాండ తే
జోరాజత్సుకుమార విగ్రహా! దిశాశుండాల గండస్థలీ
ధారాళ ప్రగళన్మదోదక భవోద్యత్కాళిమా[ంకేందు] వి
స్తార శ్వేతయశోవిశాలా! కరుణాచంచత్కటాక్షేక్షణా! 350

కం॥ చారుతర మానగుణగ్రాం
ధారేయ! మహాప్రశాంతి ధర్మజ! సంగ్రా
మారంభ విజయ! దానక
ళారాజితకర్ణ! భాగ్య రాజితశరణా! 351

పంచచామరము॥ జితామరేంద్రభోగ! వాగ్విశేష (స్వ)లోక స
న్నుత స్ఫురద్గుణాభిరామ! నూతన స్ఫుటాంబుజాం
చితేక్షణ ప్రసన్నవక్త్ర! శేముషీ బృహస్పతీ!
ప్రతాపవైరి భీమకాంత భామినీరతీశ్వరా! 352

—: గద్య :—

ఇది శ్రీ భారతీ వరప్రసాదలబ్ధ విద్యా విచిత్ర తిప్పనమంత్రి పుత్ర
సుజన విధేయ భానయ నామధేయ ప్రణీతంబైన
పంచతంత్రియను మహాప్రబంధమ్మునందుఁ
ప్రథమాశ్వాసము



# ద్వితీయాశ్వాసము

కం|| శ్రీ రమణీరమణ పదాం
భోరుహ విన్యస్త హృదయ! భూరికృపా వి
స్తార దృగంచల! లక్ష్మీ
నారాయణ! భోగవిజిత నాకపమూర్తి! 1

వ|| సుహృల్లాభంబను ద్వితీయ తంత్రం బాకర్ణింపుము 2

కం|| అనినఁ గుమారులు హృదయం
బునఁ బొంగుచు విష్ణుశర్మ ముఖపంకజమున్
గనుగొని యా కథ దెలియన్
వినిపింపుము మాకు మిగుల వేడుకయయ్యెన్. 3

వ|| అనిన నమ్మహాత్ముం డిట్లను, మున్ను మీకు నేనెఱింగించిన మహిళా రూప్యంబను పురసమీపమ్మున నొక్క శాల్మలీ భూరుహమ్ము గలదు. అది కుసుమ విసరద్యుతిచేత నకాల సంధ్యారాగ విభ్రమంబును బహుళతర సాంద్ర పర్ణ నిబిడచ్ఛాయ వలన బహుళపక్ష తమస్సదృశ ప్రభావంబునుం జేయుచు నఖిలపతంగరుతంబుల బధిరీభూత రోదోంత రాళంబై యంతరిక్షంబున కాధారంబుగా నంబుజసంభవుండు నిలిపిన దీర్ఘ స్తంభంబనం బొలుపొందు, [నా] వృక్షంబున———లఘుపతనకుండను వాయసప్రభుండు వసియించియుండు నంత. 4

కం|| ఒకనాఁటి తేపకడలు
బ్ధకుఁ, డొకఁడట కేఁగుదెంచి పక్షులఁగడును
త్సుకతన్ జూడఁగ లఘుపత
నకుఁడును సాధ్వసముదవ మనమ్మునఁ బొడమన్ 5

మ|| పలుమాఱుం దనుజూడ లుబ్ధకుఁడు శుంభద్దంభ సంరంభతన్
వల యచ్ఛోటన యొడ్డి, యంద, మఱి నానాధాన్యముల్ చల్లియ
వ్వలఁ బక్షిధ్వనులాచరించుచు మనోవాంఛారతి న్నిల్వ నం
త, లసద్వేగమునన్ గపోతపతి చిత్రగ్రీవుఁ డుత్సాహియై. 6

కం॥ కులజులగు పక్షి ముఖ్యులు
గొలువఁగ జాలాంతరమునకుం జని ధాన్యం
బులు గొనుక హృదయవాంఛా
కలితుండై చిక్కువడియెఁ గర్మవశమునన్. 7

వ॥ ఇట్లు దగులంబడిననా లుబ్ధకుఁడు విహంగవధపూరిత స్వాంతుండై సంభ్రమంబున జాలమ్ము జేరం జనుదెంచునప్పుడా చిత్రగ్రీవుండను కపోత వల్లభుండు తమ విహంగ సంఘమ్ము రక్షింపనెంచి యధికతర ప్రజ్ఞా విశేషంబున నిట్లనియె. 8

కం॥ ఒక్కటిగా నుడువీథికిఁ
గ్రక్కున నెగయుదము లుబ్ధక ప్రారంభం
బెక్కడి కెక్కును మనకీ
చిక్కములోఁ జిక్కనేల! శేముషి గలుగన్. 9

కం॥ అని జాలముతో నింగికిఁ
జనియె శకుంతములతోఁడ జవమున, నుష్ణం
బును దీర్ఘమైన యూర్పులుఁ
దనమదిఁ గలపంగ నిలిచెఁ దద్వ్యాధుండున్. 10

వ॥ ఇట్టి వృత్తాంతంబంతయు శాల్మలీతరు శాఖాగ్రమ్మునందున్న లఘుపతనక నామధేయుండగు కాకమ్ము సర్వమ్మును వీక్షింపుచుండ, చిత్రగ్రీవుండు సహచరులగు కపోతవరుల కిట్లనియె. 11

మత్తకోకిల॥ రండు నాసఖుడైన మూషికరాజు చారుహిరణ్యకా
ఖ్యుండిటన్ వసియించియుండు జవోన్నతి న్నన, నంతయా
తండ, యీవల చిక్కుబాపి ముదంబుచేయు నటంచు న
య్యండ జావలితోఁడ దత్కుహరాగ్ర సీమకు నేఁగినన్॥ 12

చం॥ తన చెలికాని రాకవిని, తద్దయుఁబొంగి హిరణ్యుఁడా బిలం
బున వడి నేఁగుదెంచి, వలఁబొందిన పక్షులతోఁడి చుట్టమున్,
గనుగొని శోకబాష్పములు గన్నులఁ గ్రమ్మగఁ గౌఁగిలించి నీ
కును నిటువంటి బాధ సమకూడెనె! దైవవశమ్మునన్ భువిన్॥ 13

వ॥ అని విషణ్ణవదనుండై నిట్టూర్పులు నిగిడించుచు వెండియు
నిట్లనియె. 14

కం॥ తన పూర్వజన్మ కర్మము,
లనుదినము శుభాశుభమ్ము నందించు, జగ
జ్జను లాదిజీవులకు దై
వ నియోగమువలనఁ గడపవచ్చునె తలఁపన్! 15

గీ॥ సుజనులకు లేమి, గ్రహపీడ సోమసూర్యు
లకు, భుజగేంద్ర, మాతంగ శకున, సంచ
యమున, కరయంగ బంధన మాచరించు
నలఘుతరమైన, విధి శక్తిఁ దెలియవశమె! 16

శా॥ తారామార్గమునం జరించు ఖగసంతానమ్ము, వారాశిలో
నారూఢస్థితినున్న మీనతతి నైవాధీనతన్ భూజనో
ద్గారంభంబున గాదె! చిక్కుపడుఁ, గాలాతిక్రమక్రీడ, నె
వ్వారల్ నేర్తు రుపాయధైర్య బలగర్వ ఖ్యాతిఁ బెంపొందినన్॥ 17

వ॥ అని యివ్విధంబున హిరణ్యకుండు హృదయతాప నివారకంబు
లగు వాక్యమ్ములుపలికి యాచిత్రగ్రీవ పాశవిచ్ఛేద నారంభుండై నిలిచిన నతం
డిట్లనియె. 18

కం॥ ఓయన్న! యీ విహంగ ని
కాయమునకు మున్నె చనఁగఁ గౌతుకమగు నే!
యీ యనఘులబంధమ్ములు
పాయమ్మునఁ బాయఁజేయు పరమప్రీతిన్॥ 19

గీ॥ అనిన మూషికపతి విహంగాగ్రగణ్యుఁ
జూచి కీర్తింపఁదగు నీ విశుద్ధచరిత
మనుచు బంధన విచ్ఛేద మొనరఁజేసి
యతిథి పూజల నన్నిఁటి నాదరించె॥ 20

వ॥ వెండియు నుపగూహనం బాచరించి పతత్రి సమేతుండగు చిత్ర
గ్రీవు వీడ్కొని నిజగృహంబునకుం జని సుఖంబుననున్న సమయమ్మున,

నఖిల వృత్తాంత దర్శియగు లఘుపతనకుండు నాహ్లాద పల్లవిత హృదయుండై
చనుదెంచి హిరణ్యకున కిట్లనియె. 21

సీ॥ చెలిమి నీతోడుతఁ జేసెదఁ గడు [మహా]
నీయ పాత్రుండవు. నీవుపలఁప
ననిన హిరణ్యకుండపుడు నీవెవ్వండ
వనినఁ గాకంబు నేననియె, మూషి
కంబు, నీతో మైత్రి గావింపఁబోలునే!
యే, నీకు నాహారమైన దాన
ననవుడు, నాకు నిన్నాహార మొనరింప
నాఁకలి దీరునే! యనసి చూడఁ,

గీ॥ బ్రతుకుదును నీవు జీవింపఁ బతగ విభుని
భాతి, నామాట విశ్వసింపంగ వచ్చు
వదరఁ బలుకులు నీడోప్పఁపములయందుఁ
గలవె! యిందుకు నీ చెలికాఁడె సాక్షి. 22

వ॥ అట్లు గావున మద్భాషణమ్ములు భవద్భాగంబునం గైతవమ్ము
లుగా దలంచెదవేని యొజెంగించెద వినుము. 23

కం॥ ఖలుదంభము సుజనులపైఁ
గొలుపదు తృణవహ్ని శిఖల, కూపార జలం
బులఁబోలె, మదిదలంపఁగ
బలభిన్నిభభోగ! నూత్న భరతాచార్యా! 24

వ॥ అనిన విని హిరణ్యకుండా లఘుపతనకున కిట్లనియె. 25

కం॥ ధరఁ జపలుఁ డఖిల కార్యాం
తరములఁ దమకించి పోలియు, ధర్మపరుఁడు బం
ధురమతి వివేకయుతుఁడై
కరము సుఖస్థితిఁ దనర్చుఁ గరణిక లక్ష్మా! 26

మ॥ అనినన్, వాయసమిష్టమైనది గజాస్యా [శ్వాన్వ] యోత్తంస! వెం
బున నీతోడి సఖిత్వమన్న, విని యా పుణ్యాత్ముఁడేఁ జెల్మి యె

ట్లొనరింతున్! బరికింప నీవు బలవేగోపాయ విభ్రాజి వ
చ్చిన సుగ్రారివి విశ్వసింపఁ, బలుకన్ జక్కాల! దంభోన్నతిన్. 27

గీ|| వసము [ల] గ్ని నలనఁ గ్రాఁగి తదుష్ణంబు
దాల్చిన్నైనఁ, గలసి దాని నణఁచు
నల్పుఁ డధికునొద్ద ననఘుభావము దాల్చి
న్నైనఁ, గూడి చెఱుచు నాశ్రయంబ. 28

కం|| తన మిత్రుఁడైన రిపుఁడై
నను, దుష్టుని నమ్మఁజనదు, నాగేంద్రము పెం
పునఁ గపట విషము దాల్చును
ఘనమగు గూఢ ప్రవృత్తిఁ, గరణిక లక్ష్మీ! 29

గీ|| మున్ను సాధ్యంబసాధ్యమ్ము నెన్నకున్న
నెఱిదలంపులు [నేగతి] నిబ్బరించు
నావ, లవనీతలమ్మున నడచునట్లు
తద్విపర్యాయమైన చందమ్ము నొంది! 30

వ|| అని పలికి, యమ్మూషికాగ్రణి వాయసవల్లభు నమ్మఁజాలక, గహ్వరాంతర్గతుండై దీర్ఘీకృత కంధరుండగుచు నవలోకింపుచు, నిట్లను. నాకు నీవలని విశ్వాసద్రోహంబు లెఱుఁగఁబడవు. డోలాందోళిత హృదయుండనై యున్నవాఁడ, మతిమంతులకు నృశంసభయం బవ్విధంబ కదా! యని చెప్ప విని లఘుపతనకుం డిట్లనియె. 31

కం|| అవమతి భావము, మృత్యుం
భవిధిం జూపట్టు, సుజను భావంబైనన్
బ్రవిమల హేమఘటము క్రియ,
వివరింపుము వారివలన, విత్తయ లక్ష్మీ! 32

వ|| అదియునుంగాక, బహునగశిలోచ్చయాకూపారభార ధురంధర యగు నివ్వసుంధరకువిశ్వాస ఘాతుకుండొక్కఁడ బరువగుట యెఱుంగవే! నన్ను, నకల్మషహృదయుంగా నెఱుంగుమనినఁ, దన్మధురవాక్యంబులకుఁ బరమప్రీతుండై, యోలఘుపతనకా! నీకోర్కె సఫలంబయ్యెనని ప్రమాణ పూర్వకంబుగా సఖ్యమ్మొనరించె, నప్పుడు,— 33

కం|| ధర సజ్జనులకు ద్రవ్యము
పరికింపఁగఁ జెల్మి, శుష్కభావంబున నొం
డొరుల ధనమెల్లఁ జూతురు
ఖరమాంసములట్ల, నెపుడు కరుణిన లక్ష్మీ! 34

వ|| అని తదుత్సవ సమయంబున. 35

గీ|| స్వగృహ సంగతుఁడయ్యె, మూషక విభుండు
వాయసమ్మును వీడ్కొనె వెలలు వేడ్క
నదియుఁ జనతెంకి కరిగి వనాంతరముల,
నఖిల మృగమాంస ఖండమ్ములరసి తెచ్చి. 36

చం|| తన చెలికాఁడు దాసుఁ బ్రమదమ్మున మెక్కుచు సంతతోత్సవం
బునఁ జెలువంది యంత బలిభుక్ప్రవరుండనుచు నా హిరణ్యకుం
గనుగొని, యీ ప్రదేశమునఁ గ్రవ్యము లేదు శరీరపోషణం
బున కనఘాత్మ! కావలయుఁబోయెద నెచ్చటికైన సత్తేఱిన్. 37

వ|| అని, యేతత్ప్రదేశంబు గడచి గవ్యూతి మాత్రంబు చనిన నందొక్క సరోవరంబు గలదందు మత్ప్రియసఖుండు మంథరాభిధానుండగు జరఠకమఠేంద్రుండు జలచరాహారమ్ముల నన్ను రక్షించు నేనచ్చోటికిం బోయెద, ననిన విని హిరణ్యకుం డిట్లనియె. 38

ఉ|| పాయఁగలేను నిన్ను నను భద్ర! సరోవరమందుఁ గూర్పవే
వాయస! యన్న చంచువుల వానిగ్రహించి చలమ్మమీఱ, వై
హాయస వీధినేఁగి కమలాకరమున్ బొడగాంచి వేడుకన్
వాయుచలత్తరంగచయవారి కణమ్ముల, నేద దేఱఁగన్. 39

కం|| అంతఁ బ్రియమ్మున మంథరుఁ
డెంతయు సంభ్రమముతోడ నేతెంచి, సరః
ప్రాంతమున నున్నవారల,
సంతస మందించె నధిక సత్కారములన్. 40

గీ|| అంత నీ మూషికాగ్రణి, నాదరమునఁ
జంచువులఁ బూని విజన సంస్థానమైన

యివ్వనంబున కేతెంచితి, ప్పుడీతఁ
డెవ్వఁ డెఱిఁగింపుమనఁ, గాక మిట్టులనియె. 41

కం॥ అనఘా! వినుము హిరణ్యకుఁ
డను మత్తేభ [ముఖ] వాహనాన్వయముఖ్యం
డనుపమమతి, నమరగురుం
డనఁబరగును నఖిల గుణ సమంచితుఁడరయన్. 42

వ॥ అని చిత్రగ్రీవోపాఖ్యానం బతని కెఱింగించి యితండు పరమోప
కారి యగుట దెలిసి సకౌతుకంబుగ మిత్రత్వం బొనరించితి నన, నా కచ్ఛపేం
ద్రుండు విస్మితహృదయుండై హిరణ్యకుం గనుఁగొని,— 43

కం॥ అనఘా! విజనారణ్యం
బున, కరుదెంచిన విధమ్ముఁ బొలుపొందఁగ నే
వినవలతుఁ జెప్పవే యని
తను నడిగినఁ జెప్పఁదొడఁగెఁ దన్మూషికమున్. 44

వ॥ మున్ను మహిళారూప్యంబను పురసమీపంబునఁ జూడాకర్ణుం
డను భిక్షుకుండు మఠస్థుండై యుండు నతనింజూచు వీణాకర [బృహస్ఫిక్]
నామధేయుండగు భిక్షుకుండు నేరవచ్చిన నతని సౌకర్యాని యభ్యా
గత పూజలం బరితృప్తునిఁ జేసి, యతం డానతిచ్చు హరికథలు విను
సమయంబున, నా చూడాకర్ణుండు భిక్షమ్ము దెచ్చుకొని భుజియించి శేషిం
చిన యన్నంబొకపాత్రను సంఘటించి తత్సమీపమ్మున, నునుచుకొనియున్న
సమయంబున నేను నా మఠమ్ము బిలంబులో నివాసమ్ముఁ జేసికొని
యుండి బహుపదార్థ సంగ్రహుండ [నయ్యును], లోభంబున క్షుత్పిపాసా
పరవశుండనై బిలంబు వెళ్లి వచ్చి తచ్ఛేషాన్నంబు భుజియించుచుండఁ
జూడాకర్ణుండు నన్నుంగనుగొని కథ వినుట మాని యొక వంశదండంబున
నన్నడిచిన నేనది తప్పించుక బిలమ్ము లోపలికిం బోయితి, నా సమ
యంబున. 45

సీ॥ మూషికమ్మును గొట్టె మూర్ఖ, చూడాకర్ణుఁ
డని బృహస్స్ఫియుఁ గోపమడరఁ, జూచి

కథలు నేవర్ణింపఁగాఁ బరభ్రాంతిచే
నన్యచిత్తుఁడవైతి వాఁగహాము
నెలుకఁ గొట్టఁగఁబోతి చల శేముషీ! యసు
నతఁ డిట్టులను, భిక్షువర్యుఁ డనిన,
దండించితిని నాఁగ దానికి బలఁగమ్ము
గలదొ! యొక్కటొ! చెప్పు ఘనుఁడ నొక్క

గీ॥ యెలుకమాత్రంబునకు నింతయలుగ నేల
యతిపతీ నీకు! కలవొక్క యమితకథయు,
మున్ను వారణ మూషికములకు ననిన
నానతిమ్మని స్థల భిక్షుఁ డడుగుటయును, 46

వ॥ మహాత్మా! తొల్లి గోదావరి తీరంబునఁ బ్రభంజనమ్మను పట్ట
ణంబు గలదా, పురిసమీపంబున శోణితయను నది ప్రవహించుచుండు, నా
యేటిచెంగటి నేల బొఱియలలో విఘ్నకుండను మూషికంబు నివా
సంబు జేసికొనియుండి, సమీపక్షేత్రంబులం బండిన ధాన్యంబాహారంబు
జేసికొని, యొక్కనాఁడు ప్రమాదవశంబున నేటిలోఁబడి ప్రవాహమ్ము
వెంబడి పఱవంబోవు నవసరమ్మున,— 47

కం॥ వారణపతి భీముండను
ధీరుఁడు జలకేళి సల్ప, దేవియు దాసుల్
ఆరూఢిగ నయ్యేటికిఁ
గోరిక నేతెంచి నీటఁ గ్రుంకుచునుండన్. 48

వ॥ ఆ విఘ్నకుండను జలంబులం బడిపోవుచు తొండాల మిథు
నంబుగని, దగ్గఱంబోయి కరిరాజా! దిక్కులేక పఱవం బోవుచున్నవాఁడ
నన్ను వెడలింపుము నీకు నొక యవసరంబునకు వచ్చువాఁడ, నన్ను గొంచెం
బని చూడకుమని విన్నవించిన గజపతియును గృపాసముద్రుండు గావున
నాగజ ముఖాశ్వంబు దన కరంబునంబట్టి యేటి దరినింబెట్టె, నదియును నతని
దీవించి నీకు నాపద వచ్చువేళఁ దన్నుం దలంపుమని చెప్పి తన్నిలయంబున
కరిగె. నంత గజేంద్రుండును జలకేళి సాలించి తన సతియుం దానును దత్సమీ
పారణ్యంబున నిష్టచర్యల వసియించియుండె,—అంత నేనుఁగు వేఁటకాండ్రు
తద్విపినంబు ప్రవేశించి మోదంబులు ద్రవ్వి చిల్లరత్రోవలుగట్టి కరినాథుఁడు

వదనిఁ జేరుట కొక త్రోవఁ జేసి, యచ్చటచ్చట పచ్చికయు నిక్షువండంబులు
నెరపి చుట్టును ముల్లడచి తమతమ గృహమ్ములకుం జనిన సమయమ్మున. 49

కం॥ గజపతి సతియును దానును
గజిబిజిలే నట్టియడవిఁ గాలూఁదకఁ వే
గఁజనియు మేపులు మేయుచు
నిజముగ నోదంబులోన నెరిఁబడి [రంతన్] 50

కం॥ సతిపతులు గ్రంతఁబడియా
తతమతి వెడలంగ లేక దైవమ! యనుచున్
మతిఁగలఁగుచుండ, మూషిక
పతిఁదలచుఁడు, నతఁడువచ్చె బంధుయుతుండై 51

గీ॥ వచ్చి వంగిడిఁ బడియున్న వారణములఁ
గాంచి దుఃఖితుఁడై బలఁగంబుఁ జూచి
పరుల నొరలంగ ద్రవ్వి యీదంతియుగము
వెడలఁ దివియంగవలయు వివేకులార! 52

వ॥ అని తన కులపతులకుం జెప్పి యసంఖ్యాతంబులగు నెలుకలంగూర్చి
యాక్షణంబున వంగిడిం బూడ్చి గజద్వయంబును వెడలించిన,- 53

గీ॥ గుంత వెడలివచ్చి కుంజర యుగళమ్ము
మూషికమున కెల్మి మ్రొక్కి మ్రొక్కి
నీవు గలుగఁబట్టి నేఁ బ్రతికితి నీకుఁ
బిడ్డ పేరుపెట్టి పెంపుగందు॥ 54

వ॥ అని కరిపతి మూషికపతినిఁ బెక్కువిధమ్ముల స్తుతియించి నేఁ
బోయివచ్చెద నన్ను మఱువకుమీ! యని చెప్పి యెలుక కులమ్ము చేత నా
మంత్రితుండై యథేచ్ఛ నరిగె. ఎలుకరాజును గజపతికిఁ దనకు వచ్చిన
పూర్వబద్ధ సఖ్యమ్ముఁ దన కులంబువారలకుఁ జెప్పుచుఁ దనయింటి కరిగెనని
బృహస్వి చూడాకర్ణున కెఱిఁగించి వెండియు నిట్లనియె. 55

కం॥ శాండిలి యనఁదగు బ్రాహ్మణి
దండిగఁ దన నాథువలనఁ దగవినిన కథల్

వెండియుఁ గలవని చెప్పిన
యండను, నవి తెలియఁజెప్పుమని యడుగుటయున్ 56

వ॥ ఇట్లు చూడాకర్ణుం డడిగిన బృహస్స్ఫి యిట్లనియె, మున్ను వేదా గ్రేసరుండను బ్రాహ్మణుండు తన గృహంబున వసించియుండి యొక్క నాఁడు. 57

చం॥ తన సతిఁజూచి పర్వమిటఁ జామరసానన! డాసె, విప్రభో
జన మొనరింపవే!యనుచు సామ వచస్స్థితిఁ బల్కె, లేదు పా
మ్మనిన, నమర్ష దారుణ తరాననుఁడై మును జంబుకంబు, గూ
ర్చిన పటలంబు, వాపి తుదిఁజేరదె! కాలుపురంబు పంటి చేన్॥ 58

కం॥ అనిన నదెట్లని, విప్రుఁడు
తనునడిగినఁ బ్రాణసతికిఁ, సత్కథఁ జెప్పెన్
మును లుబ్ధకుఁ డొకపురమున
ననవరతము మాంస విక్రయస్థితి నుండెన్॥ 59

వ॥ ఉండి యొక్కనాఁ డతండు మృగయాభిరతి నరణ్యంబునకుఁ జని యొక్క కణితి మృగమ్ము నేసి, దానిం గావడింనుకొని చనుచుండ, నొక్క వరాహంబెదిరినఁ దన మనంబున, 60

ఉ॥ దైవముచేతఁ గూర్పఁబడె తథ్యము మాంసమటంచు నుర్విపై
జీవములేని తన్మృగముఁజేర్చి వరాహముఁ జంప, దానిచే
నావలఁగూలెఁ గోశయుగళాంతర *గాహిత ఘోరదంష్ట్రుఁడై
యావిధమెల్లఁజూచి ముదమందుచు నొక్క సృగాలమత్తఱిన్॥ 61

వ॥ అధికక్షుత్పరవశుండై యామిషాభిరతిం జనుదెంచి యిదిదైవోప పాదితంబని తలయూఁచి ధ్రువనామధేయుండగు జంబుకంబు తన మనంబున నిట్లని వితర్కించె. 62

కం॥ ఒకదినముగడచు నీలు
బ్ధక మాంసము, కణితి మెగము దంష్ట్రియు రెణ్ణా

* భేదిత అని మూలము

శ్శకుఁ జాలుఁ జాప మహోర్వి
ప్రకటములగు నరములిపుడు పారణసేతున్॥ 63

గీ॥ అనుచు లుబ్ధక మృగవరాహములఁ దత్ప్ర
దేశములఁబెట్టి డాసి దురాశఁజేసి
యల్లెఁగొఱికినఁ దెగి హృదయమునఁ బడిన
నంతకునిఁజేరె జంబుక మాక్షణమున. 64

కం॥ అని యివ్విధంబు దెలియన్
వినిపించి యతండు దేవ విప్రులకుంగా
క, నరులు తమకై కూర్చిన
ధనమంతయు నిలువదనుచుఁ దరుణికిఁ జెప్పెన్॥ 65

వ- అని యివ్విధంబునఁ జూడాకర్ణునకు నా బృహస్స్వి యెఱింగించి యమ్మాక్షిక ధనంబు, దేవభూదేవ యోగ్యంబుగాదు. ద్రవ్యంబు కలిగియు దురాశవలన భిక్షాన్నంబు భక్షించి యనవరతంబు నీ కపటాధం బొనరింపు చున్నది నే యతిఁగావున దీనియర్థంబు నఖిలంబు గ్రహించితినని సంభ్రమంబున లేచి మన్నిలయంబుఁజేరి, 66

ఉ॥ కేల ఖనిత్ర మొప్పఁ బరికింపుచు మద్బిలభూమిఁజేరి యా
భీలతఁ ద్రవ్వి నాధనము భిక్షుఁడు గైకొనె నాఁటనుండి, దుః
ఖాలసమార్తినై, యిడుమలందుచుఁ గుందుచు నివ్విధంబునన్
జేలక్రియన్ జరింపుదు నభేద్య గుణోన్నత! విభ్రమంబునన్॥ 67

వ॥ అని చెప్పి మఱియు నిట్లనియె. 68

కం॥ ధనముగలవాఁడె పండితుఁ,
డనఘుఁడు, ఘనకీర్తిమంతుఁ, డన్వయపూజ్యుం,
డనవరత దానశీలుఁడు,
విను మవనీతలమునందు విత్తయలక్ష్మా! 69

కం॥ పరదేశమె నిజదేశము
పరులే బాంధవులు ద్రవ్య పరిపాలునకున్
ధరణి నసాధ్యం బెయ్యది!
పరమార్థం బిదియె నూత్న భరతాచార్యా! 70

కం॥ కులసతిరోయును జుట్ట
మ్ములు వాయుదురొరులు కష్టపుం బలుకుల, ని
మ్ముల నాడఁ దొడఁగుచుందురు
కలియుగమున ద్రవ్యహీనుఁ గరణిక లక్ష్మా! 71

కం॥ మృతిఁబొందిన జనునైనను
హితులెల్లను డాయుదురు మహీస్థలిలోనన్
మతిఁదలఁపఁ జేఁజేరరు
బ్రతిమాలిన, నొరులు నూత్న భరతాచార్యా! 72

కం॥ ఇలలోపల ధీయుతునకు
వలయును దృఢమనము బంధువర్గము ఖేగడన్
దలపోసి చూడ, లేమిఁయుఁ,
గలిమియు, పోవచ్చుగానఁ గరణిక లక్ష్మా! 73

కం॥ పామరుల వేఁడఁజేయును
ధీమద మణఁగించి బుద్ధి తేఁకువ చెఱుచున్
[ప్రేమ[వ]తులఁ [నెడఁ] బాపును
లేమియుఁ గష్టమ్ము నూత్న లిఖితాచార్యా! 74

కం॥ తలఁపదశవాజి మేథ
మ్ములనైన ఫలమ్ము చలనబుద్ధి రహితుఁడై
చెలిమి యొనరించు, సద్గుణ
కలితుండగు నరునిఁబొందుఁ గరణికలక్ష్మా! 75

గీ॥ ధనముపోయిన దృఢలక్ష్మిఁ దఱుగనీక
మంచి మనమున సద్ధర్మ మహితపదము
దప్పి నడవక, పరుల సంతాపముడుప
వైద్యుఁడన సంచరింతు భూవలయమందు. 76

వ॥ అని యివ్విధంబున నా హిరణ్యకుండను నెలుకనిజకథా వృత్తాంతంబును నీతిప్రకారంబును నెఱింగింప నాకర్ణింపుచున్న జరత్క చ్ఛపేంద్రుం గనుంగొని లఘుపతనకుం డిట్లనియె. 77

కం॥ కరిబురదఁ బొందఁబడినను
గరియే వెడలించుఁగాక! కాకులతరమే
సిరివరమపుణ్యుం జేరని
సరియుంగను నీకెకాక యన్యులవశమే! 78

మ॥ అనిన స్మరంగుఁడు హృష్టుఁడై కాకయని మీ నాహార సంతుష్టచి
త్తునిఁ గావింపుము గాన మూషికసమేతుండై గుణగ్రాహ్యుఁడై
చనుమానంబున నుండఁగా నెపుడు నాశ్చర్యంబుగాఁ దన్మహా
వనమధ్యంబున నాకు బంతికొనిని స్వేచ్ఛన్ మృగంబుద్ధతిన్ 79

వ॥ అయ్యవసరంబున పిపాసాక్రాంత హృదయుండై మంథరుండు కాకంబు నీక్షించుచుండఁ బాంధి మూషికంబును నేనును నిచ్చటనే యుండువాము లేడి సన్నిధానంబు శీఘ్రంబున నెఱింగి రమ్మనిన, వల్లెయని యదియు నుంజని యొక్క మహీరుహంబున్నతాగ్రాల, యామృగంబున కిట్లనియె. 80

గీ॥ ఎవ్వఁడవు నీవు బెదరంగ నేమికార
ణంబు నీ పూర్వకథయెల్ల నాకుఁ జెప్పు
మనిన హరిగంపి మృగము తిర్యఙ్ముఖంబు
చేసి కాకంబుతో విరతిఁ జెప్పఁ దొడఁగె. 81

వ॥ [నేను చిత్రాంగుండను వాఁడ మున్నొక్క] యటవీ ప్రదేశమ్మున నా జననీ జనకులు నివాసమ్ము చేసికొని మా యమ్మ నన్ను గర్భమ్ముతో నుండి సుఖప్రసవంబుచేసిన దివసంబున. 82

గీ॥ శబరుఁ డొక్కఁడు వేడుకఁ జపలుఁడగుచు
నడవిలోపలఁ దిరుగాడి యమ్మ నన్ను
గన్నచోటికి నేతెంచి కాంక్షతోఁడ
నేయఁగడఁగిన నా తల్లిపోయె పారి. 83

కం॥ తడియారకుండ నేనును
దడబడుచుండంగ బోయదగ్గఱి నన్నున్
వడిఁబట్టి యెత్తుకొని తాఁ
గొడుకని భూమిపతి కమ్ముకొనియెన్ ప్రీతిన్॥ 84

గీ॥ బోయచేతఁ గొనుక భూపతియును దన
పుత్రునకిడె నతఁడు ప్రోదిచేసి
నన్ను బెంచి వేడ్క నా [పదములఁ] బైఁడి
యందెలిడియె నాకు నంద మొంద. 85

వ॥ నేను భూపతి కుమారున కల్లారు ముద్దుసేయుచు వేడుక వేళ వెంటవెంటం దిరుగుచు గంతులిడుచు పరువులు వారుచు సందుల దూరుచు బాలుల మీఱుచు నుండియుండి యొక్కనాఁడు బాలుతోఁడంగూడి పురోపవనమ్మునకుం జని వంగివంగి పచ్చిక మేయుచుండ. 86

ఆ॥ వె॥ బాలుఁడొకఁడు వచ్చి పట్టినన్ గొట్టిన
నిరపరాధి నన్ను నీవు గొట్ట
నేల యనుచు నేను బాలునిఁ దిట్టితి
నలి మనుష్యభాషణముల వేగ. 87

వ॥ నే తిర్యక్కనై యుండియు మానవ భాషణమ్ములఁ బలికిన పలుకులు రాజకుమారుం డాలించి,— 88

శా॥ నా వాక్యమ్ములు మర్త్యభాషణములైనన్ రాజపుత్రుండు, మోహావేశమ్మును బొంది తేటియపు డాద్యంతం బెఱింగించె రాద్దేవస్వామి కతండు రేపకడ భూదేవోత్తమ శ్రేణితో
నా వృత్తాంత మెఱుంగఁ జెప్పె మదిలో నాశ్చర్యముప్పొంగఁగన్. 89

గీ॥ ఆమ్మహాత్ములు గ్రహశాంతి యపుడుచేసి
బాలుదీవించి యమ్మహీపాలు వలన
ద్రవ్యసంపదఁబొంది నితాంత సమ్మ
దమున నృపుఁగాంచి పలికిరా సమయమందు. 90

వ॥ దేవా! యిది యొక్క కారణంబున మృగశరీరంబు నొందినది గాని మృగమ్ముగాదు. దైవభాతి భవన్మందిరంబున నిలుపవలదు. మున్ను దీనిం గొనితెచ్చిన లుబ్ధకుచేత నే యథాస్థానంబున విడిపింపవలయున ననభూభ వల్లభుం డాహ్లాద పల్లవిత హృదయుండై యట్ల చేయించె నవ్విధంబున— 91

క॥ ఏనును నాతల్లిం గని
దీనతఁ గలిసికొని యడవిఁ దిరుగుచు సంతన్
మానుగఁ జన్నులు గుడుచుచు
నానాఁటికి దేహపోషణంబును గంటిన్. 92

ఆ॥ వె॥ అందుఁ బెద్దకాల మఖిల బంధువులతోఁ
గూడియుండఁ గలిగెఁ గొమరు మిగుల,—
పిదప నొక్క బోయ ప్రేరేపఁగ నుబాయ
వలనె నిపుడు దైవవశము వలన. 93

వ॥ ఇది మత్పూర్వ వృత్తాంతంబు జవసత్త్వ సంపన్నుండనయ్యును బోయవాని యురులు నాచరణమ్ములం దగులుటం జేసి కుంటువడియున్నవాఁడ, ననినఁ గాకంబు సకౌతుకంబుగా నిట్లనియె. హరిణపతీ! భవద్బంధమ్ము వాయు నుపాయంబే సంఘటించెదనని చెప్పి మంథర హిరణ్యకు లున్నకడకు వచ్చి వేఁటవృత్తాంతం బెఱింగించి క్రమ్మఱ నచేని మృగపుంగవుం దోడ్కొని చనుదెంచిన, 94

క॥ ఆ మంథరుండు ప్రియమున
నేమమె చిత్రాంగ! బోయచేఁ బడి సుకృత
శ్రీ మహిమమగుడఁ బ్రతికితె
నా మందిరమందు నిలుము [నా నెయ్యమవై]. 95

గీ॥ అనుచుఁ బాశమ్ము లా హిరణ్యకుని వలనఁ
బాయఁజేయించి కారుణ్య భావ మొప్ప
నతిథి సత్కార పూజల నాదరించి
చెలిమి యొనరించె నిశ్చల చిత్తుఁడగుచు. 96

ఉ॥ పంబిన వేడ్కతోడుత నుపాయ చతుష్టయ మో యనంగఁ బ
ణ్యంబుల కెల్ల నెల్లలగు నల్వురుఁగూడి లసత్కథా ప్రసం
గంబులఁ బ్రొద్దుపుచ్చుచు సుఖస్థితి నుండగ సంతఁ గొంత కా
లంబున కొక్క లుబ్ధకుఁడలాత భయంకరుఁ డేఁగుదెంచినన్. 97

ఆ॥ వె॥ ఎగసి చనియెఁ గాక, మెలుక గర్తంబున
కేఁగె, నడవి మృగముడాఁగె మృగయుఁ

డాశ విడిచి వచ్చి యమల జలాంతర
గతునిఁ గమఠ విభునిఁ గాంచె నప్పుడు. 98

కం|| ఇది నాకు సంభవించెన్
బడివేలని మూఁకిరెంట బాఁక యతఁడ
మ్ముదికమఠము చిక్కమ్మునఁ
బడిలమ్ముగ నిలిపి చద్ది భక్షింపంగన్. 99

వ|| అయ్యవసరమ్మునఁ గాకహరిణ మూషికంబులు ముగ్గురుం గూడి యుద్యోగవంతులు బుద్ధిశాలులగుటం జేసి తత్సమీపంబునకుం జేసు చెంది జలప్రాంతంబున నున్న కృతాంతనిభుండగు లుబ్ధకుని, నతని చెంతం బట్టుపడిన నెచ్చెలిం గనుగొని శోకవ్యాకులితచిత్తులై పుంపుపుంబొక్కుచు నలువిక్కులు సూచుచు మనము మువ్వురము నతనియండ వసియించి బ్రతికితి మింక నితండు విడివడు నుపాయం బెయ్యదియొకో యని తలంచుచున్న సమయంబు నందు హిరణ్యకుం డిట్లనియె,— 100

కం|| చెలికాఁడు రక్షకుఁడు ని
ర్మల చిత్తుఁడు కూర్మవిభుఁడు మనలఁను బాసెన్
దలపోయుఁ డతఁడు లుబ్ధకు
వలనం బెడవాయు నేర్పువలు మతమునన్. 101

కం|| నిలువెల్ల ధర్మరూపము
తలఁపెల్లను దలఁపఁ బరహితం బమృతమ్ముల్
పలుకులు సువిచారత ని
ర్మలచిత్తుం డితనిబాయరాదని మజకిఁనున్. 102

కం|| కాయంబు, లనిత్యంబు, ల
పాయంబులు వైభవములు ప్రాజ్ఞులకైనన్,—
పాయదు మృత్యువు, ధర్మో
పాయము వగుఁ బ్రజకు నూత్న భరతాచార్యా! 103

వ|| అని హిరణ్యకుండు నీతిమార్గం బుపదేశించి యితనికింగా మనము శరీరంబులు విడిచిన నేమియని నిశ్చయంచిన వాని పలుకులు వినియు వినని

యట్లు బోయ కుడిచి కవుతంబున ధనువు కొప్పునఁ దగిలించికొని చనుచుండ నక్కూర్మవరుని లుబ్ధక ప్రతిబంధంబులువోలె వెనుఁదగిలి చనుచుండ నతం డొక్క జలాశయంబు గనుంగొని యందు మధురంబులగు జలమ్ములు ద్రావుచున్న సమయంబున, 104

చం|| త్వరితగతిన్మృగమ్ము తనుఁ దాఁకుమఁ జారిన లేడిఁ గాలకిం
కరనిభమూర్తి లుబ్ధకుఁడు గాంచి పరాకుగ ఖేటితాంగ దు
ష్కరహతసీడఁ జిక్కెనని సంభ్రమమిగ్గొ వెనువెంట నేఁగ నా
తుదరయతముల్ చలంగ నది దూరమునన్ బడియె న్మహీస్థలిన్. 105

వ|| అంతలోన,—

శా|| కాసంబుద్ధతినేఁగి చందుపులఁ దత్కాయంబు ఘోరించిన
ట్లా కాలమ్మునఁ జేసి లుబ్ధకుఁడు వాంఛాపూర్ణ చేతస్కుఁడై
నాకుం జిక్కెనటంచు డగ్గఱిన యంతన్, బోరొ నాలెండు న
స్తోకాహ్లాదముతో, నతండు మిగులం దుఃఖాంబుధిం దేలుచున్. 107

వ|| మగుడి చనుదెంచి నంత నమ్మూషిక పిఘంటపు తన తీక్ష్ణదశనాగ్రంబుల జాలంబు తుత్తునియలు గావించి సంభ్రమంబున నొక్క రంధ్రాంతరాశమ్మునకుం జనె నా సమయమ్మున,—

కం|| రయమునఁ గచ్ఛపము జలా
శయమునకుం బోయె బోయ చనుదెంచి విషా
దయుతుండై మగిడినిజా
లయమునకుం జనె విపన్న [ల] పనుండగుచున్. 109

వ|| ఇట్లు శబరపుంగవు నొట్రించి కాక హరిణ మూషికంబులు నిజసఖుండగు కచ్ఛపేశ్వరుని విడిపించుకొని సంతోషాతిశయంబునఁ గ్రమ్మఱ లఘుపతనక హిరణ్యక మంథర హరిణపతులు గూడికొని తమతమ యథాస్థానంబులకుం జని సుఖపరాయణులై యుండిరని విష్ణుశర్మ రాకుమారులఁ బ్రహృష్ట హృదయులం జేసె నంత, 110

శా|| పారావార గభీర! విభ్రమవతీ పాంచాల! కారుణ్య వి
స్తారోదారకటాక్ష వీక్షణ! సుధాంధస్సింధు, తారాగ, స

ద్ధైరా, శాగజ, కాశ, శారద ఘనా, హీన, స్ఫురత్కీర్తి ల
క్ష్మా రాజీవదళాయతేక్షణ! బుధశ్రేణీ పరీరక్షణా! 111

కం॥ గంభీరవాగ్వి నిర్జిత
కుంభీనస! గోత్ర శైలకూర్మాహిప సత్
కుంభీంద్ర భారభరణ వి
జృంభి తదోస్తంభ! శౌరిసేవాభ్రమణీ! 112

తోటకవృత్తము॥ హితబాంధవ కల్ప మహీరుహా! సం
తత భోగవి నిర్జిత నాకప! భూ
నుత సూనృతవాక్య! వినూత్న కళాం
చితకీర్తి! వినందిత శిష్టజనా! 113

—: గద్య :—

ఇది శ్రీ భారతీ వరప్రసాద లబ్ధ విద్యావిచిత్ర, తిప్పన మంత్రి
పుత్ర, సుజన విధేయ, భానయనామధేయ,
ప్రణీతంబైన పంచతంత్రి యను
మహాప్రబధంబునందు
ద్వితీయాశ్వాసము



# తృతీయాశ్వాసము

శ్రీనాథ చరణకమల
ధ్యాన పరాయణ! బలారిదంతావళశు
భ్రానమితకీర్తివర! ల
క్ష్మీనారాయణ! కళావిశేష విధిజ్ఞా! 1

వ॥ సంధి విగ్రహంబను తృతీయతంత్రం బాకర్ణింపుము,— 2

చం॥ మొదల విరోధియైన యతిమూఢు సఖిత్వము విశ్వసించినన్
దుదిఁ జెడిపోవు భూవిభుఁడు, దొల్లి గృహాంతర ఘూకపంక్తి యు
ప్పిదముగ వాయసప్రభుఁడు పేర్చిన భీకర వహ్నికీలలన్
మసిమసిఁ గూలదే! యన కుమారులదెట్లని తన్ను వేఁడినన్॥ 3

కం॥ ఆ విష్ణుశర్మ దృఢమతి
జీవ ప్రతిమానుఁడపుడు సెప్పెన్ దెలియన్
భావజనిభరూపులకా
భూవర పుత్రులకు వేడ్క భూరి ప్రీతిన్. 4

సీ॥ తన శాఖలేర్చి మార్తండుని తేరి ప
ద్ధతికి మిక్కిలి విరోధంబొనర్ప
తన నీడ ధారుణీధవళాయతాక్షికి
నాతపత్ర క్రియ నతిశయిల్ల
తన కోటరములు పతంగ పుంగవులకు
నెంతయుఁ జెలువొందునిండ్లు గాఁగ
తన ఘనమూల సంతాన మశ్రాంతము
శేషుతోఁ బాయని చెలిమిసేయ

ఆ॥ వె॥ ప్రళయవేళనైన పత్రమాత్రనె విష్ణుఁ
బ్రోపఁ జాలుననుచు బుధులుదలఁప
నొక్క యడవి నడుమనుండుఁ దావలముగ
వటము భువన వినుత జటమునగుచు, 5

కం॥ ఆ తరుశాఖను బలిభు
గ్వ్రాతము సేవింప నొక్కవాయస ముండున్,
జాతి దనుఁగొల్వ నతి ప్ర
ఖ్యాతిగ నుండును దివాంధమత్రాంతమ్మున్. 6

వ॥ ఇట్లుండి యొకనాఁడతి క్రోధారుణీకృతలోచనుండగుచు విమతాభిధానుండగు దివాంధవల్లభుండు ఘూక సహస్ర పరివృతుండై విభావరీ సమయంబునఁ బ్రభంజన జవంబునం జేరువెంచి నిద్రావశంబు నొందియున్న వాయసనివసంబుపైఁ బడి చరణనఖరమ్ములన్ జంచుపుటమ్ముల భేదింపఁ దొడంగిన, నందు పరిదేవనాయతమ్ముల గగనమ్మున కెగసియు, నన్య భూజమ్ములన్ జేరియు, దిగ్భ్రమం బొందియుఁ, గృతాంత నిలయమ్ము డాసియు, నిట్లనేక ప్రకారమ్ములఁ బలాయనత్వంబునందినఁ గాకిమూఁకలకు దొరయగు మేఘవర్ణుండను వాఁడప్పుడు,— 7

కం॥ పరుల కభేద్యంబగు త
త్తరు కోటరమునను డాఁగి తన జీవంబున్
వెరవొంద నిలుపుకొని భా
స్కరోదయమ్మైన శోకసంయుతుఁడగుచున్. 8

వ॥ ఉండు నవసరమ్మున, నతని మంత్రులు, సుద్దీపి సందీపి ప్రదీప్యాదీపి చిరంజీవులను నేవురు దివాంధవల్లభు బారికిందప్పి యొక్కటం గూడికొని తమ యేలిక యగు మేఘవర్ణుం డున్నచోటికిం జని దండప్రణామం బాచరించిన బలిభుగ్వల్లభుం డిట్లనియె,— 9

గీ॥ బ్రతికితిరె! మీరు కౌశిక ప్రతతిచేత
నిట్టి యాపద సనుదెంచె నేమిసేయ
వచ్చు, దైవవశంబని వారితోఁడఁ
బలికి చింతావశీ కృతభావుఁ డగుచు,— 10

వ॥ అయిననేమి కాఁగల కార్యంబులు కాకమానునె! మనకిప్పుడు సేయవలయు కృత్యంబెయ్యది యెఱింగింపుఁడనిన నందు సుద్దీపి యిట్లనియె. 11

కం॥ తన సదృశుండైన, సామంబును, నల్పుండైన దండమును, మత్తుండైనను, భేదమధికుండైనను బని వఢిదానమ్ము సేయఁబరగు ధరిత్రిన్ 12

కం॥ శూరతయును గపటం బె
వ్వారలకేనియుఁ గలుగు, వారి సమీపం,
బారయ విడిచి భయంబున
దూర స్థానంబు వొందుదురు ధీమంతుల్. 13

వ॥ అని పలుకు సవ్యాస్యవచనమ్ము లాకర్ణించి, సందీపియాననం బాలోకించి మన కెయ్యది కర్తవ్యంబని మేఘవర్ణుం డడిగిన, నతం డిట్లనియె,— 14

ఉ॥ స్థానము వాయుసంత నిజసైన్య సమూహము వాయు, వైరి సం
తానముమీఁది కార్యములు దానొనరింపఁగ నోపఁ, డాత్మ ర
క్షాని భృతార్థి తార్థియగు గావున, బుద్ధిఁదలంచి చూచినన్
స్థానబలమ్మె కావలయు ధారుణి, విత్తయలక్ష్మి ధీమణీ! 15

గీ॥ నెలవు బాసి మున్ను నల హరిశ్చంద్ర కౌం
తేయు లంతవారు దీనవృత్తి
నొదిగియుంట వినమె మదిఁ దలపోసిన
బాయఁదగదు నేల ప్రాజ్ఞులకును 16

వ॥ అనిన విని యతండు ప్రదీపింగనుం గొని యెయ్యది యాచరింపవల యుననిన, నతం డిట్లనియెను,— 17

చం॥ అతి బలవంతుఁడైన విరయమ్మున వారలతోఁడి మైత్రి సం
తతమును నిశ్చలంబగు మనమ్మునఁ జేసి, నిజప్రదేశ సం
గతుఁడయి పొల్చు టొప్పు, నదిగాదని యొండొక దేశమేఁగినన్
ధృతిమెయిపోవుతో, ననుమధీయుత! నొచ్చునతండు నేఁడనన్. 18

వ॥ అట్లుగావున వారలతో సామంబాచరించి యిచ్చటనుండుద మనిన, సవ్యాయసవిభుండు, ఆదీపింగనుంగొని భవన్మతం బెఱింగింపుమన, నతనికతం డిట్లనియె,— 19

కం॥ పరులొక కాలము చేకొని
పరిమార్చిరి మన బలంబుఁ బ్రస్ఫుట కీర్తిన్
బరిమార్ప మనము నాక్రియఁ
బోరిఁగొందము, కపట బుద్ధి పొగడిత కెక్కన్. 20

కం॥ వారు దివాంధులు మనము, వి
చారింప నిశాంధులము, నిశావేళ బలం
బారూఢమ్ముగ నొంచిరి
వారలు, దివమునను నొంపపలయును మనకున్. 21

కం॥ అని యిట్లు మంత్రులు హితం
బునఁ జెప్పిన నీతి మార్గమున్విని ధీమం
తుని నసఘు నా చిరంజీ
వినిఁ [గనుగొని] ప్రీతిఁ గాకవిభుఁ డిట్లనియెన్. 22

వ॥ త్వద్బుద్ధి బలంబు పెంపునఁగదా యివ్విభవం బనుభవింపఁగలిగె నిప్పుడస్మత్కు లోపభోగ్యంబగు రాజ్యం బరివశంబు గాకుండ నిలుపమనిన, నతం డిట్లనియె,— 23

గీ॥ పరులకై తపంబు [వలన] నారంభమ్ము
లుడిగెనేనిఁ దలఁప నొకటికలదె!
[వివిధ] జీవరాశి విశ్వాసమున నమ్మ
కష్టవర్తనంబు గానలేదు. 24

చం॥ అఱయగ, మంత్రరక్షితగు, నాతతకైతవ గూఢభావుఁడై
పరులకు నాప్తుఁబోలి యనపాయ [గతిన్ హిత] మాచరింపుచున్,
బరుఁడుగ నొక్కనేళఁ దన వైరమణంచి [మెలంగ], బుద్ధి భా
స్వరుఁడయి యుంకుటొప్పు, గుణవార్నిధి! విశ్వయలక్ష్మి ధీనిధీ! 25

వ॥ అని యిట్లు చెప్పి యాచిరంజీవి యిట్లనియె దేవా! సామదానభేద దండమ్ములను నుపాయచతుష్టయమ్ములను, బ్రభుమంత్రోత్సాహంబులను శక్తిత్రయంబువలనను, సంధి విగ్రహయానాసన ద్వైధీభావసమాశ్రయంబులను షడ్గుణంబులం దనరి, జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజమ్ములను షడ్గుణైశ్వర్యంబుల సంపన్నుండై, భూతభవిష్యద్వర్త మానంబులను నెఱింగి [న భూపాలుండు] పరులక భేద్యుండని వెండియు నిట్లనియె,— 26

కం॥ తన శక్తియుఁ బరుశక్తియు
మనమునఁ దలపోసి శిష్ట మంత్రుల బుద్ధుల్

విని యొనరించిన కార్యము,
ఘన కీర్తికి నెక్కుసుమ్మ, గణికా లక్ష్మా! 27

కం॥ బకము క్రియ, వేళ యహి సం
తకు, మౌనమ్మునఁ జరింపఁదగు, నటమీఁటన్,
బ్రకటమ్ముగ సింహము పో
లిక మెలఁగఁగవలయు, సూక్ష్మ లిఖితాచార్యా! 28

గీ॥ ఇన్ని గుణముల లోపల నేదిగ్గైనఁ
దనకు నసువగునట్టి చందమ్ముఁ జూచి,
దేశకాలముల్ మదిలోనఁ దెలిసి మెలఁగు
నతని బొందును సంపద లతిశయముగ. 29

వ॥ మున్ను శౌర్య సంపన్నుండై దేశకాలమ్ము లెఱింగి చరించు నతని గుణదోషమ్ము లెఱింగి విశ్వసింప జన......భునిచేత......ందు. మహోద్యోగిని నిందిర యాశ్రయించు, మంత్ర ప్రభావమ్మున దుష్టమృగభుజంగమ శక్తులనణంచునట్లు చోరులఁ, గామాతురుల, దోష స్వభావుల, నతి లుబ్ధుల, దుర్మదాంధుల, సమరభీరులఁ, దద్దండ నీతిచేత దండింపదగు. దైవమానుషమ్ములు గల్గిన సహాయులగు నియామకుల వలనఁగాని, పరవాహినీ సందోహమ్ముఁ దరియింప నలవిగాదని, యతం డిట్లనియె— 30

ఉ॥ ఆరయ మంత్రమూలము జయమ్ముటుగావున, నీక్షణమ్మునన్
వారల జేరి సూత్నమృదు వాగ్విసరమ్మునఁ దేల్చి, మైత్రి పెం
పారగఁ జేసి కార్యఫలమందుట మేలన, నాలకించి ప్ర
జ్ఞా రమణీయుఁ, దత్సచి వసత్తము, నాతఁడు సూచి యిట్లనున్,— 31

కం॥ ఏరీతినైనఁ గౌశిక
వారముతో సంధిఁ జేయవచ్చునె! మనకున్
వారికి దలపోయం గను
వైరంబని పల్కెఁ, గాకవల్లభుతోఁడన్. 32

సీ॥ ఆ చిరంజీవి యిట్లను, విరోధంబున
కగు, కటువగుపల్కు గారణమ్ము.

[కార్యమ్ము విహతంబు] గాదె! మున్వ్యాఘ్రఘోష
ముప సన్న, నతని యాననముగాంచి
యెట్లన, ఒ [భువను] నెఱింగించెఁ గల వొక్క
రజకు భూపము వాపు రాసభి యపు
పేపవి మేతకై వెస ద్వీప చర్మా వృ
తంబగు దేహమ్ము దాల్చి, రాత్రి
సైపన, సస్య వితానమరసి మేయుచునుండఁ
జేని కాపరి కాచి, చివికి చివికి

యలసి, యొకనాఁడు విల్లును నంపగములుఁ
బూని ధూసరకంబళమును ముసుఁగువెట్టి
పొంచికొనియుండ, [రాసభి] పూని మేయ
వచ్చి, ధూసరకంబళి వానిఁ గనియె. 33

కం॥ ధూసరకంబళ మటుగని
రాసభమని కూయ, సస్య రక్షకుఁడు మదిన్
రా సభమని తలపోసి, శ
రాసనబాణమునఁ దన్ను నంతకుఁ గూర్చెన్. 34

వ॥ అట్లు గావున వారలకును మనకును వైరంబు పెద్ద కాలంబున నుండి వాగ్దోషంబునం బొడమె, నది యెట్లనినఁదొల్లి దివాంధ విభుని నొక్కని, నఖిల పక్షులు పక్షిరాజ్యంబునకుఁ బట్టంబుగట్టుదమని చనుదెంచిన, నందు మంత్రికర్ణుండను వృద్ధ కాక విభుండు చనుదెంచి పక్షుల కిట్లనియె. 35

గీ॥ ఇతని నభిషేక మొనరింప నెట్లువచ్చు!
దర్ప సంయుతుఁడ, ప్రియదర్శనుండు
పక్షులనునెల్ల భక్షించి బలిసికొనును
నల్పుఁ జేపట్టఁ గార్యమ్ములగునె! దలఁప. 36

సీ॥ అధికునిఁ జేర్కొని యల్పులైనను సంత
సము నొందుదురు, మును శశకవితతి
యేపునఁదారకేశోపదేశమ్మున
బ్రతుకవే యని పల్కఁ బక్షులన్ని

ధంబంత నెఱిఁగింపఁ దగునన్న నాతఁ డి
ట్లని చెప్పె, మున్నొక్క వనమునందు
దంతులు ద్వాదశాబ్దంబు లనావృష్టి
యైనను, జలములేకా, తృఁగలఁగి, 37

గీ॥ ద్విరద విభుఁజూచి పల్కెనో దేవ! చండ
కిరణు తాపమ్ము మేనును గ్లేశపరుప

— — — —

— — — —

కం॥ కరివల్లభుఁడంబు సరో
వరముల హ్రదములను వెదుక, వడిగల మత్త
ద్విరదమ్ములఁ బంపె దిగం
తరముల నవి చూచివచ్చి, తమపతి యెదుటన్. 38

వ॥ నిలిచి, యిట్లని విన్నవించె,— 39

చం॥ కరిపతి! నీవు వంపఁజని కంటిమి చంద్రసరోవరమ్ముఁ, బ
స్ఫురదురు శంఖచక్రములఁ బోల్చి పయోరుహాలత్మ్మి నెంతయున్
సురుచిరమై జనార్దను తనుక్రియ నెప్పుడు మీఱుదానిఁ బు
ష్కరయుతమైనదాని, జలజంతు తతిన్ దగుదాని, నొక్కచోన్॥ 40

వ॥ అని చెప్పిన విని, యతులితంబగు సంభ్రమంబునఁ దత్ప్రదేశమ్ము
వాసి. 41

శా॥ ఆ నాగేంద్రుఁడు సంతసమ్మొదవ సుద్యత్కాల మేఘాకృతిన్
దానాంభః కణసంచయమ్ము వడియన్, దంతావళశ్రేణితో
నానాభూజములెల్ల వ్రాల, శశసంతానమ్ము వైవస్వత
స్థానంబుద్ధతిఁ జేరబో, నడచెఁ జంచద్వేగ సంరంభియై. 42

వ॥ అయ్యవసరమ్మున శిలీముఖనామధేయుం డగు శశకవల్లభుండు
నిజప్రధానవర్గమ్ము నవలోకించి, వారణసందోహంబనవరతమ్మును జలాభి
లాష నస్యసరోవరమ్ములకు నడువ మన బలఁగంబెల్లఁ బొలియందొడంగె,
మనకుం జేయునది యెఱింగింపుఁడన, నందు బహువృత్తాంత విదుండగు వృద్ధ
మంత్రి విజయుండను వాఁడిట్లనియె,— 43

ఆ॥ వె॥ దేవ! దంతి ఘటల నీపనవీధుల
నడుపకుండఁజేయ నాకు నేర్పు
గలదటన్న, నపుడు కౌతూహల స్వాంతుఁ
డగుచుఁ బలికె, విజయు నవ్విభుండు॥ 44

కం॥ తడయక సేయుము విను, మె
క్కడ నీతివిదుండు దేశకాల విభాగం
బడరఁగఁ దెలియును, నాతం
డిడుమలఁ గూడండు సిరియు నెంతయుఁబొందున్. 45

కం॥ అని పల్క నాశిలీముఖు
పనుపునఁ జని విజయుఁడపుడు భద్రేభములన్
గనుగొని చింతాకులుఁడై
తన హృదయములోన నపుడు దలపోసి తగన్॥ 46

కం॥ కాయంబల్పము, దంతి ని
కాయము దానోత్కటంబుగావున, విసయో
పాయమునన్నైన డాయ న
పాయము నేకులు నటంచుఁ బ్రజ్ఞాస్వాతుఁడై. 47

వ॥ విచారించి యొక్క భూధర శృంగంబెక్కి యోగజేంద్రా! నీకు భద్రంబగుననిన, నతండు నీ వెవ్వండవు! నీరాకకు గతంబెయ్యది నాకెఱింగింపు మన, నవ్విజయుండిట్లనియె. గజపతీ! నేఁ జంద్రదూతను చన్మండల మధ్యంబున విహరించుచుండు శశకవిభుండ, నా పేరఁ జంద్రుండు శశాంకుడనిపించుకొనియె. నానాథుండగు చంద్రుఁడు నీతోఁడి సఖ్యం బపేక్షించి, నన్ను నీ సమ్ముఖమ్మునకనిపిన వాఁడని వెండియు నిట్లనియె,— 48

కం॥ తలపోయ నిష్ఠురోక్తులు
పలికినఁ, దిట్టినను, భూమి పాలురకును వ
ధ్యులుగారు దూతలెందును,
బలభిన్నభభోగ! నూత్న భరతాచార్యా! 49

వ॥ అట్లు గావుననే హిమకరునానతిం బలికెద, స్వపర శక్తి నెఱుంగక యెవ్వండేని యజ్ఞానంబునఁ గార్యం బొనర్చు, నతండాపదలం బొందు.

చంద్రాధీనంబైన యా సరోవర రక్షకుల నీవలంచితివి. ఆ శశకంబులం జంద్రుండు నిజ శరీరమ్ముగాం దలంచు, నదియునుంగాక పవలెల్ల నమ్మహాత్ముండాకసమ్మున వర్తించు, నిశా సమయంబున నా చంద్ర సరోవరమ్మున వసియించి యుండు, నీవును నీపరిజనమ్మును నిదాఘ కాలమ్మున నోర్వలేక యా చంద్ర సరోవరంబు ప్రవేశించుటకై పోవుచున్నవారు. అచ్చటికిం బోయిన నీకును నీ పరివారమ్మునకు నాపద వచ్చు. చంద్ర చిత్తం బెఱింగి నే నీకుం జెప్పితి, నా హ్రద ప్రవేశంబును, శశక మర్దనంబును, బరిహరింపుమని చెప్పిన విని, గజేంద్రుడతి భయమ్మున నిట్లనియె,— 50

సీ॥ అజ్ఞాన కృతమున నయ్యెం దత్కమలాక
రంబు పద్ధతి, యిట రామటన్న,
గజ వల్లభునిం జూచి విజయుండు పల్కె, నీ
వరుదెంచి యంపలి యమృత కరునిం
జూచి పొమ్మని, రాత్రి నొంపాంచ దన్ను దో
డ్కొని చని యా కొలంకునకు డాసి
పానీయములలోనం బ్రతిబింబితుండగు
చంద్రునిం జూపం, దత్సమయమందు

వందనమ్మొనరించి యో వారిజారి!
తప్పులెల్లను లోంగొను దయదలిర్ప,
నెన్నడీవంక రామని యేంగం, గాంచి
శశక సంచయమాత్మ సుత్సాహమొందె. 51

వ॥ ఇట్లుపాయమ్మున విజయుండు గజమ్ములం దొలంగించి తనభర్తయగు శిలీముఖున కవ్విధం బెఱింగించి సుఖంబుండిరి. అట్లు గావున నీ దివాంధుం బేర్కొన నాపదలణంగవు. హీనాత్ముండు ప్రజా పరిపాలనంబున కొప్పునే! యని వెండియు నిట్లనియె,— 52

చం॥ చెనంటి నబుద్ధిం జేసి గుఱిం జేసిన వారలు, నొత్తు రెంతయున్
బెనుపరి నూలవే! శశకపింజలముల్ మును పిల్లి చేననన్
విని పతగమ్ము లెట్లనిన, వేడుకం జెప్పెను దొల్లి భూరుహం
బున వసియించి యుండుదు ప్రభూత కుతూహల మానసుండనై. 53

గీ॥ అందుఁ బరుకోటరమ్మున ననఘమతి క
పింజలమ్ముండు నాతోడఁ బ్రియము కలిగి,
అస్తమానా? వసరమున నరిగె నొక్క
నాఁడు నెందేని, మేఁతకై పోడిమిగను 54

వ॥ తదవసరంబున,— 55

సీ॥ ఆ కోటరమ్మున నప్పుడు దీర్ఘ క
ర్ణుండను శశక విభుండు నిల్చి
కొంత కాలంబుండ, నంత కపింజలుం
డేతెంచి నా నెలవెవ్వఁడిపుడు
గైకొన్న వాఁడనఁ, గైకొన కాతఁ డి
ట్లను, నున్న వారిదే యరయ నెలవు,
ఎవ్వఁడు మున్నుండె నివ్వటిలంగను
వానిదే నెలవని, వాదులాడఁ
గని నేను వారలఁ గడకుఁ బోఁద్రొబ్బియుఁ
దగవుకు బోండని ద్వయము గూర్చి

గీ॥ ప్రీతి నేఁగితి నపుడా కపింజలుండు
న్యాయ్య మిరువురకును దెలియంగఁ జెప్పు
నతని నెఱుఁగవె! నీవని యడుగుటయును,
బరమ సంతోషుఁడై వాఁడు పలికెఁ దెలియ. 56

వ॥ యమునా తీరమ్మున నతి ధార్మికుండను నొక్క వృద్ధ మార్జాల విభుండు గలండ, తండు మనకు ధర్మమార్గం బెఱింగించునని దీర్ఘకర్ణుండు పలికినం, గపింజలుండిట్లనియె. వాఁడల్పజాతి మనకు విశ్వసింప వచ్చునే! యన వాఁడిట్లనియె,— 57

గీ॥ అతని మనకేల డాయంగ మఱిదలంప
న్యాయమార్గమ్ము' దెలిసి సన్మాన మొప్పు
మగుడి' చను దెంత ,మనినఁ దన్మానసమున
నాతఁడిరువురకును సమంబని యెఱింగి,— 58

గీ॥ అప్పుడిరువురు జనమున నరిగి వాని
కంఠరవమును జెప్పఁ, గడు వృద్ధనైతి, నాకుఁ
జెవులు వినరావు డగ్గఱి చెప్పు మనుచుఁ,
బరమ ధర్మము విశ్వసింపంగఁ బలికె. 59

కం॥ సంసారముల స్థిరము, ల
హింసకు సమమైన [ధర్మ] మేదిరొ, సుజనో
త్తంసునకుఁ దెలియఁ దగునది,
కంసారిపదాబ్జభృంగ! కరణిక లక్ష్మా! 60

కం॥ పరకాంతలఁ బల్లుల క్రియఁ
బరవిత్తము పెచ్చుమాడ్కి భావించి మదిన్
బరుల శరీరమ్ములఁ దన
కరణినిఁ జూడంగవలయుఁ గరణిక లక్ష్మా! 61

వ॥ అని యివ్విధమ్మున నాపధికస్థండు పరమ ధర్మశాస్త్రంబు లుపన్యసించిన, విని మనంబున విశ్వసించి [శశ]క కపింజలులు డగ్గఱిన, నమ్మార్జాలం బయ్యిరువుర భక్షించి తన శరీరంబు పోషణంబుఁజేసికొనె, గావున నిట్టి యల్పఘూకంబు గుఱిచేసి సమస్త పక్షి రాజ్యంబునకు నభిషేకం బొనరించుట యకర్తవ్యంబనిన నయ్యవసరంబున;— 62

చం॥ పతగములెల్ల వాయసము పల్కులు తథ్యములంచు నేఁగినన్
మతిఁ [దలపోసి] రోషమున మండి దివాంధుఁడు కాకిఁ జూచి కు
త్సితమునకేమి కారణము [మినీ] విభవమ్మున [కెల్లఁ బా]యఁ జే
సితి, మును నీకు నెగ్గొకటఁ జేసితినే యని పల్కె నల్కతోన్ 63

వ॥ అది మొదలుగాఁ గాకోలూకమ్ములకు వైరానుబంధమ్మయ్యె, నన విని మేఘవర్ణుం డాకర్ణించి జయోపాయం బెఱింగింపుమనినఁ జిరంజీవి యిట్లనియె, సంధి విగ్రహయానాసనద్వైధీ భావమ్ముల నతఁడ సాధ్యుండు- ఆశ్రయంబుననైనను, చిర ప్రయాసంబుననైనను,బగతున కపాయంబు నొందింప వలయునని వెండియు నిట్లనియె,-— 64

గీ॥ పరులు పెక్కండ్రు గూడి సర్వజ్ఞునైన
మోసపుచ్చంగవచ్చు మున్ భూసురుండు

ఛాగమచ్చట విడుపడె! శఠులవలన,
గనినఁ గాకేంద్రుఁ డెట్లని యడుగ, నతఁడు 65

మ॥ అవనీ దేవుఁడొకండుమున్నజముఁ గ్రత్వర్థమ్ము గొంపోవ, ధూ
ర్తవి తానంబది సూచి యాతని పిలుందంబోయి యో మూఢ! నీ
వవ మాన్యుండవు మాకుఁ, గుర్కురము నాహ్లాదంబు పెంపారఁ గ
ష్ట విచారమ్మునఁ బట్టినాఁడవని హాస్యంబెంతయుం జేసినన్॥ 66

వ॥ అమ్మహీ దేవుండును వృథా పరిశంకిత హృదయుండై యొద్ది యైనను నింద్యంబగు వస్తువు నశుభావహంబగునని తనచేతి, ఛాగమ్ము [నటవిడిచి] స్నానమ్ము సేయ నేటికింజనిన, నద్ధూర్తులచే నది భక్షింపఁబడియె. అట్లుగావున బహుజనోపాయంబువలన నొక్కండు మోసంబందునని, సకలోపాయమ్ములు మేఘవర్ణున కెఱింగించి, యెవ్విధంబుననైన ఘూకప్రభుం బొరిగొందునని నిజ శరీరమ్మునీఁకలు పెఱికికొని, మున్ను మృతిఁబొందిన వాయసమ్ముల రుధిరంబు లవయవంబులం బూసికొని, యవ్వాల సమీపమ్మునసుండె, నయ్యవసరమ్మున,— 67

గీ॥ అపరగిరి ధాతుశిల జారెనన్నకరణి
ద్యుమణి గ్రుంకంగ నెఱసంజ [ద్రుత] మ [హీని]
పాతమున [నైన] బహు [తిరోధ్వా] తధూళి
పటలమో! యన వర్ణింపఁబరగెమింట. 68

గీ॥ అపుడు ఘూకమ్ము లెల్లఁదనాశ్రయింప
కొటముపైనుండి వినుతుండు వాయసముల
వెదకి పోఁడగానకున్న నవ్వేళ జి—
—తలపోసి మది చిరంజీవి యచట 69

కం॥ ఆరంభరహితులకునున్
గారణమురు బుద్ధియనెడి ఘననాదము, దు
ర్వారముగ జేయఁ గౌశిక
వారము వినివచ్చి కడు జవమ్మున నటకున్॥ 70

సీ॥ అపుడు దన్నంటుక యా గూబలెల్లను
ధృతిఁ బలివర్ధికిఁ దెచ్చుటయును

నతఁడు నీ వెవ్వండవని పల్క, నే చిరం
జీవి నన్నును గృపచేత నిట్టి
పశ నిన్ను బొందగతంబేమి మేఘుఁ
............ననిన
విని యిట్టి......కిని నేను కొన్ని బు
ద్ధులు చెప్ప......ములుగుచుండ

గీ॥ నిన్ను సేవించిమనుమన్న, [న]న్ను నిన్ను
గూడెనంచు, విరూపిగాఁ [గొంచె] పఱచె.
నాకు [దొరవీవయని పల్కి] జోకపుట్టె
నుండె కైతవ మేర్పడకుండనట్లు. 71

వ॥ అని యిట్లు——కాకి మాటలు విని, ఘూక ప్రభుండు తన ప్రధాన వర్గమ్ము పిలిపించి, యందు రక్తాక్షుండను వానిం జూచి పగతుండైన మేఘవర్ణు భృత్యుం డీను మనల నాశ్రయింపవచ్చినవాఁడు. ఏమి సేయవలయునని, వాఁడిట్లనియె,— 72

మ॥ పగ వానిన్మది విశ్వసింపఁ జనదాప్త ప్రక్రియన్ భర్తృ కా
ర్యగుఁడై లోనరయంగవచ్చెఁ గపట వ్యాపార పారంగతుం
డెగ జూడందగుఁ బ్రోవనేమిటికి వీనిం ద్రుంచి నిష్కంటకం
బుగ రాజ్యం బొనరింపు మీవు కుముమున్ బోషింపు మత్యున్నతిన్. 73

గీ॥ పొసఁగ రోగమ్ము వైరమ్ము పుట్టినపుడె
నణఁపకున్నను బెలగు నతఁడు ధాత్రి,
కాలగతులను నవియ దుష్కరములగుచుఁ
దనకు నాపదగూర్చు, నిట్లనుచుఁ బలుక,— 74

కం॥ [విని] విమతుఁడపుడు క్రూరా
క్షునిఁజెప్పుమటన్న [వైరి] సొంపరి శరణం
బన, [ఁజంప నొప్పదనుచున్]
వినిపించెనతండు ధర్మనిరతుండగుచున్ 75

గీ॥ అతఁడు దీప్తాక్షు నడిగిన నతఁడు మృగయు
...మముచేత సాహసమయ్యె నాక

[ప్రోత] మని చెప్పవినమె సంజాత భీతి
యహితుఁడైనను రక్షింప నర్హుఁడధిప! 76

కం॥ ముసు.........
......డాతని కృప పెం
పుదఁగాచెననఁగ వినమే
ఘనునకు ధా......జయమ్ము కరణికి లక్ష్మి! 77

గీ॥ చెనఁటియైనను బ్రియమొప్పఁ జేసెనేని
నతఁడు వనకొంతయును హితవాచరించు,
మున్ను మృదువాక్యమునఁ గాదె! ముచ్చు, దిగిచి
కొనిన విత్తమ్ము తద్గృహస్థునకు నొసఁగె. 78

వ॥ అదెట్లని ఘూకప్రభుండడిగిన నతం డిట్లనియె. మున్నొక పురమ్మున సార్థవాహుండను వృద్ధ వణిక్కు గలండతని భార్య నవయౌవనాంగి కల దా, జంత యెన్నండును బతిని గైకొనక——పరి రంభణమ్మునకుం జొరక యుండునంత నొక్కనాఁడు,— 79

కం॥ చోరుండొకఁడు సురంగ
ద్వారమ్మున నిల్లుసొచ్చి వచ్చుట గని, త
న్నారి భయమంది యప్పుడు
గారవ మొప్పార విభునిఁ గౌఁగిటఁ జేర్చెన్॥ 80

వ॥ అప్పుడు సార్థవాహుండును బరితుష్టుండై గృహమునసున్న చోరుంగనుంగొని యిట్లనియె. 81

కం॥ కలనైనఁ గౌఁగిలింపని
కలకంఠినిఁ గూర్చితివి సుఖం బొప్ప నసుం,
తలఁప నినుబోలు చుట్టము
గలఁడే! విత్తమ్ము నీవు గైకొను మనినన్॥ 82

వ॥ చోరుండును గరుణాపరుండై నీకు సుఖమ్ము సిద్ధించినం జాలు, నా చేత నపహరింపఁబడిన విత్తమ్మెల్ల నీవే కైకొనుమని యతనికొసంగి యతని సాధ్వికి పతినెఱింగి సేవజేసుక బ్రతుకుమని బుద్ధిచెప్పి యతి కుతూహలమునఁ

వన నిలయమ్మునకుంజనియె, నట్లుగావున నతనికి హితవాచరించుట కర్తవ్యం
బను నవసరమ్మునఁ బింగళాక్షుండను వాఁడపరిపడి డాసి యా రాజుతో
నిట్లనియె,— 83

కం॥ పగతునిఁ [గైకొన]ఁబోలునె
తెగటార్పక యున్న, వాఁడె తెగటార్చుఁ జుమీ
—గి———నైన——వు
—గి——కాల———నట్లుగాదె ధృతి పగవాఁడున్ 84

వ॥———

సీ॥ దేవ నా పల్కు సందేహమ్ము లేద, భి
యాతి నైనను మాటలాడినపుడు
పగమహితుండగు బ్రహ్మరాక్షసుచేత
ధేనుద్వయము, కన్నగాని చేత
నాయువు, నీఁ బడె నవసీ సురునికన్న,
నా కథ యెఱిఁగింపు మనినఁ, దొల్లి
కలఁడు విప్రుఁడు ప్రతి [కల్యంబునతఁడు] గో
యుగమును మేపుచు నుండుగాన

నట్టి యావుల నొక చోరుఁడపహరింపఁ
దలఁచి నిశివేళఁ బోవ నాతని శరీర
మన్యగాత్రమ్ము సోఁకిన నరుదునొంది
యెవ్వఁడవు సెప్పమన్న వాఁడిట్లు పలికె. 85

గీ॥ సాహసుండను బ్రహ్మ రాక్షసుఁడ నీవు
నెవ్వఁడవు నాకు నెఱిఁగింపు మిప్పుడనిన
నేను జోరుండ నన, నతండేమి గోరి
యేఁగు చున్నాఁడవని తన్ను నెలమి నడుగ 86

వ॥ ఏఁ దస్కరుండ సమీప గ్రామ నివాసియగు విప్రుని గోయుగం
బపహరింప నేఁగుచున్న వాఁడననిన, నా రాక్షసుండును మద్గమనం బతనిఁ
బట్టుటకని చెప్పి యా యిరువురును నా భూసురు మందిరమ్ము ప్రవేశించి
రయ్యవసరమ్మున,— 87

సీ॥ ఆ బ్రహ్మ రాక్షసుం డవనీ సురో త్తము
మును గ్రహింపఁగ లేచెననుచుఁ, జోరుఁ
డావుల రెంటిని నపహరించెదఁ దో ల్తె
ననిన, నట్లగునె! తద్ద్వయముల నతఁడు
నిద్రఁ దేలునటన్న, నీవు పట్టిన మేలు
కొని బ్రేల నాకును గోయుగంబు
దొఱక నేర్చునె! యని యిరువురు వాదింప
నాతఁడు లేచి యిట్లనియె, మీఁగ

లెవ్వరన బ్రహ్మరాక్షసుండితఁడు నిన్ను
బట్ట వచ్చె నటంచుఁ జెప్పంగబడిన
యతఁడు, వ్రక్కెను నీ యావుల నపహరింపఁ
జేరియున్నాఁ డెఱుంగుము చోరుఁడితఁడు. 88

వ॥ అని యిట్లొండొరువుల తనితో భాషింపంబడి హితంబొనర్చిరి గావున, నితండును వధార్హుండు గాఁడని వెండియు నిట్లనియె,— 89

చం॥ శరణని యొక్కపక్షి మును సాధ్వస కంపిత సర్వ గాత్రమై
మఱుఁగు జొరం గడంక నిజమాంసము నొసంగెను నింగి నొక్కటన్
సురలు నుతింపగా, శిబి, వసుంధర నార్తులఁ బ్రోచు వారలన్
జిరతర కీర్తి పొందు నిది సిద్ధము విత్తయ లక్ష్మధీమణీ! 90

వ॥ అని పలుక విని ఘూకప్రభుండు ప్రాకార కర్ణుండను వాని నడిగిన, నతండీ బలి భుక్కు వధార్హుండు గాఁడని చెప్పిన విని లేచి యధిక రోషమ్మునఁ గటమ్ము లదర వెండియు రక్తాక్షుండిట్లనియె,— 91

ఉ॥ దేవ! యెఱుంగ రిద్దఱును ధీయుత చిత్తులుగారు, వీఁడు దు
ర్భావుఁడు పింగళాక్షుఁడు సభన్వినుపింపఁడె నీకు నీ ఖలున్
జీవముతోఁడ నిల్పిన నశేషదివాంధ కులమ్ము ద్రుంగెడున్
నా వచనమ్ము సత్యమని నమ్ముము, నీకుహితమ్ముఁ జెప్పితిన్. 92

సీ॥ ప్రత్యక్ష దోషమ్ము భావింపరాత్మ సు
బుద్ధులు సాంత్వన పూర్వమైన

పలుకులఁ బ్రీతి సంపదఁ దేలుదురు రథ
కారుఁడు [రమణిని] జారుతోడఁ
దల మోదికొనుచు నృత్యం బాచరింపఁడె
యన విభుఁ డెఱిఁగింపుమనినఁ దొల్లి
కలఁడొక పురి రథకారుఁ డతండు దు
శ్చరిత యగు తన భార్య జాడ దెలిసి

గీ॥ రాజు కూటమి గలిగుండ, రాజుతోడఁ
గర్జమున్నది వేనరుగంగ వలయు
ననినఁ ద్రోవకు సంబళం బప్పుడొసఁగి
యనిపి తనమది సంతసం బందియుండ,
నెలమి రథకారుఁ డెవ్వరు నెఱుఁగకుండ॥ 93

వ॥ తన భార్యకుం జెప్పి బంధు దర్శనార్థం బొకపురంబున కేగవలయు, రాజుచేత నామంత్రితుండనైతి, నేఁడుం బోయివచ్చెద నని వీడ్కొని కొంత దవ్వరిగి యెవ్వరు నెఱుంగకుండం, గ్రమ్మఱ విభావరీ సమయమ్మున నిజ గృహమ్మున కేతెంచి తనభార్య యెఱుంగకుండఁ బర్యంకమ్ము క్రింద నణంగి యున్న సమయమ్మున,— 94

గీ॥ శంక యొక్కింత లేక యా[అంకుటా]లు
దూతికా ముఖ వార్తచేఁ బ్రీతినంది
చేరవచ్చిన జారుని గారవించె
తేజరిల్లు కటాక్ష నీరాజనమున. 95

కం॥ ఆకులట జలకమాడఁగ
నేకాంత-స్థలముగూర్చి యేగిన, మదనో
ద్రేకమున జార పురుషుఁడు
చీకాకునఁ బొరలె గొంతసేపటి లోనన్. 96

గీ॥ ఎప్పుడేనియు దిజ్మదేభేంద్ర కుంభ
సన్నిభములైన పాలిండ్లు జారకాంత
నాయుర స్థ్సలిఁ జేర్పు మన్నదలిర్ప,
నపుడు మదనాగ్ని యణఁగు నటంచునుండ, 97

కం॥ ఆ సమయమ్మునఁ బుష్ప శ
రాసన సామ్రాజ్య లక్ష్మియన, శృంగారో
ద్భాసితమై, యది పర్యం
కాసనమునఁ బొల్చు దొరసు [నాపటఁ] జేరెన్. 98

ఉ॥ చన్నులమీఁది కొంగు దిగజారి పవిత్రయ నాథు లేప్పడన్
గన్నులఁజూడ్కి [గొంతి] తొలికారు మెఱుంగుల నీనుచుండఁగన్
గ్రొన్ననవింటి జోదు మదకుంజరయాన యన భాసిల్లుచున్న యు
య్యన్నగడంకఁజూచె సురతాభిరతన్ బరియూర శోభితన్. 99

వ॥ అప్పుడయ్యిరువురు ననంగపెనఁగి కుసుమభల్ల మల్ల యుద్ధమ్ము
నకు సన్నద్ధులై గళరవహుంకారమ్ముల నిఘాతబాణమ్ముల పరిష్వంగ
మ్ముల నఖక్షత సంచయమ్ముల, బహువిధబంధ ప్రయోగంబులం బెనఁబడి
మదోద్రేకమ్మున, వీడె ముబ్బున నొడలెఱుంగక, చంపకపుష్ప కుంకుమ
పంకమ్ముల శరీరములు జొబ్బిల్ల, గంధవాహమొదవెడ పైఁ జల్లుకొనుచుఁ
బర్యంక తలంబుయ్యేలలూఁగ, సకినలు పవళిసేయుఁ, బాష్పమ్ములబడి ఘనతనకట
నంబుఁజేసి పరిశ్రమంబున నిట్టూర్పు నిగుడించుచు, ఘర్మకణమ్ములు గవాక్ష
రంధ్ర నిర్గత మందపవనంబువలనఁ బోఁడుచు సంతోషించుచు మహోత్సాహం
బులం జెలువొందియున్న సమయమ్మున,—— 100

గీ॥ జారభామిని పాదమ్ము జారి మంచ
తలముక్రింద నణంగిన ధవునిఁదాఁక,
నపుడు రథకారుఁడని హృదయమున నెఱిఁగి,
చేటు వాటిల్లెనని చింత సేయఁదొడఁగె॥ 101

కం॥ ఆలోపల జారుఁడు నీ
లాలక! నాయందో, ధవునియందో, నీకున్
మే లెపుడుఁ జెప్పుమన్ననుఁ,
గాలోచిత మెఱిఁగి పలికెఁ గడునేర్పమరన్॥ 102

చం॥ పతి పరికింప దైవ, మతిపాపము లొక్కటఁ బొందు జార సం
గతినని ధైర్యసంపదలఁ గాదె! తృణక్రియ ప్రాణముల్ తుదిన్
జతురతతోడ నంగనలు నాథులఁగూర్తురు, సర్వలోక సం
గతముగ, నంచుఁజెప్పి మఱి మానిని యిట్లను వానితోడుతన్. 103

భార్యకొసఁగిన, నదియును బ్రతిదినంబు
మైత్రిఁ బోషించెఁ దనకన్న పుత్రికరణి. 108

ఆ॥ వె॥ అబ్జరేఖవోలె ననుదినమ్మును వర్ధ
[మాన] యగుచునుండె మౌని [యపుడు]
తగిన వరుఁడు వలయుఁ దన కన్యకని చండ
కిరణుఁ దలఁప నాతఁడరుగుదెంచె. 109

సీ॥ అప్పుడు ఋషి పంకజాప్తునిఁ బొడగని
యీ కన్యకఁ బరిగ్రహింపుమనఁగ,
బలియుఁడు నాకంటెఁ బర్జన్యుఁడన, విని
తలఁచిన నాతఁడు నిలిచె నెదుట,
నతనిఁ జేకొమ్మన్న, నధికుండు పవమానుఁ
డనిన నాతనిఁ బిల్చి యడుగుటయును,
నద్రులు కడునెక్కుడని చెప్ప, [నద్రులఁ
బిలిచి] గైకొనుడన్నఁ బ్రీతినవియు,

ఆ॥ వె॥ మూషికప్రభుండు మొదలి శూరుండన,
వాని కెలుకనేయ వాఁడు మర్త్య
కన్యనెట్లు పొందఁగా వచ్చునన, ముని
యెలుకఁ జేసె దానిఁ దొలుతయట్ల. 110

వ॥ ఇట్లా ఘనుండు మూషికంగా జేసి మూషికవిభున కొసంగె నట్లు గావున నెవ్వరేనియుఁ ఏమతమ జాతిం బొందుదు, రింతియకాని యన్య జాతిం బొందుట దుర్లభంబు. ఈ వెఱ్ఱికాకి యోచిన నెట్లని! చెప్పిన విని, యెన్నెన్ని భంగులనైన నీఘూకపతికి హితం బాచరించెదనని పల్కు, చిరంజీవిం జూచి దివాంధవల్లభుండిట్లనియె,— 111

కం॥ వలసినతఱి నాహారం
బుల నొందుచు, నీ గృహంబుపోలిక నతిని
ర్మల బుద్ధి నుండుమని తనుఁ
బలికిన, ముదమంది కాకపతి సచివుండున్. 112

గీ॥ అవ్విధమ్మునఁ గడిపోతు నట్లు గొంత
కాలమందుండి నిజపతి కార్యఘటన
కనువు గోరుచునుండె యన్యాభిలాష
లాత్మఁ దలఁపక, యొక్కనాఁడతఁడు పిలచె. 113

చం॥ అనువగు నప్పుడేచి యభియాతులఁ గాల్చుట నీతిమార్గ మె
వ్వనికిని, ఘూకసంతతి దివంబున నిద్దురనొందె, నీ గుహన్
ఘనతరవహ్ని చే నిపుడు గాల్పఁగ నచ్చు నటంచు మేఘవ
ర్ణునికడ కేగ, నాతఁడు వసుం బ్రియమారఁగఁ జేసి కౌఁగిటన్. 114

వ॥ అప్పుడతికుతూహలమ్మున నతనితో సంభాషించి చిరంజీవీ! నీవుపోయిన కార్యంబేమయ్యె! నచటి వృత్తాంతం బెఱింగింపుమనిన నతం డిట్లనియె. నాపోయిన కార్యమ్ము నీకుఁ జెప్పెద. తడవునేయ నిది సమయంబుగాదు తర్వాత నెఱింగించెద, నరి సమయుటకు నెడరుగని వచ్చిన వాఁడఁ దామసింపం జెల్లదు. మీరందఱు గూడుకొని బహుకాష్ఠ సంచయంబులు గైకొని జవంబునం జనుదెంచుట కర్తవ్యం, బేనును ననలమ్ము గొని చనుదెంచెద నని సకలకాకంబులఁ జేకూర్చుకొని యింధనాగ్నులు సంగ్రహించి ఘూకమ్ముల మూఁకయున్న గుహాముఖంబు డాయంజని వేగం బకదిసి,— 115

కం॥ పెట్టిరి కాష్ఠమ్ముల, పైఁ
బెట్టిరి యనలమ్ము, నపుడు భీకరకీలల్
దట్టంబై తముఁ జుట్టినఁ
బట్టపగలు గూబలెల్ల భస్మంబయ్యెన్. 116

ఆ॥ వె॥ అపుడు మేఘవర్ణుఁ డతిమోదమునఁ జిరం
జీవి నూచి, యెట్లు సెప్పుమ! శత్రు
సంచయమ్ము నడుమ సాహ్వాదమొప్పారఁ
బరగనుంటివనినఁ బలికె నతఁడు. 117

సీ॥ కంకుఁడై [యుండఁడే] కౌరార్యధిపై ధర్మ
జుఁడు భీముఁడుండఁడె సూపకారుఁ

స్థలభుజంగామికి? నొక్కనాఁడు గతిమందంబైన, మన్మానసం
బలరంజేయవు నేఁడు శీఘ్రగతిచే నన్నున్, బ్రియంబొప్పఁగన్. 127

కం॥ నాకాహారము లేచన,
భేకంబులఁ గొన్ని దినుము ప్రియమునసన్నున్
గాకోదరమ్ము వానిం
జేకొని భక్షించె నతఁడు సెప్పినమాడ్కిన్. 128

వ॥ అప్పుడా జలపాదుం జూచి భవదనుజ్ఞఁ జేసి మదోభగమ్ము పోషింపంబడియె, నీవు విఖ్యాతచారిత్రుండవు. నీవిడిన యాహారం బగుటం జేసి విప్రశాపంబు నన్నేమియుం జేయలేదు, నీ నిమిత్తంబునఁ గృతార్థుండ నైతినని చెప్పి, నిజగతి విశేషంబుల నమ్మండూకపతి మూర్ధంబుమీఁదం జిందులాడ, నతండు మెచ్చుచుండఁ గ్రమక్రమంబున నా కప్పల నన్నిఁటిని మెక్కి యొక్కనాఁడు,— 129

కం॥ తలపోసి యబ్భుజంగము
జలపాదుని మ్రింగి యస్య సంసిక్తేగన్
వలయునని, యప్పుడు మెల్లన
పలుకఁగ విని యాతఁడేమి భావించి తనన్. 130

కం॥ పుడమిన్ విప్రుని శాపముఁ
గడచితి మండూకముండఁగా నంచును నే
నుడుగుల నుడుగకయున్నా
నడరఁగనని, మఱియుఁ జెప్ప నాతఁడు మదిలోన్. 131

వ॥ నిశ్వసించియుండ నతని భక్షించి చనియెం గావున, బహూపాయమ్ముల శత్రు నిశ్శేషంబు సేయుట నీతిమార్గంబని యెఱింగించి, చిరంజీవి యో దేవా! భాగ్యసంపన్నుండ వఖిలవిభవమ్ములు నిన్నుం బొందెనని వెండియు నిట్లనియె. 132

సీ॥ విద్వత్కవులయందు విశ్రాణంబును,
ప్రత్యర్థి విభులందు బాహుబలము,
శరణాగతులయందుఁ గరుణాకటాక్షంబు,
నృపకార్యములయందు నీతి గరిమ,

బంధుసంతతియందుఁ బరమ సంతోషమ్ము,
నాశ్రితులందుఁ బాయని తలంపు,
ధర్మ మార్గమునందుఁ దగిలిన చిత్తమ్ము,
సత్య వాక్యములందుఁ జతురతయును,
గలిగి యెవ్వాఁడు మెలఁగు జగత్త్రయమున
నతని కీర్తులు లుబ్ధమోహాంధ తమస
పటల మణఁగింపఁ జంద్రికా ప్రభలయట్లు.
లలిత గుణధుర్య! విఠ్ఠయ లక్ష్మణార్య! 133

వ॥ అని యివ్విధంబునఁ జిరంజీవి తమపతియగు మేఘవర్ణునిఁ బ్రహృష్ట
చిత్తునింజేసెనని నరేంద్రనందనులకు విష్ణుశర్మ యెఱింగించెనంత. 134

శా॥ శేషాద్రీశ్వర పాదపద్మయుగళీ చింతారత స్వాంత! వి
ద్వేషామాత్య జనాభివర్ణిత యశోవిఖ్యాత! నానా కళా
భాషావల్లభ! నీతి శాస్త్ర పఠనాప్రావీణ్య! చంచద్వయో
యోషా నూతన మీనకేతన! నృపోద్యోగానవద్య ప్రియా! 135

కం॥ చందన హరిహయహరి హర
కుందేందు సమాన కీర్తిగోచర! [శిష్టా]
నందకర! రుక్మమాంబా
నందన! [శిబిఖ] చరవితరణ ప్రఖ్యాతా! 136

కవిజలరుహ మిత్రా! కంతు సంకాశగాత్రా!
నవ వితరణశాగీ! నాకపాభోగభోగీ!
ప్రవిమలతర కీర్తీ! బంధు సమ్మోదవర్తీ!
భువనహిత చరిత్రా! పూరుషోద్యత్పవిత్రా! 137

ఇది శ్రీ భారతీ వరప్రసాద లబ్ధ విద్యా విచిత్ర, తిప్పన మంత్రి
పుత్ర, సుజన విధేయ, భానయనామధేయ ప్రణీతంబైన
పంచతంత్రి యను మహా ప్రబంధమ్మునందుఁ
తృతీయాశ్వాసము.



# చతుర్థాశ్వాసము

శ్రీ నిలయ కటాక్ష! కులో
ద్యాన నవవసంత! సంతతానంద! మరు
ద్ధేను నిభదాన గుణ! ల
క్ష్మీ నారాయణ! మనోజ్ఞ కీర్తి ప్రసరా! 1

వ॥ లబ్ధనాశంబను చతుర్థతంత్రం బాకర్ణింపుము 2

కం॥ తనుఁ బొందిన యర్థము సాం
త్వనపున్ వచనములచే వదలు నేవాఁడే
ని, నతండు మోసపుచ్చఁబ
డును నక్రవిభుండు మర్కటునిచేఁ బోలెన్. 3

గీ॥ అన నితాంత కౌతుకాయత్త చిత్తులై
యక్కుమారకులు ప్రియంబుతోడ
నతనిఁ జూచి పల్కిరనఘాత్మ! మాకిది
చెవుల పండువౌదవఁ జెప్పవలయు. 4

వ॥ అనిన మహాత్ముండగు నా విష్ణుశర్మ యిట్లని చెప్పందొడంగె. మున్ను పుడిసిఁటంబట్టి మ్రింగిననాఁటి బన్నంబు వాపుకొనుట కొఱకుఁ గుంభ సంభవు నొడిసి పట్టి కొన, దిశాభాగమ్ముల వెదుకఁజూచు బాహుదండమ్ము లన గంధవహప్రేరితంబులై యొండొండ సముద్దండ వేగమ్ములై చను దెంచు నిడుద తరంగములును, చండకిరణ పరితాపంబున నభోమార్గంబునఁ బ్రకాశిం పక శీతల జలక్రీడా వినోదంబులఁద్రుళ్ళింతలిడు తారకంబులన నంతకంతయు నెగయు నంబుకణజాలమ్ములును, *సవన పవనభుగ్వ్యక్తి విరాజితంబగు మందర మహీధర భ్రమణ భారమ్ము వలన, మహాయాసంబు నిండిన వృద్ధశ్రవు నిట్టూర్పుల వలనం బొడమె నన, వెడవెడ దిగ్భ్రమణం బాచరించు నావర్తంబు లును, నిజాంతర్గత విజృంభమాణ బాడబశిఖి శిఖాభయోపప్లవంబు చేతం బెగ్గిలి కూయిడు నఖిల జంతు నివహంబన నితాంత బధిరీభూత రోదోంత రంబులగు నతిభయంకర నిర్ఘోషంబులును, నఖిల జగదధీశ్వర మహనీయకీర్తి

* "సవనవన" అని మూలము.

పుంజంబులు తన యొడలం జల్లిన విధంబున మహాసిత హారిహారి హాలధర హీరహార హారికర్పూరమృత బుకు మరున్న దీక్షాతాబ్జ —— —— శారద నీరద నారదపారద హిమవత్కైలాస శశికరపాండురంబులగు డిండీరషండంబులును, గలిగి యతి మనోహరంబై పుండరీకాక్షు జఠరంబునుంబోలె భువన పూర్ణంబై, వారవధూని కేతనంబుంబోలెఁ బ్రబల భుజంగ సంకీర్ణంబై, మధ్యమ లోకంబునుంబోలె ననేక భూభృత్సంకులంబై గ్రహమండలంబునుబోలె మీనమిథున కర్కట భాసురంబై, నాకంబుసుంబోలె దివ్య వాహినీ సమాశ్రయంబై, పొలుపొందు నజ్జలధి వేలాసమీపంబున,—— 5

చం॥ కలదొక మేడి మ్రాను మధు గర్భమనన్, దనయందు జంతు భృ
త్ఫలములు విష్ణు దేహమునఁ బద్మభవాండములట్ల పుట్టువున్,
నిలుకడ, చేటు, నొంద ధరణిన్ గతుకారణమై ద్విజ వ్రజం
బులకు నభీష్టదంబయి నభోమణి చుంబిత దీర్ఘశాఖమై॥ 6

కం॥ ఆ తరువున వానర సంఘాతముతో నొక్కవృద్ధ కపిపతి వినయో
పేతుడు బలవర్ధాఖ్యాఖ్యాతుఁడు విహరింపుచుండుఁగౌతుక మొదవన్ 7

వ॥ తత్కపివరుండును నితాంత మధురంబులగు నౌదుంబర ఫలమ్ము లనుభవింపుచు నుండు, నొక్కనాఁడు నిజశయన తలమ్మున నొక్క మేఁడి పండు పడి నిలువక యహాపారవనమ్ముల నిర్ఘోషమ్ము వాడమం బడియె నయ్యెడ,—— 8

మహాస్రగ్ధర॥ పటువాల క్షేప జంఝా పవన వశమునన్ భైరవావర్తముల్ ప్ర
స్ఫుటముల్గా, బుద్బుదంబుల్ భుగభుగనినదోద్భూతముల్గా, విశాలో
ద్భట వీచుల్ ఖండముల్గా, బహూతర మకరాధ్యక్షుఁ డేతెంచె, గంగా
తటినీశాంతర్గతుండై తనరు జవమునన్ దద్ధ్వనిన్ విన్నమాత్రన్॥ 9

వ॥ ఏతెంచి శింశుమారాభి ధానుండగు తద్గ్రాహాధిపతి యుద్య దరుణ మండలం బాగ్రహంబునం గ్రహించు రాహుగ్రహంబన నౌదుంబర ఫలమ్ము చేకొని భక్షించి పునః ఫలాహార మనోరథమ్ముల నచ్చట నుండఁ గతి పయదినమ్ములు చనియె నంత,—— 10

కం॥ బలవర్ధుఁడు తన తోడుతఁ
జెలిమి మనః ప్రియము వొడమఁ జేసియొడనెటన్

ఫలములు రాల్పఁగఁ దిని నిజ
కులకాంతను మఱచి నక్ర కుంజరుఁడుండన్ 11

ఉ॥ ఆ మకరేంద్రు భార్య విరహానల తప్తశరీరయై, నిజ
స్వామి విధంబెఱింగి నిముసమ్మున నమ్మని దూతి నంప, ను
ద్దామజవమ్మునం జని ముదమ్మున వానరమైత్రి చేత. ని
ష్కామతనున్న వానిఁగని, క్రమ్మఱ నాయకతోడ నిట్లనున్॥ 12

గీ॥ శింశుమారుండు వానరస్త్రీల తోడ
మైత్రి యొనరించి యన్యమ్ము మఱచి కేళి
సేయఁ దొడఁగిన వాఁడని చెప్పి దూతి
మిన్నకుండెను, నక్రభామిని తలంక, 13

వ॥ అంతఁ బురుష వియోగంబున నక్రభామిని హృదయమ్ములో మద
నాగ్ని ప్రజ్వరిల్లి కాల్పం బొగలెగయ, మనంబను పరమ సఖుండు వెలికిం దెచ్చెనన, వేఁడి నిట్టూర్పు గాడ్పున నధర పల్లవంబు గంద, నాక్రోశిత భర్తృక యగు మకర వధూటి వెండియుం దనచేడియం బనిచిన నదియును శింశు మారు సమ్ముఖమ్మునకుంజని సతి వాక్యమ్ములు పతికెఱిగించిన, నతఁడును పెద్దకాలమ్మునకుఁ గుటుంబిని యొద్దకుఁ బోవువాఁడై తన ప్రాణ సఖుండగు బల వర్ధనున కెఱింగించి యతనిచేత నామంత్రితుండై మధురమ్ములగు నౌదుంబర ఫలమ్ములు సంగ్రహించుకొని వచ్చు నవసరమ్మున,— 14

సీ॥ దవ్వుదవ్వున వచ్చు తన జీవితేశ్వరు
నది సూచి మిథ్యాఒమయంబు దనకుఁ
గల్పించుకొని సఖీగణము విన్నదనమ్ము
దాల్చి సేవింపంగ దంభవృత్తిఁ
నొడలెఱుంగని రీతినున్న కుటుంబినిఁ;
బొడగాంచి పరవశంబునఁ బ్రగాఢ
సంశ్లేష మొనరించి సర్వాంగకమ్ములు
పుణికి మనోజాగ్నిఁ బొరల నపుడు
దుఃఖవారిధి వీచులఁదొట్రువడుచుఁ
గన్ను దోవలనుగడు నశ్రుకణములురుల

నధికమగు చింత మనమంత నలిమికొనఁగ
గ్రాహ ముఖ్యుండు గద్గదకంఠుఁ డగుచు॥ 15

ఉ॥ ఈ దురవస్థ నొందుటకు నేమి కతంబని తత్సఖీతతిన్
సాదర మొప్పఁబల్కఁగ, నసాధ్యతదోఁపగ దీనిఁ*[దీర్పఁ]గా?
రాదన, నక్రవల్లభుఁడు ప్రాణము లైనఁ దృణమ్ము లట్ల నిః
ఖేదముతోడ నిత్తు సతికింపగ దేహగుణమ్ము చేసినన్॥ 16

వ॥ అని వివర్ణవదనుండై పలవించుచుండ, నంత పతి మనః ప్రియం
బెఱింగి పరిచారికాజనం బిట్లనియె. ఎందేనియు స్కెక్కబొహోటశాస్త్ర పారంగ
తుండగు చికిత్సకుండేతెంచి భవత్కళత్రంబు కరంబుపట్టి చూచి నిదా
నించి యిట్లనియె,— 17

కం॥ ఈ నీచ రోగ మరయ, న
హీన విషము మాడ్కి నెక్కు, నెచ్చటనయినన్
వానర హృదయము దొరకిన
మానుననుచుఁ జెప్పెననియె మకరాధిపతీ!

వ॥ అని చెప్పిన సఖీజనమ్ము పలుకులు విని యతఁడు తన హృద
యంబున ——— ———గా దలంచె,— 18

కం॥ అపగత సుకృతులు నొకనికి
నెపమిడి యందఱును గూడి నెఱిఁబన్నిన పా
పపు దలఁపు ఘనులకైనను,
కపటంబని తెలియరాదు కరణి లక్ష్మా! 19

ఉ॥ భానుఁడు శీతభానుఁడన, పట్టపగల్ నడురేయటన్న, సు
జ్ఞానుల చంచలాత్ములన, సత్యముగల్లయటన్న, నట్లనై
కానబడున్ మనోజశర [గాహిత చిత్తులకున్] దలంప భా
మాని కరమ్ము చేత, గుణమండన! విద్యయలక్ష్మ ధీమణి! 20

ఇంద్రవజ్రము॥ ఆనక్రముఖ్యుండపు డాత్మలోనన్
దానెంచి చింతింపుచు ధర్మమెల్లన్

* "కూఁత గా" అని మాతృక.

బోనాడిమిత్రుం గపి పుంగవుం జే
సైతె, నేఁడు హింసింతు నటం చు నెంచెన్ 21

వ॥ వెండియుఁ దనమనంబున నిట్లని వితర్కించె. 22

కం॥ బలవర్ధనుఁడు నాతోడన్
ఫలరహితుండగుచుఁ జెలిమిసారెకుఁ జేయున్
గలుషమతినయ్యె నాతనిఁ
బలుకణఁచెదనంచుఁ దలఁచి పాపుఁడనై తిన్॥ 23

వ॥ అని వివేచించుకయుండం గ్రమ్మఱభార్యపై మోహమ్ముడగ్గఱిన, 24

సీ॥ ఊహింపమిత్ర సందోహమ్మునకు, నారఁ
బండిన సస్యమ్ము, బాంధవులకుఁ
గనుపండు వానరించుఁ గల్ప మహీజంబు,
వంశ హేమమునకు వన్నె, గేహ
లక్ష్మికి నెంతయు లాలితంబగు భూష
ణంబు, వయ స్యాజనంబులకును
దంగేటిజున్ను, బాంధవుల పాలిఁటికిని
ఫలియించు మించుతపః ఫలమ్ము

గాన, గుణమణి పూర్ణసాగర మనంగఁ
దగుకళత్రంబు, కరుణచే ధనమునట్లు
వసుమతీస్థలిఁ బాలింపవలసియుండు
లక్షణోపేంద్ర! విత్తయలక్ష్మి చంద్ర! 25

వ॥ అని తన హృదయమ్మున వినిశ్చయంబు చేసికొని బలవర్ధన హృదయార్థియై దయాశూన్యుండగుచు శింశుమారుండు వానర హృదయమ్ము దెచ్చెదనని సఖీజనమ్మునకుం జెప్పి యంపించుక మంద మంద గమనమ్మున నౌదుంబర తరు సమీపమ్మునకు వచ్చునపుడు. 26

గీ॥ వానర వరేణ్యుఁడప్పుడు వానిఁజూచి
యొయ్యనొయ్యనఁ జనుదెంచుచున్న వాఁడ
వేమి యనవుడుఁ గైతవ మెఱుకపడక
యుండ, మృదువాక్యములఁ బల్కె నొప్పుమిగుల॥

ఉ॥ ఆరయ నెవ్వరైన నొక యర్థవశమ్మునఁ జెల్మి సేతు, రిం
పారఁగ, నిష్ప్రయోజనుఁడవై కపిపుంగవ! నీవు నాయెడన్
గారవమొప్ప మైత్రి బహుకాలము సల్పితి, విక్రమంబునన్
నీరమణీయ ధర్మ మవనిం బొగడొందదె! సజ్జనాళిచేన్ 28

వ॥ కావున నీతోడి సఖ్యంబేనుజేసి పెద్దకాలంబాయె, నీ పుణ్యమ్మున మధురమ్ములగు నౌదుంబరఫలమ్ములు మెక్కి సుఖంబున్నవాఁడ, మున్ను నీ కెఱింగించి యేను మన్నిలయంబునకుం జను సమయంబున నా భార్య శరీరంబునకు వ్యాధివొడంగి దుర్బలయై పడియున్నం జూచి, నీ సముఖంబున కేతెంచినవాఁడ, నిట్టి యార్తిచేతంబడిన నాకు నీవుదప్పఁ బరమబంధుండు లేఁడు, నా భార్యను నాయంపలిలక్ష్మిని నీక్షింపకున్న, మత్సంతోషంబు నిష్ఫలంబు. 29

కం॥ తన లక్ష్మి దలఁప శాత్రవ
జనమున కతిభీతి, బంధుసమితికి సత్యం
బును ప్రీతిగాఁ, జరించుట
ఘనునకు నిదిభూషణంబు గరణిక లక్ష్మీ! 30

వ॥ అదిగావున నీవును మత్ప్రాణ సఖుండవగుటంజేసి మన్నిలయంబునకు రావలయు. మామక చరమభాగావరూఢుండవై చనుదెమ్మన, నక్కీశవరుండును నతికుతూహల మానసుండై యట్లకావించె, నంతం గ్రూరమానసుండగు నక్రవిభుండును వానరుని వీఁపెక్కించి సరిత్పతి జలమ్ములందేలి చనుచు, మిత్రవధాభిలాషంబు తన మనంబునం బొడమి హృదయంబు గలంచినం, గించిద్విషాదంబున మెల్లనఁ దనలో నిట్లనియె— 31

ఉ॥ అక్కట! ప్రాణమిత్రునిటు నాలికినై దయలేక మిక్కిలిన్
మక్కువవోలెఁ దీపియగు మాటల తేటల మోసపుచ్చితిన్
దిక్కుల నుగ్రకర్మమగు తెంపునఁ నే డపకీర్తి నొందితిన్,
నిక్కము బుద్ధిలేక యని నెవ్వగఁజెంది, యతండు వెండియున్. 32

ఉ॥ అంబుధి నిమ్నతాగుణము, నభ్రమహోన్నతి *[యెన్మిదాది] శాం
తంబుల భూవిశాలతయుఁ, దథ్యముగా నెఱుఁగంగ వచ్చినన్

* "యేనుయొన్మి" అని మూలము.

శంబరవైరి *[తప్పులకుఁ] జేమలకై తప గుప్తమైన భా
వంబు లెఱుంగరాదు గురువైభవ! విశ్వయ లక్ష్మ ధీమణీ! 33

వ॥ ఏతద్వృత్తాంతం బెఱింగియు నెఱుఁగనేరక ప్రాణపదంబైన మిత్రుసం బొలియింపఁ బూనితినను పలుకులు నించుకించుక వినంబడిన, నక్రపతి వీఁపుపైఁ బోవృష్టవగవరుండును భయమ్మునొంది చేయునదిలేక విషణ్ణచిత్తుండై కట కటా! నా బుద్ధికి మోసంబాయెఁ దరుచరులకు శరచరులకు నెక్కడనైన స్నేహమ్ము సంఘటిల్లునె! కుడిచి కూర్చుండి యీ దుర్బుద్ధివెంట నీ విష మధ్యంబున కేలయే తెంచితి! నని పశ్చాత్తాపంబునొంది శింశుమారా! యింత పర్యంతమున్న నేబుద్ధి తలపోసితివని యడిగిన, నతండు కపటోపాయమ్మున నెఱింగింపకున్న, వానరుండు తన హృదయంబునఁ బెట్టుకలఁగి,— 34

గీ॥ వీని హృదయంబు బుద్ధి వివేకముననె
యెఱిఁగి కొనియెద, నీతని లెఱుఁగు మిగులఁ
గైతవనిగూఢమై నాకుఁ గానవచ్చెఁ
జెంతనాడిన పలుకులు చెప్పకున్న. 35

కం॥ అని నక్రవిభునితో ని
ట్లను, మిత్ర! భవత్కళత్ర మచ్చటఁ గుశలం
బున నున్నదె! యన నాతం
డను నెక్కడి కుశలమని నయంబున మఱియున్. 36

సీ॥ గదముచేమిగుల నంగదనొందియున్నది
మాంత్రికు వైద్యులు మాన్పనోప,
రననొకించుక శంక, నా, పలీ ముఖసుఖుఁ
డిప్పుడు కర్తవ్య మెయ్యదనిన!
మా వారిలో నొక్క మంచి చికిత్సకుం
డే తెంచి యిల్లెల్ల నెఱుఁగఁజెప్పి
యరిగె, వానర హృదయమ్మునఁగాని యీ
మందు లొసంగిన మానదనుచు,
నేఁడు భార్యఁబ్రీతి నీ కతంబున రక్ష
నేయవలయుననిన, స్వీయవధము

* "తోఁపులకు" అని మూలము.

తప్పదకట ముదిసీ ముప్పున నీరీతి
చేటుపొంది తనుచుఁ జింతచేసె, 37

కం॥ అని నక్రమునకుఁ గర్మము
లనుభవహేతువులు బ్రహ్మకైనను హృదయం
బున చింతారహితుండై
ఘనమగు మతిఁగెల్చి మెలఁగఁగావలయు నిలన్॥ 38

వ॥ అని [పలికి] యిన్నిచుండి కార్యమ్ము మన్నివాసంబు— రాక తొలంగదు మన్నిలయంబు చూడ నమ్మని నన్ను నమ్మించి తెచ్చి యీ నట్టేటం బుట్టిముంచె వీని మధురవాక్యమ్ములకుఁ జెవిఁదోరగిలఁ బెట్టిన నా యంత వెఱ్ఱి లోకమ్మునంగలండె! యింత పర్యంతమ్మును సమస్తవానరులు గొలువ నౌదుంబరసింహాసనమ్మునం బేరోలగమ్ముండి కడపట నీ నీచు, మొసలిచేత వృథానిమిత్తంబునం బట్టువడితినని చింతాక్రాంతుండై దుఃఖించి వెండియు ధైర్యం బవలంబించి యొక్కసంభ్రమంబు గల్పించుకొని మిత్రుఁడ వగు భవత్కళత్రంబు బ్రతుకుట సంతసంబుగాదె! యిక్కార్యంబు మున్నె ఱింగింపవైతివి, మదీయంబగు హృదయంబు నౌదుంబర భూరుహమ్మునఁ బదిలమ్ము చేసియున్నయది. మనమిద్దఱమును మగిడిచని తదౌషధమ్ము గొనివచ్చుట కర్తవ్యంబని వెండియు నతం డిట్లనియె,— 39

కం॥ కుటశాఖాగ్రములన మ
ర్కట హృదయములుండు, నంగకంబులు వేఱె
చ్చటనైనఁ, దెలియుమన, న
క్కుటిలమతియుఁ బల్కె నక్రకుంజరుఁడంతన్. 40

గీ॥ మర్కటాగ్రణి! యా మేడిమ్రానిమీఁది
హృదయమిప్పుడు గొని వేగమేగుదెమ్ము
వేడ్క మన్మనోరథము గావింపు, మగిడి
పోదమని వానిఁ దోడ్కొని పోవునంత. 41

వ॥ ప్లవగవరుండును, భయసంభ్రమంబులు మనంబునం బెనఁగొన మగిడిపోయి యౌషధమ్ము దెత్తమని యతనికి బోధించి యతని యంసం బెక్కి సాగరతీరమ్మున కేతెంచి యచటినుండి భూమిపైకి లంఘించి గ్రక్కున

నత్తరువెక్కి మానసమ్ము డిందుపఱచుకొని పుత్రమిత్ర కళత్ర భృత్యామా త్యులం గనుంగొని, నేఁడు నా చావుదప్పె, నేఁజేసిన భాగ్యవశంబున మిమ్ముం దఱం గ్రమ్మఱం జూడఁగంటినని వారలకుం జెప్పి, భూజమూలమ్మున నున్న నక్రేశ్వరుం జూచి శింశుమారా! నాగుండియ యీ తరుశాఖాగ్రమ్మున నున్నది నీవెక్కి తెచ్చుకొమ్మని పకపక నగి హాస్యమ్ము చేసి యిట్లనియె,— 42

కం॥ హృదయము కర్ణంబయ్యెను,
మద మణఁగిన ఖరముగాను మకరాధిప! నే
ర్పొదవ విడివడియుఁ గ్రమ్మఱ
మది వొదియుటకనిన, శింశుమారుండనియెన్॥ 43

వ॥ నాకైతవం బెఱింగి వెద్దువెట్టి తిరిగితివి నీయంత నేర్పరి భూలో కమ్మునం గలఁడె! అయినను మేలుదలంచిన వానిమీఁదం గీడు దలంచినఁ దుదకెక్కునె! కృతఘ్నుండనని, వెండియు నిట్లనియె,— 44

గీ॥ కలుషమతినైన నాకు నీ కథ యెఱుంగఁ
జెప్పి సంతోష చిత్తుగాఁ జేయుమనినఁ
బ్లవగ ముఖ్యుండు రోషమ్ము వాసి యప్పు
డతని వదనమ్ముఁజూచి యిట్లనుచుఁ బలికె॥ 45

సీ॥ మున్నొక్క కాననంబున మృగేంద్రుండు గో
మాయు ప్రభుం డాత్మమంత్రిగాఁగఁ
జరియించు నపుడు కుంజర మాంసతుందిలం
బగు మేన నొక్క నాఁడతఁడు కుక్షి
రోగియై సచివవరునిఁ జూచి యో భద్ర!
రాసభ హృదయ కర్ణములు గలుగ,
నిలుచుఁ జేతనములు, దలపోయ, లేకున్న,
వశముగాదని పల్క, వాఁడు సూచి

అధిప! యెచ్చోట నుండిననైన వెదకి
తీపు మాటలఁ దేలించి తెత్తుమీకుఁ
బ్రియము సొంపార నని చెప్పి, నయముతోడఁ
బాసి చని యొక్క పట్టణ ప్రాంతమునను 46

మ॥ వెనువెంటన్ రజకుండు మందగతుఁడై వేమాఱు దోలం గమా
సిన చీర ల్దన వీఁపుబంటి పయివాసిన్మ్రోంచు పెన్వావిరయో!
యనఁ గాన్పింపఁగ, నొక్క గార్ధభము దుఃఖావేశ భావంబునన్
జనుదేరం గని, జంబుకాధిపతి యుత్సాహమ్ముతో న త్తఱిన్, 47

కం॥ తన భాషా చాతుర్యం
బునఁ దన్మతి గలఁచి సింహముఖ్యుని కొప్పిం
చిన, నాతఁడు బలురోగం
బున భీషణమైన లావు వోవుట చేతన్, 48

వ॥ పాపభీతింబోలె నంగకమ్ములు వణఁక, నుపాయ హీనంబగు సంభ్రమంబున భక్షింపం జూచిన, నాకీలెఱిఁగి యా గాడిద పాఱిపోయిన, మృగేంద్రుఁడు జంబుక ప్రవరుం గ్రమ్మఱఁజూచి యిది విధివశంబున రాసభంబు నాకు సిద్ధింపక, పోయిన పోకయై పోయెననిన, నతండిట్లనియె,— 49

మత్తకోకిల॥ చింతయేటికి నీ మనమ్మున సింహసత్తమ! భీతి వి
భ్రాంతి నుద్ధతిఁ బాఱినట్టి ఖరంబుఁ దెచ్చెద, నన్ను ధీ
మంతుఁగాఁ దలపోయుమంచు, నమాత్యుఁడప్పుడు దుష్కృత
స్వాంతుఁడై చని, దానిఁగాంచి వచః ప్రియంబున నిట్లనున్ 50

కం॥ ఈ రజకు నంశుకమ్ముల
భారధురంధరత కంటెఁ బరికింపఁగ, న
ల్పారంభమె! మృగ వంశో
ద్ధారకు సేవయని, మఱియతఁడు నిష్ఠురతన్॥ 51

గీ॥ గార్ధభత్వము నీ మదిఁ గానబడియె
దైవ మీనేర్పుఁగాక సంతసము, తల్లొ
గుడువ నేర్పునె! యకట చేజాఱినట్టి
భాగ్య సంపద నేరమిఁ బాసికొంటి॥ 52

వ॥ మృగరాజు సమ్ముఖమ్మున వనంబులో నీవును మద్విధంబున నతనికి మంత్రివై యిచ్ఛా వ్యవహారమ్ములఁ బరితుష్టిం బొందక, సమస్త జనమ్ముల మలిన వస్త్రమ్ములు మోవ, నీకుఁ బ్రియంబై నిష్కారణంబ మొగిడి చనుదెంచు

టకు గతంబెయ్యది? మందబుద్ధీ! నా కెఱింగింపుమనిన నా గార్ధభం బిట్లనియె,— 53

కం॥ మృగరాజు నన్ను భక్షిం
పు గతిన్ డాసినను, బారిపోయితిననినన్,
మృగధూర్తకపుంగవుఁ డో
ప్పగ, దానింబోలఁ జూచి పొందుగఁ బలికెన్॥ 54

వ॥ గార్ధభేశ్వరా! మృగరాజు సన్నిధిని నీ గుణమ్ములు ఘనమ్ములుగా నే వర్ణించిన, నమ్మహాత్ముండు ప్రియ పూర్వకంబుగా నిన్ను నాలింగనంబు సేయ డగ్గఱిన, నది నీ కవిరోధియని యెఱుఁగ నేరక, పారి వచ్చితివి. నష్టైశ్వర్యంబునకిది గడగుఱుతు గాదే! యని, వెండియు నిట్లనియె,—55

కం॥ ధర మతి మంతులకైనన్
బరికింప శుభమ్ములందు బహు విఘ్నంబుల్
పొరయున్, దత్ప్రారంభము
కరము వెలయఁ జేయవలయుఁ, గరణిక లక్ష్మా! 56

కం॥ అనిన మదిఁబొంగిరాసభ
మనఘా!, నీ వెంట వత్తుననిన, నతఁడు ద
మ్మని వెసఁదోడ్కొని తనదు వి
భుని సాన్నిధ్యంబుఁ జేర్చె, బుద్ధి నిపుణతన్ 57

వ॥ అయ్యవసరమ్మునం దనకోర్కె సఫలమ్ముఁ జేసిన జంబుకనాథుం గౌఁగిలించుక యతని వాచాస్ఫూర్తికి మెచ్చి రాసభంబును దగ్గఱం బిలిచి పంచత్వమ్ము నొందించి, జంబుకవరుం జూచి నిత్యకర్మం బాచరించి వచ్చి యథాపథమ్ము సేవించెద, నే వచ్చునంతకు నీ ఖరశవంబు పదిలంబని చెప్పి చనునంత,— 58

గీ॥ ఎట్టి యథాపథంబో! యిది మృగేంద్రుని పాలు
సేయ నేలయనుచుఁ, జేరి రాస
భంబు హృదయ కర్ణభక్షణం బొనరించి
యుండె, నెలమి-జంబుకోత్తముండు 59

వ॥ అప్పుడు మృగవిభుం డాచమనంబు సేసి యరుగు దెంచి, గర్దభంబు డగ్గఱి దాని హృదయకర్ణంబులు లేకుండుట వీక్షించి గోమాయువుం జూచి దీని హృదయకర్ణంబులు గానమని యడిగిన, జంబుకం బిట్లనియె,— 60

చం॥ ఖరము మృగేంద్ర వర్య! చవిగల్గిన మత్కపట ప్రభాషలన్,
గరమటు మోనపోవునె! మనమ్మున మిక్కిలి గుండె కల్గినన్,
వరమతి [నిన్ను సేరుటకు] వచ్చునె! యన్న, నతండు చింతతోఁ
బొరలుచునుండ, జంబుకవిభుండును గౌతుకమందె నాత్మలోన్. 61

వ॥ అదిగావున నెఱిఁగి యెఱిఁగి, వెఱ్ఱి ఖరంబుగాను మృతురాకృత పుణ్య ఫలమ్మున నీచేఁ జిక్కి విడివడి బ్రతికితిఁ, గృతఘ్నుండవగు నీతోడి సఖిత్వం బింతియు, చాలు, నిష్కల్మషుండగు వానికి దైవంబు సహాయంబగు నని తన్ను నిందించు వానరేంద్రుం, గని శింశుమారుండు లబ్ధ నాశనంబగు టకు మనమ్మున సంతాపించుచుఁ దనమందిరంబున కరిగెఁ దదనంతరంబున వానర పుత్రుండగు సుశర్మ యను వాఁడేతెంచి, తండ్రికిం బ్రణామం బాచరించి తదను మతంబున శాఖాగ్రంబునఁ గూరుచుండి తన్మంత్రివరులచే శింశుమార వృత్తాంతంబంతయు విని, కోపాటోపంబున జనక విరోధిం బొరిగొనవలయు నని చింతించి తండ్రి కిట్లనియె,— అయ్యా! శింశుమారుండు పాపి వానిం బొరిగొనక యేల పొమ్మంటివి! అపకారికి నుపకారంబును, నుపకారికి నపకారంబునుఁ, జేయుట ధర్మవిరోధంబు. మున్నొక విటుండు వేశ్యం బొరిగొన్న యట్లు, వాని వధింపవలయుననినఁ గుమారునకుఁ దండ్రి యిట్లనియె,— 62

గీ॥ పుత్ర యిట్టి కథయుఁ, బూర్ణమ్ముగా నాకుఁ
దేటపడఁగ నెఱుఁగఁ దెల్పుమనిన,
నతఁడు చెప్పఁదొడఁగె, నాకథావృత్తాంత
మలరి విన్న మోహమావహిల్ల, 63

సీ॥ జనక! చెప్పెద విను చతురాంగి యన నొక్క
వారభామిని మరువారువంబో!
యన నొక్క పట్టణంబున నుండు దానికి
నిద్దురకును నూఱు గద్దెణములు
నిత్తురు పల్లవు, లీయంగఁ దల్లియుఁ
దానును భోగేచ్ఛఁ దగిలియుండ

నొక్క విటుండును నక్కమలాయతా
క్షినిఁ గూడి మోహమ్మ *కొమరుమిగిలి
పగలు రేయను భేదమేర్పరుప లేక
దాని పసలను దగిలి నిత్యంబు నొకఁడు
మదనకదనమ్ము లోపల సదమదముగ
మునిఁగి పోరాడుచుండ, నా మోహనాంగి. 64

వ॥ ఆ భుజంగ పుంగవున కేలుబడినదై యితర విటులనొల్లక, యవ్వేశ్య తనకుఁ గలిగిన సకల పదార్థమ్ములు నతనికి నెదురుపెట్టఁ, దన్మాతయంతయుం గనుంగొని యసహ్యంబునఁ గూఁతున కిట్లనియె,— 65

ఆ॥ వె॥ కొమ్మ! నూఱుమాళ్లు గోరొక్కనాఁటసే
తెచ్చుదాన వీవు తెలివి బెగడి
ముసలి ముండటికిని మొగ్గితివయ్యయో
వీని విడిచి, సుఖము వెలయఁగనుము. 66

వ॥ అని చెప్పిన తల్లిమాటలు కూఁతురు సరకుగొనకయున్నఁ, దదంబ రా పట్టిం జేకొని, దీని వెళ్లఁగొని వీనిం గీటునం బొరిగొనవలయుసని, యుద్యోగించి నట్టినావగ్గు పల్కులా భుజంగుం డాకర్ణించి వేశ్య యెఱుంగకుండ, నొక్క సర్పశవంబుఁ దెచ్చి నిద్రించుచున్న లంజతల్లి వక్త్రరంధ్రమ్ములోఁ దల పెట్టి తద్భాగంబు సాఁగిల విడిచియున్న సమ్మయమ్మున—తదనంతరంబ,— 67

ఆ॥ వె॥ వేశ్య తల్లిఁజూచి వేఁదుఱి విటునితోఁ
బాముగలదటంచుఁ బయిననంగఁ
నతఁడు ముసలమెత్తి యా ముదుసలిఖ్రాఁచ
మొత్తె గ్రుడ్లువెళ్లి ముండ చావ, 68

వ॥ ఇట్లు విరోధియగు వేశ్యాంబను విటుండు వధించి ప్రియురాలిం జూచి సఖీ! సర్పము విదళించితి భవన్మాతయు సర్పమ్ముతోఁ గూడ నిరయమ్మున కరిగెనని చెప్పిన, నా వేశ్యయుఁ బ్రలాపించి భుజంగునిఁ గూడి సుఖంబుండెనని జనకునితో పుత్రుఁడు చెప్పిన విని యా వానరుండిట్లనియె;— 69

* యతి భంగము

గీ॥ పుత్త్రి! యెట్టిదైనఁ బొలుపొంద నేమమ్ముఁ
జేసెనేని యతని వాసి యెఱిఁగి
మనుప లెస్స కీఁడు గనుపించెనేనియుఁ,
జంపవలయు విప్రుఁజోడ, తెలిసి॥ 70

వ॥ అది యెట్లని యడిగిన, బలవర్ధనుండు సుతునకిట్లనియె – మున్నొక పట్టణమ్మున తపోనిధియగు వృద్ధ విప్రుండు గలఁడు. అతండు నిత్యమ్మును కాననమ్మునకుఁ జని, జంబుక షండంబున కాశీర్వాదంబుఁ జేసి, యతితలిడి వచ్చుచుండ నొక్కనాఁడు నక్కలెల్లఁ గూడుక విప్రోత్తమా! నీ యభిలాష యెఱింగింపు మన నతండు తనకొక్క పాఁడిమొదవు గావలెనని విన్నవించిన, [నవియు] నెందేనియు నొక్క యాలమందకుం జని, యొక్క ధేనువుం దెచ్చి విప్రుని కిచ్చిన నతండును సంతోషాతిశయమ్మున నిలయమ్మునకేతెంచి, గోదుగ్ధ పానమ్మున సుఖంబున్న, నక్కడ నొక్కనాఁడు,— 71

కం॥ ధేనువు విడివడి లాయము
లోనికిఁ జని కసవు దినిన, లోఁగక హారి ర
క్షా నిపుణులు బంధించిన,
దాని నెఱిఁగి బ్రాహ్మణుండు ధారుణి పతితోన్, 72

కం॥ చెప్పిన, విడుమని రాజును
నప్పన యిచ్చినను హరుల యధ్యక్షులు నీ
గొప్ప[యగు] తేఁజి [యీనె]ను
జెప్పఁగ నీ మొదవు, ననుచుఁ జెప్పిరి పతితోన్. 73

వ॥ అశ్వ రక్షకుల పలుకు లాలించి, ధరణీధవుండును, విప్రునిఁ బరిహరించిన, నతండును రాజ ద్వారమ్మున నిలువంబడి, నాకు గోమాయువులిచ్చిన యీ గోవును గుఱ్ఱం బీనెననుట, యన్యాయంబని మొఱయిడిన, నచ్చటి ధారలఁట్లని నక్కలం దోడ్కొని వచ్చి, మొదవుం ద్రోలుకొని పొమ్మని పరిహాసమ్ముఁ జేసిన, నా పాఱుండును జంబుకంబు లున్న యెడకుం జని తన వృత్తాంతమ్ముఁ జెప్పిన, నా నక్కలు తమలో నొక్క వృద్ధ గోమాయువు నంపిన బ్రాహ్మణుని వెంట నడి వచ్చి రాజు హజారమ్మునఁ గూర్చున్న యవసరమ్మున,— 74

కం॥ ధరణీ సురుఁడచ్చటి, యా
నరపతి కెఱిఁగింప, నతఁడు నక్కలవన్నీ
స్థిరమతి నేవని! యడిగిన
శరనిధి కాలంగ నార్పఁ జనిరని చెప్పెన్ 75

వ॥ ఇట్లు వృద్ధజంబుకంబు చెప్పిన రాజు విని యెచ్చటనైనను సముద్రంబు గాలం జొచ్చునే! యందులకు నక్కలార్పం జనునేయని నవ్విన, నా గోమాయు వెక్కడనైనను గుఱ్ఱమ్ము లావుల నీనునే! యని ప్రతి వాక్యమ్ము లాడి, నరనాథా! అశ్వరక్షకులు దుర్బుద్ధు లట్టివారల భాషణమ్ములు విని నీవును విప్రుని గోవు నపహరించితి వనిన, విని యా భూపతి యాగ్రహమ్మునఁ దన నగరి జాగిలమ్ములచే జంబుకంబు విదళింపంబంచిన, నదియును నా సన్న, యెఱిఁగి కాననమ్మున కరిగె మఱియును,— 76

కం॥ తదనంతరమున బ్రాహ్మణుఁ
డుదితుండై యావు నడుగ నొప్పక వాని
న్న దయుండై బంధించిన,
మదయుతుఁడై శాపమిచ్చె మహిపతి వాలియన్, 77

ఆ॥ వె॥ మొనసి బ్రహ్మతేజమున రాజు వాలియించి
ప్రజ్వరిల్లుచున్న బ్రాహ్మణునిని,
రాజ మంత్రివరులు రప్పించి విడిపించి,
యావు నిచ్చిపంప, నరిగె నతఁడు 78

వ॥ ఇట్లు విప్రుండు ధేనువుం జేకొని సుఖంబుండెనని బలవర్ధనుండు తన సుతున కెఱింగించిన కథ, విష్ణుశర్మ నృపనందనుల కెఱింగించె నంత,— 79

మ॥ సతత ప్రాభవ, కృష్ణరాయ ధరణీ చక్రేశ కారుణ్య వ
ర్ధిత లక్ష్మీవిల సన్నిశాంత! సకలార్థి వ్రాత సస్యావళీ
హిత హస్తాంబుద! మేరుధీర కుహనా — — —
హతి పద్మాప్త! సమగ్రధీర గుణ విఖ్యాతాఖిలా శాంతరా! 80

కం॥ కమలభవకుల పయోనిధి
సముచిత మాణిక్య! బంధుజన మందార
ద్రుమ! దిగ్భామా [సంతా]
నమనోజ్ఞ యశోదుకూల! నయసంగణనా! 81

స్వాగతము—దానకర్ణ! మురదానవ వైరి
ధ్యానతత్పర! బుధాశ్రయ! మిత్రో
ద్యాన మాధవ! దయాకర [మూర్తీ!]
మానినీ నివహమన్మథ రూపా! 82

గద్య॥ ఇది శ్రీ భారతీ వరప్రసాద లబ్ధ విద్యా విచిత్ర, తిప్పన మంత్రి పుత్ర, సుజన విధేయ, భానయ నామధేయ, ప్రణీతంబయిన పంచతంత్రి యను మహా ప్రబంధంబునందు చతుర్థాశ్వాసము.



# పంచమాశ్వాసము

## గ్రంథపాతము

ఆ॥ వె॥ —— —— —— ——
—— —— —— ——
—— —— ల్లఁ దిరుగున
కులము గాంచి శోక కలితుఁ డగుచు 1

చం॥ నకులము నాత్మ నమ్మి నరనాథుని యొద్దకు బోవునంత, న
ర్భకుని వధించె, దీని జముపాలికిఁ బుచ్చెదనంచు ఆగ్రహుఁడై
ప్రకటిత రోషుఁడై యడఁచి ప్రాణములం బెడబాపి, యింటి లో
నికిఁ జని కాంచెనంత, ధరణీ సురముఖ్యుఁడు సర్పఖండముల్. 2

కం॥ వెండియుఁ బొదిగిఁట నాడుచు
నుండిన బాలకునిఁ జూచి, యుర్వీ సకాండో
ద్దండ తర [కోపవశతను]
దండించితిఁ జూడ నిర్విధంబున, నకటా! 3

సీ॥ చిటుగజ్జె మ్రోఁతలు చెవుల పండువు గాఁగఁ
దేకువ వెనుక నేతెంచు విధము,
చప్పుడాలించి మీసలు దీటుచునుఁ జెంతఁ
గూర్చుండి, నిక్కి కన్గొను తెఱంగు,
కలుఁగుల విహరించు నెలుకలు తండమ్ము
నెమకి పట్టుకవచ్చు నేర్పు కలిమి,
విష వైద్యుఁ డాడించు విషధరమ్ముల ఘుర్ఘు,
రారావమున డాయ నరుగు బాగు,

దలఁచి మదిలోన నెట్లోర్తు దైవమిట్టు
చేసె, నా నేర మెంతని చెప్పవచ్చు!
కలుషవశత నసంప్రేక్ష్య కారినైన
నన్ను దిగనాడి పోయితే! నకుల ముఖ్య! 4

వ॥ హితవాచరించిన నిన్ను నెఱుంగ లేనైతినని, బహువిధంబులం బొగులుచు నాత్మబుద్ధి నిందించుచున్న యవసరమ్మున, సస్యనేని, చనుదెంచి హతంబైన నకులంబును, ఖండిత భాగంబైన సర్పంబును గనుంగొని, యిది యేమని? జీవితేశ్వరుండడిగిన, నతండు గద్గద కంఠుండై నిట్టూర్పు నిగుడించుచుం దద్వృత్తాంతంబంతయు నెఱింగించె, నంత పుణ్యచారిణియగు నబ్భామిని దేవశర్మ వదనమ్ముపైం జూడ్కి నిలిపి, యల్లన నిట్లనియె,— 5

గీ॥ అధిప! యెన్నఁడేని నపరాధిగానను
ద్రుంపవలయు నతని దోసమనక,
మున్ను వైశ్యు నొకని, నెన్నంగ ముంగలి
నొకనిఁ, జంపె రాజు ప్రకటితముగ 6

కం॥ అన విని పాఱుఁడు సతితో,
వనితా! యా కథ నెఱుంగ వలయును, నాకున్
వినిపింపుమనిన, నా సఖి
తన భర్తకుఁ జెప్పఁ దొడగెఁ దాత్పర్యమున్ 7

సీ॥ మునుపొక్క నగరమ్మునను వైశ్యుఁ డొక్కఁడు
సౌవర్ణి యనువాఁడు సతియుఁ దాను
గాపురంబటు సేయఁ గలుగక కలిగెను
గడసారి, సుతుఁడు చొక్కముగ నతఁడు
పుట్టిన పదిదినములకు, నాతని తల్లి
జముఁగొల్వ వేగంబ జనిన పిదపఁ,
దల్లి గండంబని తండ్రి యెత్తుకపోయి
యూరి బయటను వానిఁ బారవైవ
భూమిదేవి, సతీరూపమునను వచ్చి
వైశ్యబాలను నెత్తుక వాంఛతోడఁ
జన్ను గ్రోల్చియు బోషింపఁ జతురవృత్తిఁ
బ్రబలె, నానాఁటికిని వాఁడు భౌమియనఁగ॥ 8

వ॥ అంతనా భౌమియు భూరక్షణంబునం బెద్దవాఁడై స్వకుల నిలయంబున వివాహంబైన భామవలనఁ గుమారకుఁ గుమారికలం బడసి యున్న యెడ;— 9

గీ॥ బంధురంబగు దారిద్ర్య బాధచేతఁ
వన్ను దిట్టుక దుఃఖ సంతాపుఁడగుచు,
విధిని దూఱుచు నొకనాఁడు వేగుఁబోక
నిద్రనొందిన వేళను భద్రముగను, 10

వ॥ అధికతర దారిద్ర్య దుష్కృతాపహారియగు నొక్క దివ్య పురుషుండా వైశ్యుని స్వప్నంబునవచ్చి, తన దేహకాంతులు తటిల్లతలన, నద్భుతంబుగా నిలువంబడిన నా వణిక్కు భయ సంభ్రమంబుల నతనికిఁ బ్రణామంబుఁ జేసిన నమ్మహాత్ముండును బ్రసన్న హృదయుండై యతనిం జూచి యోవత్స! మీ తల్లియగు నిల నన్ను నీకడ కనుప వచ్చినవాఁడ, నీ దారిద్ర్య నాశంబు సేయవచ్చిన యోగిశ్రేష్ఠుండ, నీవును నీ నిలయంబున నొక్క దీపిక యమర్చుకొని వేదికమీఁదఁ గూర్చున్న, భవదీయ గృహంబునకు భిక్షార్థంబు ముప్వురు భిక్షుకులేతెంతురు. వారలం జూచినయప్పుడ కరుణారహిత హృదయుండవై హస్తమ్మున లగుడమ్ము సంధించుక యా ముప్వుర వధింపుము, వారల కాయంబుల యందుండి మూఁడుకొప్పెరల ధనంబేతెంచు, నది నీ కబ్బు దానంజేసి నీ దారిద్ర్యమ్ము సర్వమ్మునుం బోవు నిది నిశ్చితార్థమ్ము తొలికొండకుఁ జండ కిరణుండే తెంచుచున్నవాఁడు, ప్రభాతంబున నేఁ జెప్పిన విధం బాచరింపుమని చెప్పి, యతండు తిరోహితుండయ్యె నయ్యవసరమ్మున,— 11

ఉ॥ ఆతఁడు మేలుకాంచి హృదయమ్మున నద్భుతమందుచుండి ప్ర
ద్యోతనుఁడైంద్ర దిక్ఛిఖరిఁ దోఁచినయప్పుడె, తీర్థమాడి ప్ర
ఖ్యాతిగ వేదికాసనమునందు సుఖాసనుఁడయ్యె, చేతుల
న్నాతత మాసలమ్మొకటి యడ్డయియుండఁగ, నద్భుతంబుగన్॥ 12

చం॥ కరముల దండమ్ము ల్మెరయఁ, గాయరుచుల్ వెలికుబ్బ, బాల భా
స్కర కిరణమ్ములన్ దెగడఁగా నరుదెంచిరి మందహాస భా
సుర వదనార విందులయి చూడుచు ముప్వురు భిక్షు, లంబరాం
తరమున నుండి నిర్జరులు ధాత్రిఁ జరింపగ వచ్చిరో! యనన్. 13

వ॥ అయ్యవసరమ్మున నా వణిక్కు నా ముప్వురు భిక్షులం జూచి స్వప్నంబు — యమ దండంబునుం బోలిన భుజాదండంబున నమర్చియున్న ముసలంబు నెత్తి భయంబులేక యాభిక్షుకత్రయమ్ము వధియించునప్పుడు వారలదేహమ్ములందుండి మూఁడు కొప్పెరల ధనంబుదయంబయ్యె నంత,— 14

కం॥ ఆకుణప త్రయ మొక్కట
జోకగ భూఖాతమందుఁ జొప్పించి తనున్
రాకొమరు లెఱుఁగకుండగఁ
బ్రాకటముగ ధనము నింటఁ బాతుక యుండెన్. 15

వ॥ ఇట్లు వైశ్యుండు లబ్ధద్రవ్యుండై సకల దారిద్ర్య విచ్ఛేదమ్ము సేసి సర్వసౌఖ్యములనుభవింపుచు బ్రాహ్మణ పూజా తత్పరుండై బంధుజన పారిజాతుండనఁ గళత్రలోలుండై సుఖంబుండెనంత,— 16

కం॥ ఆ కోమటికిని వశుఁడై
తేఁకువ నొక శూపకుండు ధీయుతుఁడై, తా
జోకను బనిసేయుచుఁ దే
*జో కీర్తులు వెలసియుండు, సురుచిర మహిమన్ 17

కం॥ ఆ మంగలి కోమటి సతిఁ
బ్రేమంబునఁ దగిలి యుండఁ, బ్రీతిని వణిజుం
డా మంగలి సతిఁ గూడుక,
తాము నన్యోన్య సతులఁ దగులుక యుండుర్. 18

వ॥ ఇట్లు త్రైవర్ణిక శూపకు లొకరొకరి భార్యలంగూడుక వినోదమ్ములు సలుపుచుండునంత, నొక్కనాఁటి రాత్రి నాపితుఁడు కోమటి భార్యతోఁ గూడి యుండి యిట్లనియె, భామా! భవద్గృహమ్ము పూర్వమ్ము వలెగాదిప్పుడు వస్త్రాన్నంబులకుఁ గొదువ లేకయుండిన యట్లున్నది యీ విధం బెఱిఁగింపు మనిన, నది యిట్లనియె,— 19

గీ॥ ముగురు భిక్షులు మా యింటి కగణితముగ
వచ్చియుండంగ మా సెట్టి వారిఁబట్టి
చంపివేసిన కతమున సకల ధనము
కలిగి యున్నది మాకని కాంత చెప్పె. 20

కం॥ చెప్పిన మాటలు మంగలి
తప్పక విని తాను నట్లు తాలుతుననుచు

* తేజఃకీర్తులని సంస్కరించినఁ బ్రాసభంగము.

నొప్పుగఁ జని యంగడిలో
గొప్పగఁ దిరుగాడు భిక్షుకుల ముగురిఁగనెన్ 21

గీ॥ చూచి వారలఁ జెంపంగ సొరిది నరిగి
భిక్షు మిడియెద రమ్మంచుఁ బిలిచి తెచ్చి,
తనదు నిలయమ్ము లోనికి ధార్మికులను
దెచ్చి బంధించి చంపగఁ దివురుటయును 22

కం॥ ఆ, సన్న, భిక్షు లెఱేఁగియు
మోసంబని కూతలిడఁగ, మూగుర నొకనిన్
వే, సమయింపగ, నంతటఁ
గాసిలి తలవరులు వచ్చి కనిరవ్వారిన్. 23

వ॥ ఇట్లు భిక్షుద్వయాంబష్ఠులఁ దలవరులం గనుంగొని యా పీనుఁ
గెక్కడిది యని యడిగిన యా జోగు లిట్లని తమ వృత్తాంతంబుం జెప్పిన, నా
మంగలిం బట్టికొని రాజ సన్నిధికిం దోడ్కొనిపోయి వాఁడు చేసిన దుర్వ్యవ
సాయంబు రాజునకు విన్నవించిన నతండు నా పితుని శూలప్రాప్తుం జేయు
మనిన, నా తలవరులు వానిం బంధించుకవచ్చునెడ, నాయంబష్ఠుం డిట్లనియె— 24

గీ॥ నేన కాదు, యిట్టి నీచ కృత్యము భామి
చేసినాఁడటన్న, వాసి నెఱేఁగి
వానిఁ బట్టుకొనియు వసుమతీపతి సమ్ము
ఖమునఁ బెట్టుమనియె [ఁగడఁక] నతఁడు 25

వ॥ ఇట్లు ధవుఁ డాగ్రహమ్మునఁ ద్రైవర్ణి కాంబష్ఠకుల నిద్దఱిని శూల
ప్రాప్తులం జేసి వారి భార్యల వృత్తాంతంబుఁ జారులచేత విని, వారల మేనఁ
దైలాంబరమ్ములు చుట్టి యగ్నిఁ దగిలింపించె నంత— 26

కం॥ కావున నీవును నకులము
జీవము ద్రుంచితివి గాన చేడ్పడ నిన్ను
న్నా విధము సేయవలెనని
దేవియుఁ బలికెఱుఁగఁ జెప్పి ధృతి నిట్లనియెన్॥ 27

కం॥ అమల సుకృతములకుం ద్వారి
తము, దారుణమైన దుష్కృతములకు నాల
స్యము, సేయవలయు ఘనులకుఁ
బ్రముదిత హృదయమున, నూత్న భరతాచార్యా! 28

కం॥ ఇది కార్యమిది యకార్యం
బిదియగు నిది కాదు నాక యెవ్వఁడొనర్పున్
దుది వాని క్రియలు చెడు బూ
డిద యందజ్ఞానమున నిడిన, హుతమువలెన్. 29

ఆ॥ వె॥ నీవు బిడ్డ వోలెనెఱి నకులమ్మును
జెంచి నిరపరాధి ద్రుంచితయ్య
విశ్వసింపలేని వేదుఱు చెడిపోవు
శిష్యయుగమువోలె సిద్ధముగను. 30

వ॥ అది యెట్లని యడిగిన సతి యిట్లనియె మున్నొక్క గిరి సమీపంబున నొక్క వనంబుగలదందు సిద్ధచటుండను యతిగలండా, యోగి తపోజ్ఞాన సంపన్నుండై విలసిల్లుచుండ, సితాసితులను నిద్దఱు మ్మహాత్ము నాశ్రయించి పెద్దకాలమ్ము శుశ్రూష సేయుచుండ నతండును వారల భక్తికిమెచ్చి సితునకుఁ గూ, యను నక్షరంబును నసితునకు, దా యను నక్షరంబునుంగా నిద్దఱికి ద్వ్యక్షరి యుపదేశించి వారలం జూచి శిష్యులారా! యిమ్మంత్రబులు మీకభీష్టమ్ము లిచ్చుఁ జనుండని యనిపినఁ, బెద్దయగువాఁడున్నత లోకేక్షణుండయ్యెఁ గనిష్ఠుండు నధో లోకేక్షణుండయ్యె నిట్లొండొరుల మనమ్మున నిశ్చయించుకొని గురువుచే నిమంత్రితులై, వియల్లోక పాతాళలోకమ్ములకుం జనిరంత,— 31

ఆ॥ వె॥ పెద్దయగు సితుండు దద్దయు నొక విమా
నంబుమీఁద నెక్కి తుంబురుండు
వోలె చనియునన్ని భూములు వెసఁజూచి
దిగువ సీమఁ జూడదు [విరి భువికి] 32

వ॥ వచ్చుచున్నంత— 33

కం॥ అసితుఁ డధో లోకమ్ముల
విశదమ్ముగఁ జూచి, మింటి వీధులఁ జూడన్
వెసఁదిరుగుచు రథమెక్కియుఁ
గసుగు వడక వచ్చుచుండఁ గనె తనయన్నన్ 34

వ॥ అట్లంబరతలమ్మునఁ— 35

ఆ॥ వె॥ చూఁచి మ్రొక్కి లేచి సురుచిరమ్ముగ మన
గురువు మంత్రశక్తి కుదురు కతన
నిట్టి భాగ్యమహిమ యింపుతో నబ్బెను
ననుచుఁ గౌఁగిలించుకొనుచు మఱియు 36

వ॥ అన్నా! మన గురువు చెప్పిన మంత్రమ్ము లోకరికొకరు విను నట్లుగా నుచ్చరింపవలయు, నీ మంత్రమ్ము నాకుఁ జెప్పుము, నా మంత్రమ్ము నీకుఁ జెప్పెదనని పల్కి, పెద్దయగువాఁడు గూ యనిచెప్పె, పిన్నయగువాఁడు దా యని చెప్పె, రెండక్షరమ్ములు గూర్చి పలుకనది దుర్ధ్వనిమ్మైన, నయ్యిరువురు రోసి యిట్టి యాభాస మంత్రంబుల నీనిచుండు మన కెఱిగింపవచ్చునే! యని గురువును నిందించిన నా యాకాశ పథమ్మున నుండి యయ్యిరువురు రథంబులతోడ, భూతలంబునం బడి చచ్చి యమలోకమ్మున కరిగిరంత. 37

సీ॥ మొదల విశ్వాసమ్ము పదిలమై యుండంగ
నా మంత్రమునఁ గల్గె నమర చర్య,
పిదప విశ్వాసమ్ము పేఁదమై యుండిన
నా మంత్రమునఁ జచ్చి రవనియందుఁ,
గావున గురువు నే కథను జెప్పిననైన
విశ్వసించుచు నుంట శాశ్వతంబు
నీవు మూంగిస మీఁద నెనరు లేకుండంగ,
నఘ సంచయమ్ము నిన్నలమి కొనియె

గీ॥ మనుజు పుట్టువుఁ బుట్టి యే మనుజుఁడైన
నొనర నవు గాములరయక యుండెనేని
శిష్యు చేతను గురువు చచ్చిన విధమ్ము
వచ్చునతనికి నని చెప్పె వారిజాక్షి. 38

కం॥ చెప్పిన పని విని యాకథఁ
జెప్పుమనిన మోహనాంగి చతురత తోడన్
చెప్పక [పతి కీ విధమున]
గొప్పగు మతిఁ జెప్పఁదొడఁగెఁ గోరికలూరన్ 39

సీ॥ నా నాథ! విను మున్ను నళిన సంభవునకు
వాసియౌ ననునట్టి బ్రాహ్మణుండు
బ్రహ్మచర్యంబున బ్రహ్మ విజ్ఞానంబు
జనియించి, మందిర స్థలిని నిల్వ
కా, తండు గహన మత్యాసక్తితోఁ జొచ్చి
విశద స్థలమ్మున విమలుఁడగుచు
నాసీనుఁడై హరి ననవరతమ్మును
[ధ్యానంబు] సేయుచుఁ దగిలియుండ

ఆ॥ వె॥ నొక్క వడుగువచ్చి గ్రక్కున నాతని
నాశ్రయించి హితము నడుగ వలసి
శిష్య వృత్తినుండ, చీకాకు పడి, వని
కారు చిచ్చు వొచ్చి కాలఁజొచ్చె 40

వ॥ ఇట్లు చైత్ర వైశాఖ మాసమ్ములలో మధ్యాహ్న కాలంబునఁ జిచ్చు దవిలి యడవి కాలం దొడంగిన సకల మృగంబులు, ఖగంబులు రొదలు చెలంగఁ, బరువందొడంగె, నప్పుడా యోగిలేచి శిష్యుండు వెంటరా, మృగంబు వోలె పరువందొడంగిన,— 41

ఆ॥ వె॥ పోయిపోయి కొంత ప్రొద్దెక్క చోటను
నలసి నిలువఁబడిన యతనిఁ జూచి
శిష్యవరుఁడు నగ్ని శీఘ్రత వచ్చె, నిం
కొదుగరాదు మనకుఁ గదలు మనియె॥ 42

వ॥ శిష్యుని వాక్యమ్ము లాదరించి గురువును సాంద్రగహన గిరి ప్రదమ్ములు దాటి చనుచో నతనికి దాహంబగ్గలంబై దప్పిండంద్గాఁకి, జల

శూన్యంబైన మార్గంబున నరుచుండ శిష్యుండును——పాత్రను జలమ్ములు సంగ్రహించుక నడుమ బహిర్భూమికిం జని, కొన్ని జలమ్ముల నాచమనమ్ముఁ జేసి తక్కిన జలమ్ములు సంగ్రహించుకొని వచ్చె, దానింజూచి గురు విట్లనియె. శిష్యవర్యా! నాకు దాహం బధికంబైయున్నది. నీ చేతి జలమ్ములు నాకుం బోయుమనిన నతం డిట్లనియె,—— 43

ఆ॥ వె॥ అనఘ! గుదముఁగడుగఁజన మిగిలున్న యీ
జలము నీకుఁ బోయఁజనదు నాకు,
బాపమందు ననుచుఁ బరుగునఁ బోవంగ
గురువుకూడఁ బోయి కొసరి యడిగె॥ 44

ఆ॥ వె॥ ఎట్టి జలములైన నేమైనఁగానిమ్ము
యిచట దప్పిదీఱయేను గ్రోలి
ప్రాణములను బ్రోచి పరగుదునన్నను,
దోయ మీకపోయె దోసమంచు. 45

కం॥ పోయెడి శిష్యునిఁ బట్టుక
కాయము రక్షింపుమనుచుఁ గాంక్ష నడిగినన్
బోయుమని యతనిఁ గడచుచుఁ
బాయఁగ వెసఁద్రోచి, జలము పాత్రను దాఁతన్॥ 46

కం॥ పగులగ నడిచినఁ గనుగొని
దిగులునఁ గుతికెండ నతఁడు దేహము విడిచెన్
అది కనుగొని యా శిష్యుఁడు
మదిఁగలఁగుచుఁ జనియెఁ దనదు మందిరమునకున్. 47

కం॥ కావున, మనుజుండుచితము
వే విధముల నెఱుఁగవలయు విశ్వములోనన్
ఆ విధము నెఱుఁగకుండిన
నా వేదుఱునంటు నఘము లవనిలో నాథా! 48

కం॥ అని సస్యసేని పతికిని
ఘనముగ నెఱిఁగించినట్టి కథనమును వేడ్కన్
బని నడగ విష్ణుశర్మయు
నెసరున సౌదర్శనులకు నెఱుఁగఁగఁ జెప్పెన్ 49

వ॥ ఇట్లు విష్ణుశర్మ సుదర్శన నరేంద్ర నందనులకుఁ బంచతంత్రమ్ము
లెఱింగించి వారల నీతి శాస్త్రకోవిదులం జేసెనని,— 50

సీ॥ పంపా విరూపాక్ష, భైరవ, విఠ్ఠలే
శ్వర, ముఖ్య దేవతా వ్రజముచేత,
పరి పంథి గర్వ విక్షాళన, శ్రీ కృష్ణ
రాయ భూధవ భుజారక్షచేత,
భట నట జ్యోతిష పౌరాణిక భిష గ్వి
చక్షణ సత్కవీశ్వరులచేత,
సంతత మదవారి చారు శుండాల ఘ
టా జవ ప్రకట ఘోటములచేత,

రమ్యమైయున్న విద్యా పురమ్మునందు,
నిమ్మహాకృతి భాను కవీశ్వరుండు
తెనుఁగు బాస నొనర్చెను విసుతికెక్క
నవని నాచంద్ర తారార్క మగుచుఁ దనర. 51

శా॥ దానాంభ స్తటినీ వివర్ధిత సముద్ర వ్రాత! దోః ఖడ్గ ధా
రా నిర్భేదన దర్ప శుంభద సుహృద్రాజన్య సర్వాంగ! యో
షాఽనూన ప్రసవాస్త్ర! సూక్ష్మ లిఖితాచార్యాంక! పద్మాధవ
ధ్యానా నందిత చిత్త! పార్వణ సుధా ధామాభ కీర్తిచ్ఛటా! 52

కం॥ తారాచల తారాధిప
శారద నీరదలసద్యశః కర్పూరా
పూరిత విధ్యండ కరం
డారూఢ! రమానిరంతరాంచిత సదనా! 53

తోదకము

వారిజ సంభవ వంశ [సముద్రాం]
భోరుహ మాశాత్రవ! భూరి కృపా వి
స్తార దృంగచల! సత్య వచస్సం
సార! వయోన్నత చారు చరిత్రా! 54

గద్య

ఇది శ్రీ భారతీ వరప్రసాద లబ్ధ విద్యా విచిత్ర, తిప్పనమంత్రి పుత్ర,
సుజన విధేయ, భానయ నామధేయ, ప్రణీతంబైన
పంచతంత్రి యను మహా ప్రబంధంబునందు
సర్వంబును పంచమాశ్వాసము

సంపూర్ణము

ఓం తత్సత్.

BULLETIN OF THE GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS.

## AN APPEAL.

The Government Oriental Manuscripts Library, Madras, is unique in point of variety and vastness of collections covering a very wide field of Indian Literature in Sanskrit, Tamil, Telugu, Kannada, Malayalam, Mahratti, Arabic, Persian and Urdu. The dates of several of the manuscripts go back to many hundreds of years. From an academic point of view, these collections contain some very interesting specimens of Literary, Scientific, Historical and Artistic importance. A large number of them have not yet been printed and some of them are available only in this Library. With a view to placing these manuscripts in the hands of the public in a printed form, the Government of Madras were pleased to sanction the starting of a BULLETIN under the auspices of the Government Oriental Manuscripts Library. For the present only two numbers are issued in a year. They contain critical editions of original works in Sanskrit, Tamil, Telugu, Kannada, Malayalam, Mahratti, Persian and Urdu. The annual subscription is only Rs. 4 inland and 8 shillings foreign. Scholars, Patrons of Culture, Universities, Public Libraries and Educational Institutions are requested to enrol themselves as susbscribers for this Bulletin and thus encourage the cause of Oriental Studies and Culture.

A few copies of back numbers are available for sale, post free, at the following prices which should be sent in advance.

| | |
|---|---|
| Vol. I, No. 2, July to December, 1948 | .. Rs. 2. |
| Vol. II, 1949 | .. Rs. 4. |
| Vol. III, 1950 | .. Rs. 4. |
| Vol. IV, 1951 | .. Rs. 4. |

T. CHANDRASEKHARAN,
*Curator,*
*Government Oriental Manuscripts Library.*

TRIPLICANE,
MADRAS-5.

# LIST OF CATALOGUES PUBLISHED BY THE GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS.

## SANSKRIT.

### DESCRIPTIVE CATALOGUES.

| | Numbers. | Price. RS | A. | P. |
|---|---|---|---|---|
| * Vol. I.—Part I, Vedic Literature .. | 1 to 46 | 0 | 12 | 0 |
| * Vol. I.—Part II. Vedic Literature .. | 47 to 245 | 0 | 12 | 0 |
| * Vol. I—Part III. Vedic Literature .. | 246 to 852 | 2 | 0 | 0 |
| * Vol. II.—Vedic Literature .. | 853 to 1245 | 1 | 12 | |
| * Vol. III.—Grammar, Lexicography and Prosody .. | 1246 to 1805 | 1 | 8 | 0 |
| * Vol. IV—Part I. Ithihāsa and Purāṇa .. | 1806 to 2337 | 1 | 8 | 0 |
| * Vol. IV.—Part II. Upapurāṇas and Sthalamāhātmyas .. | 2338 to 2610 | 1 | 4 | 0 |
| * Vol. V.—Dharmaśāstra .. | 2611 to 3045 | 1 | 8 | 0 |
| * Vol. VI.—Dharmaśāstra .. | 3046 to 3427 | 1 | 4 | 0 |
| * Vol. VII—Dharmaśāstra .. | 3428 to 3872 | 1 | 4 | 0 |
| * Vol. VIII.—Arthaśāstra, Kāmaśāstra and Systems of Indian Philosophy—Nyāya .. | 3873 to 4334 | 1 | 4 | 0 |
| * Vol. IX.—Systems of Indian Philosophy—Vaiśeṣika, Yoga, Mīmāmsā and Vedānta-Advaita Philosophy .. | 4335 to 4780 | 1 | 12 | 0 |
| * Vol. X.—Systems of Indian Philosophy—Dvaita, Viśiṣṭādvaita and Śaiva Vedāntas .. | 4781 to 5122 | 1 | 12 | 0 |
| * Vol XI.—Systems of Indian Philosophy .. | 5123 to 5558 | 1 | 12 | 0 |
| Vol. XII.—Religion .. | 5559 to 6266 | 1 | 12 | 0 |
| Vol. XIII.—Religion .. | 6267 to 7006 | 1 | 12 | 0 |
| * Vol. XIV.—Religion .. | 7007 to 7729 | 1 | 12 | 0 |
| * Vol XV.—Religion .. | 7730 to 8165 | 1 | 12 | 0 |
| * Vol. XVI.—Religion, Vrata and Pūjā .. | 8166 to 8780 | 1 | 12 | 0 |
| Vol. XVII.—Stotras .. | 8781 to 9357 | 1 | 12 | 0 |
| Vol. XVIII.—Stotras—Praśaṃsā Stotras .. | 9358 to 10540 | 1 | 12 | 0 |
| Vol. XIX.—Stotras—Praśamsā Stotras .. | 10541 to 11450 | 1 | 12 | 0 |
| Vol XX.—Kāvyas .. | 11451 to 12143 | 2 | 12 | 0 |
| Vol. XXI.—Kāvyas .. | 12144 to 12783 | 3 | 0 | 0 |
| Vol. XXII.—Rhetoric, Poetics, Music, Dancing and Śilpa śāstra .. | 12784 to 13068 | | 4 | 0 |
| Vol. XXIII.—Medicine .. | 13069 to 13381 | 1 | 8 | 0 |
| Vol. XXIV.—Jyotiṣa .. | 13382 to 14076 | 3 | 2 | 0 |
| * Vol. XXV.—Supplemental .. | 14077 to 14560 | 2 | 4 | 0 |
| Vol. XXVI.—Supplemental .. | 14561 to 15000 | 2 | 12 | 0 |
| Vol. XXVII.—Supplemental .. | 15001 to 15692 | 5 | 14 | 0 |
| Vol. XXVIII.—Supplemental .. | 15693 to 16200 | 3 | 12 | 0 |
| Vol. XXIX—Supplemental .. | 16201 to 16700 | 3 | 2 | 0 |
| Vol. XXX.—Supplemental .. | 16701 to 17200 | 7 | 10 | 0 |
| Vol. XXXI.—Supplemental .. | 17201 to 17700 | 11 | 12 | 0 |

### TRIENNIAL CATALOGUES.

| | Numbers. | RS | A. | P. |
|---|---|---|---|---|
| * Vol. I-A (1911—13) .. | 1 to 342 | 2 | 0 | 0 |
| * Vol. I-B (1911—13) .. | 343 to 573 | 1 | 6 | 0 |
| * Vol. I-C (1911—13) .. | 574 to 801 | 1 | 6 | 0 |
| Vol. II-A (1914—16) .. | 802 to 1329 | 18 | 2 | 0 |
| Vol. II-B (1914—16) .. | 1330 to 1456 | | | |
| Vol. II-C (1914—16) .. | 1457 to 1942 | | | |
| * Vol. III-A (1917—19) .. | 1943 to 2348 | 6 | 0 | 0 |
| * Vol. III-B (1917—19) .. | 2349 to 2679 | 6 | 0 | 0 |
| * Vol. III-C (1917—19) .. | 2680 to 2894 | 4 | 4 | 0 |
| Vol. IV-A (1920—22) .. | 2895 to 3203 | 9 | 0 | 0 |
| Vol. IV-B (1920—22) .. | 3204 to 3634 | 8 | 0 | 0 |
| Vol. IV-C (1920—22) .. | 3635 to 4155 | 10 | 0 | 0 |
| * Vol. V-A (1923—25) .. | 4156 to 4300 | 4 | 0 | 0 |
| * Vol. V-B (1923—25) .. | 4301 to 4415 | 2 | 8 | 0 |

## SANSKRIT—*contd.*

### TRIENNIAL CATALOGUES—(*cont.*)

| | | Numbers. | Price. RS. A. P. |
|---|---|---|---|
| * Vol. V-C (1923—25) | .. | 4416 to 5041 | 5 12 0 |
| Vol. VI (1926—28) | .. | 5042 to 5 80 | 10 0 0 |
| Vol. VII (1929—31) | .. | 5381 to 5532 | 2 14 0 |
| Vol. VIII (1931-32—1933-34) | .. | 5533 to 5700 | 1 4 0 |
| Vol. IX (1934—37) | .. | 5701 to 5996 | 6 0 0 |
| Vol. X-A (1937-38 to 1939-40) | .. | 5997 to 6496 | 14 10 0 |
| Vol. X-B and X-C (1937-38 to 1939-40) | .. | 6497 to 7496 | *In the press.* |

### GENERAL.

| | | | |
|---|---|---|---|
| Alphabetical Index of Sanskrit Manuscripts, Part I. | .. | | 13 12 0 |
| Alphabetical Index of Sanskrit Manuscripts, Part II | .. | | 10 0 0 |
| Alphabetical Index of Sanskrit Manuscripts, Part III | .. | | 3 6 0 |
| Author Index of Sanskrit Manuscripts | .. | | 1 8 0 |

## TAMIL.

### DESCRIPTIVE CATALOGUES.

| | | | |
|---|---|---|---|
| Vol. I.—Alphabet, Primer. Lexicography, Grammar and Literature | .. | 1 to 511 | 1 14 0 |
| Vol. II.—Itihāsa, Purāṇa, Religion and Philosophy (Vaiṣṇavism) | .. | 512 to 1122 | 2 2 0 |
| Vol. III.—Religion and Philosophy (Śaivism) | .. | 1123 to 1620 | 6 0 0 |
| Vol. IV.—Religion and Philosophy (Śaivism) | .. | 1621 to 1867 | 3 10 0 |
| Vol. V.—Alchemy, Medicine, Magic, Witchcraft and Supplement | | 1868 to 2173 | 6 0 0 |
| Vol. VI.—Miscellaneous | .. | 2174 to 2725 | 19 12 0 |
| Vol. VII.—Local Records | .. | 2726 to 2949 | 13 4 0 |
| Vol. VIII.—Local Records | .. | 2950 to 3169 | *In the press.* |

### TRIENNIAL CATALOGUES.

| | | | |
|---|---|---|---|
| Vol. I.—Miscellaneous (1910-13) | . | 1 to 114 | 1 6 0 |
| Vol. II.—Miscellaneous (1914-16) | .. | 115 to 310 | 4 14 0 |
| Vol. III.—Miscellaneous (1917-19) | .. | 311 to 409 | 5 0 0 |
| Vol. IV.—Miscellaneous (1920-22) | .. | 410 to 535 | 5 0 0 |
| Vol. V.—Miscellaneous (1923-25) | .. | 536 to 859 | 6 8 0 |
| Vol. VI.—Miscellaneous (1926-28) | .. | 860 to 952 | 4 10 0 |
| Vol. VII.—Miscellaneous (1929-34) | .. | 953 to 1055 | 2 6 0 |
| Vol. VIII.—Miscellaneous (1935-43) | .. | 1056 to 1473 | 34 14 0 |
| Vol. IX.—Miscellaneous (1944-49) | .. | 1474 to 1605 | 13 8 0 |

### GENERAL.

| | | | |
|---|---|---|---|
| Alphabetical Index of Tamil Manuscripts. Vol. I | .. | | 5 4 0 |
| Alphabetical Index of Tamil Manuscripts, Vol. II | .. | | 12 6 0 |
| Alphabetical Index of Tamil Manuscripts, Vol. III Local Records | .. | | 8 6 0 |
| Author Index of Tamil Manuscripts | .. | | 3 10 0 |

## TELUGU.

### DESCRIPTIVE CATALOGUES.

| | | | |
|---|---|---|---|
| Vol. I.—Ithihāsa, Purāṇa and Māhātmya | .. | 1 to 369 | 2 12 0 |
| Vol. II (1).—Śṛṅgāra Prabandhas | .. | 370 to 616 | 1 0 0 |
| Vol. II (2).—Śṛṅgāra Prabandhas | .. | 617 to 806 | 4 0 0 |
| Vol. III.—Śṛṅgāra Prabandhas | .. | 807 to 941 | 3 14 0 |
| Vol. IV.—Prabandhas—Dvipadakāvya | .. | 942 to 1221 | 5 12 0 |
| Vol. V.—Grammar, Prosody and Lexicography | .. | 1222 to 1 95 | 3 6 0 |
| Vol. VI.—Vacana Kāvyas | .. | 1396 to 1466 | 1 4 0 |
| Vol. VII.—Śatakas | .. | 1467 to 1833 | 5 6 0 |
| Vol. VIII.—Yakṣagānams and Daṇḍakams | .. | 1834 to 2040 | 4 10 0 |
| Vol. IX.—Vedānta | .. | 2041 to 2273 | 21 12 0 |
| Vol. X.—Gaṇita and Jyotiṣa | .. | 2274 to 2399 | 13 0 0 |
| Vol. XI.—Medicine | .. | 2400 to 2481 | 6 8 0 |
| Vol. XII.—Music (Saṅgīta) | .. | 2482 to 2592 | 7 6 0 |
| Vol. XIII.—History | .. | 2593 to 2 57 | 4 14 0 |
| Vol. XIV.—Local tracts (Mackenzie Collections) | .. | 1 to 150 | *In the press.* |

### TRIENNIAL CATALOGUES.

| | | | |
|---|---|---|---|
| Vol. I. Miscellaneons (1910 13) | .. | 1 to 137 | 1 6 0 |
| Vol. II.—Miscellaneous (1913-16) | .. | 138 to 292 | 2 6 0 |
| Vol. III.—Miscellaneous (1916-19) | .. | 293 to 539 | 6 0 0 |
| Vol. IV.—Miscellaneous 1919-22 | .. | 540 to 715 | 7 14 0 |
| Vol. V.—Miscellaneous (1922-28) | .. | 716 to 812 | 3 0 0 |
| Vol. VI.—Miscellaneous (1928-41) | .. | 813 to 1069 | 25 12 0 |

TELUGU—*contd.*

## GENERAL.

| | | Numbers. | Price. RS. A. P. |
|---|---|---|---|
| Alphabetical Index of Telugu Manuscripts | .. | | 3 12 0 |

## KANNADA.

### Descriptive Catalogues.

| | | Numbers. | Price. RS. A. P. |
|---|---|---|---|
| Vol. I.—Grammar, Lexicography, Prosody, Itihāsa and Purāṇa | | 1 to 138 | 6 0 0 |
| Vol. II.—Itihāsa and Purāṇa | .. | 139 to 317 | 4 12 0 |
| Vol. III.—Religion—Āgama | .. | 318 to 476 | 6 12 0 |
| Vol. IV.—Religion—Āgama, Vīraśaiva and Christianity | .. | 477 to 825 | 21 12 0 |
| Vol. V.—Religion and Kāvyas | .. | 826 to 1038 | 35 2 0 |
| Vol. VI.—Kāvyas | | | *In the press.* |

## GENERAL.

| | | Numbers. | Price. RS. A. P. |
|---|---|---|---|
| Alphabetical Index of Kannada Manuscripts | .. | | 2 4 0 |

## MALAYALAM.

### Descriptive Catalogues.

| | | Numbers. | Price. RS. A. P. |
|---|---|---|---|
| Vol. I Miscellaneous | .. | 1 lo 351 | 8 2 0 |
| Vol. II Do. | .. | 352 to 368 | 2 8 0 |

## GENERAL.

| | | Numbers. | Price. RS. A. P. |
|---|---|---|---|
| Alphabetical Index of Malayalam Manuscripts | .. | | 0 2 0 |

## ISLAMIC LANGUAGES.

| | | Numbers. | Price. RS. A. P. |
|---|---|---|---|
| Descriptive Catalogue of Islamic Manuscripts, Vol. I | .. | .. | 13 14 0 |
| Descriptive Catalogue of Islamic Manuscripts, Vol. II | .. | .. | 16 12 0 |
| Alphabetical Index of Urdu Manuscripts | .. | .. | 0 2 0 |
| Alphabetical Index of Persian Manuscripts | .. | .. | 1 2 0 |
| Alphabetical Index of Arabic Manuscripts | .. | .. | 0 8 0 |

## MARATHI.

| | | Numbers. | Price. RS. A. P. |
|---|---|---|---|
| Alphabetical Index of Marāṭhī Manuscripts<br>Subject Index of Marāṭhī Manuscripts | } | In one volume | 9 14 0 |
| Descriptive Catalogue of Marāṭhī Manuscripts—Kaifiyats | .. | | *In the press.* |

---

*N. B.*—*The books marked with an asterisk are out of stock.

# LIST OF BOOKS PUBLISHED BY THE GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS, UNDER THE MADRAS GOVERNMENT ORIENTAL MANUSCRIPTS SERIES.

| Serial Number | Name of the work. | Name of the Editor. | Language | Price. Rs. A. P. |
|---|---|---|---|---|
| 1. | *Sarva-siddhānta-saṅgraha | M. Rangacarya, M. A. Rao Bahadur. | SANSKRIT. | 0 12 0 |
| 2. | *Gaṇita-sārasaṅgraha | Do. | Do. | 2 4 0 |
| 3. | Padya-cūḍāmaṇi with commentary | Do. | Do. | 2 8 0 |
| 4. | Brahma-siddhi with commentary | Mahāmahopādhyāya S. Kuppuswami Sastri. | Do. | 7 12 0 |
| 5. | Ratneśvara-prasādana-nāṭakam | P. P. S. Sastri | Do. | 1 2 0 |
| 6. | Rāmānuja-campū with commentary | Do. | Do. | 3 0 0 |
| 7. | Mahābhāṣya with the commentary of Kaiyaṭa and super-commentary - Pradīpoddyotana of Annambhaṭṭa, Vol. I. Āhnikas 1 to 4. | P. P. S. Sastri & Dr. A. Sankaran. | Do. | 20 12 0 |
| 8. | Śāstradīpikā with the commentary Mayūkhāvaḷi | P. P. S. Sastri | Do. | *In the press.* |
| 9. | Bāla bhārata with commentary | Do. | Do. | 2 0 0 |
| 10. | Nayā-mañjarī | Do. | Do. | 2 0 0 |
| 11. | Ḍamarukam with commentary | Do. | Do. | 0 8 0 |
| 12. | Śṛṅgāra-prakāśa. Part I. | Do. | Do. | 1 8 0 |
| 13. | Mahābhāṣya with the commentary of Kaiyaṭa and the super commentary Pradīpoddyotana of Annambhaṭṭa. Vol. II. Āhnikas 5 to 9. | T. Chandrasekharan, M. A., L. T. | Do. | *In the press.* |
| 14. | Naṉṉūṟ Kāṇḍikaiyurai. | Do. | TAMIL. | *In the press.* |
| 15. | Māṇikka-vācakar Ammāṉai. | Do. | Do. | Do. |
| 16. | Adi-parvattādi-parvam. | Do. | Do. | Do. |
| 17. | Vasu-carittiram. | Do. | Do. | Do. |
| 18. | Sakala-nīti-kathā-nidhānamu. | Do. | TELUGU. | Do. |
| 19. | Pañca-tantramu. | Do. | Do. | Do. |
| 20. | Sundara-kāṇḍam (Rāmāyaṇam) by Venkamatya. | Do. | KANNADA. | Do. |
| 21. | Bhāgavatam Bhāṣā | Do. | MALAYALAM | Do. |
| 22. | Raṅgābhyāsam. | Do. | Do. | Do. |

*N. B*—No. 5 is available at the Balamanorama Press, Mylapore, Madras.
Nos. 8 to 12 are available at the Sri Vani Vilas Press, Srirangam.
*The books marked with an asterisk are out of stock.

# LIST OF BOOKS PUBLISHED BY THE GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS, UNDER THE MADRAS GOVERNMENT ORIENTAL SERIES.

| Serial Number. | Name of the work. | Name of the Editor. | Language. | Price. Rs. A. P. |
|---|---|---|---|---|
| I. | Kappal Śāttiram | T. P. Palaniappa Pillai, B. O. L. | *Tamil* | 1 10 0 |
| II. | Anubhava Vaiddiya Murai. Volumes I & II. | Dr. C. Dorairajan & Dr. C. S. Uttamarayan, H. P. I. M. | Do. | |
| | Vol. I | | | 3 14 0 |
| | Vol. II | | | 4 8 0 |
| III. | Aṭṭāṇa Kōlāhalam | Tirumalai Sri Saila Sarma | Do. | 5 0 0 |
| IV. | Upadēsa-kāṇḍam Volumes I, II & III. | V. S. Chengalvaraya Pillai, M. A. | Do. | |
| | Vol. I | | | 4 10 0 |
| | Vol. II | | | 5 0 0 |
| | Vol. III | | | 5 8 0 |
| V. | Cōlan Pūrva Paṭṭayam | C. M. Ramachandra Chettiar, B.A., B.L. | Do. | 5 0 0 |
| VI. | Koṅgadeśa Rājākkaḷ | Do. | Do | 1 8 0 |
| VII. | Sivajñāṇa-dīpam | T. P. Palaniappa Pillai, B O L. | Do. | 1 6 0 |
| VIII. | Daṭca-nāyaṇār Vaiddiya Aṭṭavaṇai | Dr. R. Tyagarajan, L.I.M. | Do. | 1 8 0 |
| IX. | Abhinaya-darpaṇamu | T. V. Subba Rao, B.A., B.L. | *Telugu* | 1 12 0 |
| X. | Auṣadha-yōgamulu | Dr. Veturi Sankara Sastri | Do. | 3 12 0 |
| XI. | Vaidya Nighaṇṭuvu | Do. | | 2 12 0 |
| XII. | Dhanur-vidyā Vilāsamu | Veturi Prabhakara Sastri | Do. | 4 14 0 |
| XIII. | Yōga-darśana-viṣayamu | Vedam Lakshmi Narayana Sastri, B.O L. | Do. | 1 2 0 |
| XIV. | Khaḍgalakṣaṇa Sirōmaṇi | N. Venkata Rao, M.A. | Do. | 1 12 0 |
| XV. | Tantra-sāra saṅgraha (Viṣanārāyaṇīya) | Vaidyaratna. Dr. M. Doraiswami Ayyangar | *Sanskrit* | 15 4 0 |
| XVI. | Bhārgava-nāḍikā | Dr. C. Kunhan Raja, M.A., D. Phil. | Do. | 6 0 0 |
| XVII. | Hariharacaturaṅgam | S. K. Ramanatha Sastri | Do. | 6 8 0 |
| XVIII. | Brahma-sūtravṛtti-Mitākṣarā of Annambaṭṭa | P. S. Rama Sastri | Do. | 7 0 0 |
| XIX. | Nyāyasiddhānta-tattvāmṛtam of Srinivasa | S. Subrahmanya Sastri, B O. L. | Do. | 2 8 0 |
| XX. | Garbha-cikitsā | Dr. N. Madhava Menon, A.M.A.C., | *Malayālam* | 3 8 0 |
| XXI. | Vāstulakṣaṇam and Silpaviṣayam | S. K. Ramanatha Sastri | Do. | 2 0 0 |
| XXII. | Kaṇakku-sāram-Bālaprabōdham | Dr. C. Achuta Menon, B.A., Ph. D. | Do. | 2 0 0 |
| XXIII. | Kaṇakku-sāram | Do. | Do. | 2 12 0 |
| XXIV. | Kriyākramam | P. Narayanan Kutty Menon, M.A. | Do. | 2 4 0 |
| XXV. | Lōkōpakāra of Cāmuṇḍarāya | H. Sesha Ayyangar | *Kannada* | 8 0 0 |
| XXVI. | Raṭṭa atam | Do. | Do. | 4 4 0 |
| XXVII. | Vaidya-sāra-saṅgraha | Vaidyaratna Dr. G. Srinivasamurti, B.A., B.L., M.B. & C.M. | Vol. I | *In the press* |

| Serial Number. | Name of the work | Name of the Editor | Language | Price. |
|---|---|---|---|---|
| XXVIII. | Aśva-śāstram of Abhinavacandra | Dr. P. Srinivasa Rao & H Sesha Ayyangar | *Kannada* | 4 2 0 |
| XXIX. | Auṣadhagalu-Vaidya Viṣaya | Vaidyaratna Dr. G. Srinivasamurthi. B.A., B.L., M.B. & C.M. | Do | 6 14 0 |
| XXX. | Saṅgīta-ratnākara | M. Mariappa Bhat, M.A., L.T. | Do. | 1 8 0 |
| XXXI. | Sūpa Śāstra | U Sitaramacarya | Do. | 2 0 0 |
| XXXII | Jami-al-Ashya | Afzal-ul-Ulama Hakim Abdul Qadir Ahmed Sahib | *Persian* | 13 8 0 |
| XXXIII. | Tibb-e-Faridi | Do. | Do. | 8 4 0 |
| XXXIV. | Tahqiq-al-Buhran | Do. | Do. | 1 8 0 |
| XXXV. | Safinat-al-Najat | Janab Rahim Ahmed Farooqui, M.A. | Do | 1 10 0 |

Serial Nos. XXXVI to LXX were published under the auspices of the TANJORE MAHARAJA SERFOJI'S SARASWATHI MAHAL LIBRARY. TANJORE.

| | | | | |
|---|---|---|---|---|
| LXXI. | Vaiddiyak Kalañciyam | Dr. C. N. Kuppuswami, H.P.I.M., & Dr. V. S. Parvati, L.I.M. | *Tamil* | 2 8 0 |
| LXXII. | Anubhava-vaiddiya-murai, Vol. III. | Do. | Do. | 5 0 0 |
| LXXIII. | Anubhava Vaidyamu | Dr. Mulugu Visvesvara Sastri, H.P.I M. | *Telugu* | 6 0 0 |
| LXXIV. | Saivācāra-saṅgrahamu | Vidvan G. J. Somayaji, M.A., L T. | Do. | 2 0 0 |
| LXXV. | Ārogya-cintāmaṇi | Dr. N. Visvanatha Sarma | *Sanskrit* | 9 0 0 |
| LXXVI. | Tattvasāra with Ratnasāriṇī | Karappankad V. S. Venkatacaryaswami, | Do. | 6 0 0 |
| LXXVII. | Sūtrārthāmṛtalaharī | Dr. R. Nāgaraja Sarma. M.A, Ph.D., L.T. | Do. | 3 4 0 |
| LXXVIII. | Ratna-dīpikā and Ratna śāstram | Sri P. S. Rama Sastri | Do. | 2 4 0 |
| LXXIX. | Aśva-cikitsā | Dr. C. K. Velayudhan Nair, B. V. Sc. | *Malayālam* | 1 8 0 |
| LXXX. | Phalasāra-samuccaya | Dr. C. Achutha Menon. B.A. Ph.D | Do. | 8 0 0 |
| LXXXI. | Mahā-sāram | Dr. M. K. Vaidyar, A.M.A.C. | Do | 11 0 0 |
| LXXXII. | Saptariṣi-nāḍi | Professer K. Natesan | *Tamil* | 20 0 0 |
| LXXXIII. | Karnāṭaka Rājākkaḷ Savistāra Carittiram | V. R. Ramachandra Dikshitar, M.A. | Do. | *In the press.* |
| LXXXIV. | Bharata-siddhāntam | P. Sambamurti, B.A., B.L. | Do. | Do. |
| LXXXV. | Piḷḷaippiṇi-Vākaṭam | Vaidyaratna Dr. M. Duraiswami Ayyangar | Do. | Do. |
| LXXXVI. | Anubhava Vaiddiyam Vol. IV | Dr. C N. Kuppuswami, H. P. I. M. | Do. | Do. |
| LXXXVII. | Māṭṭu-Vākaṭam | Dr. I. M. Azizuddin, B.A., G.M.V C.; B.V. Sc., Ph. D. (Edin.) | Do. | Do. |
| LXXXVIII. | Brahma Vidyā Sudhārṇavamu | V. V. Kriṣna Rao, B.A. | *Telugu* | Do. |
| LXXXIX. | Rāgatāḷa Cintāmaṇi | T. V Subba Rao, B.A., B.L. | Do. | Do. |
| XC. | Vaidya-cintāmaṇi | Dr. Mulugu Visvesvara Sastri, H.P.I.M. | Do. | Do. |
| XCI. | Kumāra Rāmuni Kathā | Dr. N. Venkataramanayya, M.A., Ph.D. | Do. | Do. |
| XCII. | Kāṭamarāju Caritra | Sri V. Prabhakara Sastri | Do. | Do. |
| XCIII. | Deva-keraḷam (Candrakalā-nāḍī) | Sri T. S. Ranganatha Josyar | *Sanskrit* | Do |

| Serial Number. | Name of the work. | Name of the Editor. | Language. | Price. |
|---|---|---|---|---|
| XCIV. | Pātañjala - Yogasūtra-bhāṣya-vivaraṇam | P. S Rama Sastri and S. R. Krishanamurti Sastri | *Sanskrit* | *In the Press* |
| XCV. | Kiḷi-vaṇḍu-samvādam | V. H. Subrahamanya Sastri | *Malayālam* | Do. |
| XCVI. | Advaita-vedāntam | S. K. Ramanatha Sastri | Do. | Do. |
| XCVII. | Bārhaspatya-sūtra with Commentary | Dr. C. Achyuta Menon, B.A., Ph. D. | Do. | Do. |
| XCVIII. | Karaṇa-paddhati | Do. | Do. | Do. |
| XCIX. | Yōga-sāram | Dr. M. K. Vaidyar A.M. A.C. | Do. | Do. |
| C. | Vaidya-sāra-saṅgraha Volume II | Vaidyaratna Dr. G Srinivasamurti, B.A., B.L., M.B. & C. M. | *Kannaḍa* | Do. |
| CI. | Sadguru-rahasya | Sri M. Mariappa Bhat, M. A., L.T | Do. | 2 6 0 |
| CII. | Shawakil-al-Hur | Dr. M. Abdul Haq, M.A. D. Phil. | *Arabic* | *In the press* |

*Terms of Sales*

Packing, Postage and Sales Tax extra.

25 per cent. discount will be allowed to all *bona fide* book-sellers.

Books will not be sent by V. P. P.

The cost of the books together with the sales tax, packing and postal charges, should be sent in advance to:

THE CURATOR,
GOVERNMENT ORIENTAL MANUSCRIPTS
LIBRARY, UNIVERSITY BUILDINGS.
TRIPLICANE, MADRAS 5.
INDIA.

M. L. J. PRESS, MADRAS—4.